# ఆధునికాంధ్ర కవిత్వంలో ఆత్మాశ్రయత్వం

## (Subjectivity in Modern Telugu Poetry)



డా॥ ఎస్. జి. డి. చంద్రశేఖర్
రీడర్
తెలుగు అధ్యయన శాఖ
యస్. వి. యూనివర్సిటి
తిరుపతి

శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం
తిరుపతి
1988

ప్రథమ ముద్రణ - 1988

ప్రతులు 400





వెల : రూ 45-00



ప్రచురణ :

శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం

తిరుపతి - 517 502

ముద్రణ :

క్రిష్ణా ప్రింటింగ్ ప్రెస్

హరనాథవీధి

రాయచోటి-516 269.

# అంకితం

కష్టాల్లో వెంట ఉండి
నష్టాల్లోనూ వెంట ఉండి
అష్టకష్టాలను నా నుంచి దూరంచేసే
చెల్లి హేమకు ప్రేమతో

కనుగూడులు వల్లనయి

పెను మ్రోడులు చల్లనయి

కీలు కీలుగా బాధగా

నాడు నాడులు లాగగా

....    ....    ....

కర్రనానుక సాగిపోయే

ఎముకల గూడుని అరిగి పోయిన జోడుని

- తిలక్

# కృతజ్ఞతాంజలి

ఆధునికాంధ్ర కవిత్వంలో పరిశోధనచేయాలన్న కుతూహలం ఉన్న నాకు "ఆధునికాంధ్ర కవిత్వంలో ఆత్మాశ్రయత్వం" అన్న అంశం పై పరిశోధన చేయడానికి ఆప్యాయతతో అనుమతించిన ఆచార్యా జి. ఎస్. రెడ్డి గారికి కృతజ్ఞతతో కూడుకున్న అభివందనాలు.

నా పరిశోధనా కాలంలో పర్యవేక్షణా బాధ్యత వహించడమేకాకుండా తమ వద్దవున్న అమూల్యమైన ఆధునిక కవితా సంపుటాలు. వ్యాస సంకలనాలు ఇచ్చి నన్ను ప్రోత్సహించి నా పరిశోధన సంపూర్తి కావడానికి దోహదం చేసిన గురువర్యులు డా॥ మద్దూరి సుబ్బారెడ్డి గారికి కృతజ్ఞతా పూర్వక నమస్సులు;

నా పరిశోధనాంశాన్ని చెప్పగానే విమర్శనా దృష్టితో ఆత్మాశ్రయత్వం పై తమ అభిప్రాయాల్ని చెప్పిన డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి గారికి, వడ్డెర చండీదాస్ గారికి నా వినయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

ఆంధ్ర సారస్వతము, ఆంధ్ర విద్యార్థి అభినవ సరస్వతి, తెలుగు, త్రివేణి నవోదయ. ప్రజామిత్ర, ప్రతిభ, కృష్ణా పత్రిక, జాగృతి, కల్పలత మొదలైన పత్రికలు, ఆధునిక గ్రంథాలు చూడటానికి అనుమతినిచ్చి నా పరిశోధనకు తోడ్పడిన వేటపాలెం సారస్వత నికేతన్ గ్రంథాలయ అధికారులకు -

మిత్ర వాత్సల్యంతో నా పరిశోధనకు కావలసిన వివిధ కవుల కవితా సంపుటాలను అవసరం వచ్చినప్పుడల్లా ఓపికతో సమకూర్చి పెట్టిన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం గ్రంథాలయ తెలుగు విభాగంలో వుంటున్న శ్రీ షణ్ముగానికి -

ఎస్. వి. యు. ఓ. ఆర్. ఐ. లో గ్రంథాలయ విభాగాన్ని చూస్తూ వుంటి నాకు గ్రంథ సేకరణలో తోడ్పడిన ప్రభాకర రావుకి -

అడిగిన వెంటనే శ్రమ అనుకోకుండా తమ సిద్ధాంత గ్రంథాల్ని పంపి నాతో సహకరించిన యస్. భక్తవత్సల రెడ్డికి, జి. చెన్నకేశవ రెడ్డికి -

నా పరిశోధన కుంటు పడుతుందేమోనన్న ఆలోచనతో అనుక్షణం నన్ను కార్యోన్ముఖుణ్ణి చేస్తూ సకాలంలో నా పరిశోధన పూర్తికావడానికి సాదరంగా

తోడ్పడిన డా॥ కేతు విశ్వనాథరెడ్డి గారికి, డా॥ పాపిరెడ్డి నరసింహారెడ్డికి, ఎలవర్తి చంద్రమౌళికి -

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలోనే ఆరుద్రపై పరిశోధన చేస్తూ ఆరుద్రగారి అముద్రిత రచనల్ని యిచ్చి సహకారంచేసిన మిత్రుడు కె. చంద్రారెడ్డికి, అప్పుడప్పుడు సాహిత్య విషయ వాదోపవాదాలకు దిగి నాతో ఆలోచింపజేసిన సాహితీ మిత్రులు గిరిజా మనోహరబాబుకి, కె యస్. రమణకి, టి. జి. ఆర్. ప్రసాద్ కి -

నా సిద్ధాంత వ్యాసాన్ని క్రమకోర్చి టైపులో ముద్రించి యిచ్చిన అంగర పురుషోత్తంకి, యం. శ్రీనివాసులురెడ్డికి కృతజ్ఞతలు.

టైపు ముద్రణలోని దోషాల్ని సరిదిద్దటంలో నాతోకూడా ఉండి సహకరించిన చెల్లి కుమారి ఎస్. హేమలతకు ప్రేమపూర్వక శుభాశీస్సులు.

ఈ సిద్ధాంత వ్యాసానికి పరీక్షకులగా వ్యవహరించిన ఆచార్యులకు కృతజ్ఞతలు.

ఈ సిద్ధాంత గ్రంథాన్ని ప్రచురించిన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారికి ధన్యవాదాలు.

ఈ సిద్ధాంత గ్రంథాన్ని అందంగా ముద్రించి ఇచ్చిన క్రిష్ణా ప్రింటింగ్ ప్రెస్ యజమానికి, వారి సిబ్బంధికి కృతజ్ఞతలు.

తిరుపతి
జనవరి - 1989.

ఎస్. జి. డి. చంద్రశేఖర్.

...

# విషయ సూచిక

# ఉపక్రమణిక

ఈ శతాబ్ది ఆరంభం నుంచి ఆధునిక తెలుగు కవిత్వంలో ఎన్నో కవిత్వ ఉద్యమాలు, పోకడలు చోటు చేసుకొన్నాయి. అందులో కొన్నికాల ప్రవాహానికి ఎదురీది ప్రత్యేక కవిత్వ ఉద్యమాలుగా, కవిత్వ పోకడులుగా నిలదొక్కు కొన్నాయి.

సాహితీ సాగరంలో లేస్తూ పడుతూవున్న ఉద్యమ కెరటాలు కొన్ని ప్రత్యేక లక్షణాల్ని సంతరించుకొంటూ వుంటాయి. అవి కాల కెరటాల విన్యాసంలో అంచులు తీరి బలపడతాయి. ఆధునికాంధ్ర కవిత్వంలో భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం ఇలా ఉద్యమాలుగా స్థిరపడి ప్రత్యేకతని సంతరించుకొన్నవే.

ఆధునికాంధ్ర కవిత్వం లోతుపాతుల్ని, వైశాల్యాన్ని తెలుసుకోడానికి వివిధ దృక్కోణాల్లో పరిశోధనలు కొనసాగుతూ వున్నాయి. భావ,అభ్యుదయ కవిత్వ స్వరూప స్వభావాలపైనపరిశోధనా గ్రంథాలు, వ్యాసాలు వెలువడుతూ వున్నాయి. అంతేకాకుండా ఆధునికాంధ్ర కవిత్వంలో ప్రత్యేకంగా కొంతమంది కవులపైన కూడా పరిశోధన జరిగింది, జరుగుతూవుంది. ఈఆధునికాంధ్ర కవిత్వ ఉద్యమాలకీ పోకడలకీ వాహికలైన గేయంపైనా, వచనంపైనా సమగ్రమైన పరిశోధనలు నిర్వహింపబడుతూ వున్నాయి.

ప్రాచీన కవిత్వంనుంచి ఆధునిక కవిత్వాన్ని వేరుచేసే అంశాల్లో వస్తువైవిధ్యం,భావుకత సంక్షిప్తత, శైలీనవ్యత, ఆత్మాశ్రయధోరణి వంటివి ప్రాముఖ్యం వహించాయి. వీటిలో ఆత్మాశ్రయ ధోరణి ఆధునిక కవితలో అధికంగా చోటు చేసుకొంది. ఈ ఆత్మాశ్రయ ధోరణి ఆధునికాంధ్ర కవిత్వంలో ఎందుకు ప్రతి బింబించింది? ఎలా ప్రతి బింబించింది? దానిస్వరూప స్వభావాలేమిటి? అన్న ప్రశ్నలు జనించటం సర్వసాధారణం. ఈవిషయ చర్చకు పరిమితంచేసుకొని ఈసిద్ధాంత వ్యాసానికి 'ఆధునికాంధ్ర కవిత్వంలో ఆత్మాశ్రయత్వం' అన్న శీర్షిక పెట్టడం జరిగింది.

కవిత్వాన్ని ఎన్నో రకాలుగా విభజించుకోవచ్చు. కవిత్వంలో వస్తువును బట్టి, వెలువడిన కాలాన్నిబట్టి, నిర్వహింపబడిన వాహికలను బట్టి కొన్ని విభా

గాలు ఏర్పడ్డాయి. పురాణ కవిత్వం, ప్రబంధ కవిత్వం, శతక కవిత్వం మొదలైన విభాగాలు వస్తువును బట్టి వచ్చాయి. ప్రాచీనకవిత్వం, ఆధునిక కవిత్వం, వంటిభాగాలు కాలాన్ని బట్టి ఏర్పడ్డాయి. మార్గకవిత్వం, దేశికవిత్వం, గేయ కవిత్వం వచనకవిత్వం వంటివి కవిత్వ వాహికలను బట్టివెలువడ్డాయి.

ఇలా కాకుండా స్థూల దృష్టితో కవిత్వాన్ని వస్త్వాశ్రయ కవిత్వం, ఆత్మాశ్రయ కవిత్వం అనే విభాగాలుగా కూడా విభజించటంవుంది. పాశ్చాత్య సాహిత్య విమర్శకులుకూడా కవిత్వంలో ఈ విభాగాన్ని చెప్పారు. ఈ విభాగం కవిత్వంలో వస్తుప్రాధాన్యాన్ని బట్టి ఏర్పడిందిగా కనిపిస్తూవుంది.

ప్రారంభదశలో ఆధునిక కవిత్వం వస్తుప్రాధాన్యంగా కొనసాగలేదు. ఈ వస్తురాహిత్యమే ఆధునిక కవిత్వంలో కొంత విస్తృతరూపం దాల్చింది. దీన్నే ఆత్మాశ్రయ కవిత్వం (Subjective Poetry) అని వ్యవహరిస్తున్నారు. ఈ తత్వాన్నే ఆత్మాశ్రయతత్వం అనీ, ఆత్మాశ్రియత్వం (Subjectivity) అనీ పేర్కొంటూ వున్నారు. వ్యక్తివాదంతో కూడుకొని భావ ప్రాధాన్యతకు ప్రాముఖ్యం ఇస్తూ వెలువడిన కవిత్వం అంతా ఈ కోవకు చెందుతుంది. ఇందులో వస్తు ప్రాధాన్యం వుండదు ఆత్మ ప్రకటనే ముఖ్యంగావుంటుంది. ఇదివస్తు రహితంగా వుండటమ్ కాకుండా పాత్రల, వర్ణనల, అలంకారాల ప్రాబల్యాన్ని కూడ కవిత్వంలో తగ్గించింది.

ఆధునిక కాలంలో తెలుగు కవిత్వంలో ప్రాధాన్యం వహించిన ఇలాంటి కవిత్వాన్ని గూర్చిన ప్రస్తావనే ఈసిద్ధాంత వ్యాసముఖ్య ఉద్దేశం.

ఈసిద్ధాంత వ్యాసంలో ఏడు అధ్యాయాలున్నాయి. మొదటి అధ్యాయం ఆధునికాంధ్ర కవిత్వ ఆవిర్భావ వికాసాల చర్చకుద్దిష్టమైంది. ప్రాచీన కవిత్వం క్షీణోన్ముఖం కావటంతో 20వ శతాబ్ది ప్రారంభంలోని దేశకాల పరిస్థితుల, పాశ్చాత్య సాహిత్య ప్రభావాల కారణంగా నవ్య కవిత్వం ఆవిర్భావించటాన్ని గూర్చి, అందులోని ఉద్యమాల స్వరూప స్వభావాల్ని గూర్చి ఈ అధ్యాయంలో రేఖామాత్రంగా ప్రస్తావించటం జరిగింది.

రెండవ అధ్యాయంలో కవిత్వంలోని ప్రధానమైన రెండు రీతులు-వస్త్వాశ్రయ, ఆత్మాశ్రయ రీతులు, వాటికి సంబంధించిన నిర్వచనాలు, వివిధ కవుల

విమర్శకుల అభిప్రాయాలు వివరించే ప్రయత్నం చేశాను. ఈ అధ్యాయంలో కవి ఆత్మాశ్రయతని ప్రదర్శించటానికి గల కారణాల పరామర్శవుంది. ప్రాచీన కవులు కూడా ఆధునిక కవుల్లాగే కష్టాలకు గురైనప్పుడు ఆత్మాశ్రయులై కవితలు రచించటం ఈ సందర్భంలోస్ఫురణకు తెచ్చుకోవటం జరిగింది. ఇందులో ముఖ్యంగా ఆత్మాశ్రయ కవితకు, అనుభూతి కవితకు వున్న భేదసాదృశ్యాల విషయం కూడా ప్రస్తావించడమైంది. చివరగా ఆత్మాశ్రయత్వంపై వున్న విమర్శలను గూర్చిన వివరణ, వాటికి సమాధానాలు చెప్పటం జరిగింది.

'ప్రాచీన కవిత్వం - ఆత్మాశ్రయత్వం' అన్న మూడవ అధ్యాయంలో నన్నయ దగ్గరనుంచి నేటివరకు వున్న కవిత్వాన్ని ప్రక్రియా పరంగా వర్గీకరించి అందులోని వస్త్వాశ్రయ-ఆత్మాశ్రయ రీతుల్ని వింగడించి చూపటం జరిగింది. ఇందులో పురాణ, ప్రబంధ, అవధాన, ఆశు, తిట్టుకవిత్వాల్లోని వస్త్వాశ్రయతని; పద, శతకచాటు కవిత్వాల్లోని ఆత్మాశ్రయతని సమీక్షించడం జరిగింది. ప్రాచీన కవిత్వంలో భక్తి కవిత్వంలోనే ఆత్మాశ్రయత్వం అధికంగా వుందని గమనించట మైంది. భగవంతునికీ, భక్తుడైన కవికీ మధ్య వున్న వ్యక్తిగత సంబంధమే ఇందుకు కారణమని నిర్ధారించడం జరిగింది

నాల్గవ అధ్యాయంలో ఆధునికాంధ్ర కవిత్వంలో ఆత్మాశ్రయత్వాన్ని గూర్చిన చర్చ ప్రధానం. తరువాతి అధ్యాయమైన "భావకవిత్వం-ఆత్మాశ్రయత్వం అన్న విషయానికి ఈఅధ్యాయం నాందిగా ఉపకరిస్తుంది. ఈ అధ్యాయంలో పాశ్చాత్య సాహిత్య ప్రభావాల ఫలితంగా ప్రాచీన కవిత్వంలో కంటే భిన్నమైన పద్ధతుల్లో దర్శనమిచ్చే ఆత్మాశ్రయత్వాన్ని విపులీకరించటం జరిగింది. భావ కవిత్వం మీద ప్రభావం నెరిపిన రొమాంటిక్ కవిత అందులోని ఆత్మాశ్రయత్వం; కాల్పనిక కవులకు, భావకవులకూ వున్న సాదృశ్యాలు ఇక్కడ చర్చించటం జరిగింది.

ఈ సిద్ధాంత వ్యాసంలో భావ కవిత్వంలోని ఆత్మాశ్రియత్వం ఐదవ అధ్యాయంలో ప్రస్తావనకు వచ్చింది. భావ కవులు తమకు నచ్చిన ప్రకృతి ప్రియత్వంతోనూ, ప్రణయతత్వంతోనూ, భక్తి తత్వంతోనూ, దేశభక్తి దృక్పథంతోనూ స్మృతి చింతనతోనూ కవిత్వం చెప్పారు. అందువల్ల భావ కవిత్వంలో ఇతి వృత్త ప్రాధాన్యం కంటే భావ ప్రాధాన్యం, వ్యక్తి వాదం బలీయంగా చోటు

చేసుకొన్నాయి, ఈ అధ్యాయాన్ని భావ కవిత్వ శాఖలను దృష్టిలో వుంచుకొని ప్రకృతి - ఆత్మాశ్రియత్వం, ప్రణయం - ఆత్మాశ్రయత్వం, భక్తి - ఆత్మాశ్రియత్వం - దేశభక్తి - ఆత్మాశ్రియత్వం, స్మృతి - ఆత్మాశ్రియత్వం అనే ఐదు విభాగాలుగా విభజించడమైంది. ఈ ఐదు అంశాలల్లో భావ కవులు ప్రదర్శించిన ఆత్మాశ్రియ ధోరణుల్ని పరామర్శించటం జరిగింది. భావ కవిత్వ శాఖల్లో సంఘ సంస్కరణ కవిత్వం అభ్యుదయ కవిత్వంలో లాగా వస్తు ప్రధానంగా కొనసాగింది. అందువల్ల ఆ శాఖను గూర్చిన ప్రస్తావన వదలి వేయడమైంది.

ఆరవ అధ్యాయంలో కాల్పనిక కవితా ప్రభావంతో రచనలు చేస్తూ వచ్చిన అభ్యుదయ కవుల రచనల్లోని ఆత్మాశ్రియత్వాన్ని గూర్చిన వివరణ చేయటం జరిగింది. కమ్యూనిష్టు దృక్పథాన్ని, మానవతా వాదాన్ని దృష్టిలో వుంచుకొని అభ్యుదయ కవులు రచనలు చేశారు. అయినా అంతకు మునుపే తెలుగు కవిత్వాన్ని దాదాపు మూడు దశాబ్దాల పాటు ప్రభావితం చేసిన భావ కవిత్వం ప్రభావం వీరి పైన లేక పోలేదు. ఈ కారణంగా అభ్యుదయ కవుల తొలి రచనల్లోనూ ఆధునిక కవితా సంప్రదాయాలకు అనుకూలంగా అనుభూతి తత్వంలో రచనలు చేస్తూ వున్న అభ్యుదయ కవుల రచనల్లోనూ వుండే ఆత్మాశ్రియత్వాన్ని గూర్చి 'అభ్యుదయ కవులు - ఆత్మాశ్రియత్వం' అన్న ఈ అధ్యాయంలో చర్చించటం జరిగింది

ఈ సిద్ధాంత వ్యాసంలో 'ఆత్మాశ్రియత్వం - ఫలితాలు ప్రయోజనాలు' అన్న అధ్యాయం ఏడవ అధ్యాయం. ఆధునిక కవిత్వంలో ఆత్మాశ్రియత్వ స్వరూప స్వభావాల్ని గూర్చి చర్చించడం జరిగిన తర్వాత ఆత్మాశ్రియత్వం వల్ల సమకూరిన ప్రయోజనాలను అంచనా వేయటం అవసరం కాబట్టి ఆధునిక కవిత్వానికీ, వ్యక్తులకు, సమాజానికి ఈ ఆత్మాశ్రియత్వం ఏ ప్రయోజనాల్ని సమకూర్చిందో ఈ అధ్యాయంలో వివరించడమైంది. అంతే కాకుండా ఆత్మాశ్రియత్వం వల్ల వాటిల్లిన నష్టాలను గురించి కూడా స్పృశించటం జరిగింది.

...

# 1. ఆధునికాంధ్ర కవిత్వం - ఆవిర్భావ వికాసాలు

ఆవిర్భావ దశ : వైవిధ్యంలేని ప్రబంధ కవిత్వంతోనూ, చిత్ర కవిత్వ గారడీలతోనూ తెగతెంపులు చేసుకొని ఒక ప్రత్యేకతను సంతరించుకొని ఆవిర్భవించిన కవిత్వాన్ని నవ్యకవిత్వం అనీ అభినవ కవిత్వం అనీ ఆధునిక కవిత్వం అనీ వ్యవహరిస్తున్నారు. ఈ నవ్య కవిత్వం ఆవిర్భావించడానికి అనేకపరిస్థితులు దోహదంచేశాయి. ఆధునికాంధ్ర కవిత్వ ఆవిర్భావానికి దోహదం చేసిన సాంఘిక, రాజకీయ పరిస్థితుల్ని రేఖామాత్రగా ప్రస్తావించి, నవ్య కవిత్వ వికాసాన్ని గూర్చి చర్చిస్తాను.

ఆధునికాంధ్ర కవిత్వం వున్నట్లుంటి ఏ ఒక్క క్షణాన్నో ఆవిర్భవించింది కాదు. అలాగే ఏ ఒక్కరి చేతులమీదుగానో పుట్టిపెరిగింది కాదు. ఎన్నో కారణాల ప్రభావంతో, ఎందరో వ్యక్తుల ప్రయత్నంతో అది ఆవిర్భవించింది.

ప్రబంధ కవిత్వానికి కాలదోషం పట్టినప్పటి నుంచీ దేశకాలపరిస్థితుల్ని అనుసరించి కవిత్వంలో మార్పులు వచ్చాయి. పిల్లవసుచరిత్రల ప్రాభావం తగ్గిపోనారంభించింది. ప్రబంధలోకంలో విశృంఖలంగా విహారం చేస్తూ వున్న శృంగారం క్షీణింప దొడగింది.

నవ్యకవిత్వ ఆవిర్భావానికి దేశ సాంఘిక, రాజకీయ పరిస్థితులు కొంత వరకు దోహదం చేశాయి. భారతజాతి సర్వం విదేశీయుల పాలన క్రింద అణగి వుండడంతో దేశ సాంఘిక పరిస్థితులు అంతగా మెరుగు పడలేదు. దీనికి తోడు అవినీతి చర్యలు. సతీసహగమనం, బాల్యవివాహాలు మొదలైన దురాచారాలు సంఘంలో నెలకొని వుండేవి.

విద్యాధికుడైన రాజారామ మోహనరాయలు వంగ దేశంలో బ్రహ్మ సమాజాన్ని స్థాపించి సంఘ దురాచారాల్ని, బాల్యవివాహాల్ని ఆపి ఆధునికమైన విద్య, వైజ్ఞానాన్ని దేశంలో వ్యాప్తిచేసేందుకు పూనుకొన్నాడు. ఈ బ్రహ్మ సమాజానికి ఆంధ్రదేశంలో వీరేశలింగం పంతులు పట్టుగొమ్మ అయ్యాడు. వీరికి తోడుగా రఘుపతి వెంకటరత్నం నాయుడు నిలిచాడు. వీరిరువురూ కలిపి సాంఘిక దురాచారాలకి ఎదురు నిలిచి వాటిని రూపుమాపటానికి సన్నద్ధులయ్యారు. బాల్య వివాహాల్ని ఆపుచేసి వితంతువివాహాల్ని ప్రోత్సహించారు.

రాజారామ మోహనరాయలు. వీరేశలింగం సాంఘిక ఉద్యమాల తరువాత గాంధీ సర్వోదయ సిద్ధాంతాలు ప్రచారంలోకి వచ్చాయి. ఈ సిద్ధాంతాల్లో వర్ణ వ్యవస్థా విరసన ముఖ్యమైంది.

సంఘంలో వ్యాప్తిలో వుండిన పై ఉద్యమాల వల్ల సాహిత్యంలో నూతనోత్తేజం పొడచూపింది. ఆంధ్రదేశంలో వీటి ప్రభావ ఫలితంగా సంఘసంస్కరణ కవిత్వం, దేశభక్తి కవిత్వం వంటి నూతన కవితా శాఖలు ఆవిర్భవించి నవ్య కవిత్వ మహోదయానికి దోహదంచేశాయి. వితంతు వివాహాల్ని ప్రోత్సహ పరుస్తూ, ఏకేశ్వరారాధనా తత్వాన్ని ప్రచారంచేస్తూ, గాంధీ దృక్పథాన్ని చాటిచెప్తూ అనేక రచనలు వచ్చాయి. త్రిపురనేని రామస్వామిచౌదరి, జాషువా, పింగళి, కాటూరి వంటి వారు ఈ రచనలకు మార్గదర్శకులయ్యారు.

స్వాతంత్ర్యానంతరం సాంఘిక స్థితిగతులు కొంచెం మెరుగుపడ్డాయి. ప్రజలకి స్వేచ్ఛ లభించింది. ఆంధ్రప్రజలకు పాశ్చాత్య సంస్కృతిమీద మోజు ప్రబలింది. వారి సాహిత్య పరిచయంతో కొత్త కొత్త కవితా పద్ధతులు తెలుగు సాహిత్యంలో పొడ చూపాయి. స్వదేశీయమైన కవిత్వంతో పాటే విదేశీ ప్రభావాలకు లోనైన కవితా రీతులు ఆధునికాంధ్ర కవితా వికాసానికి దోహదంచేశాయి.

ఆధునికాంధ్ర కవిత్వ ఆవిర్భావానికి దేశ సాంఘిక పరిస్థితులే కాక రాజకీయ పరిస్థితులు కూడా కొంతవరకు దోహదం చేశాయి. 1757 నుంచి బ్రిటిష్ వారి పరిపాలనతో మగ్గిపోతూ వున్న భారతీయుల్లో దాదాపు వంద సంవత్సరాల తరువాత జాతీయ చైతన్యం మోసులెత్తింది. 1830 నాటికే రాజారామ మోహన రాయలు సంఘసంస్కరణోద్యమంతో భారత దేశాన్ని ఉద్ధరించడానికి కంకణం కట్టుకొన్నాడు. 1875 నాటికి భారత దేశంలో అన్ని ప్రాంతాల్లోనూ జాతీయ చైతన్యం విస్తరించింది.

1850 నుంచి 1905 వరకు వున్నటువంటి కాలం భారత దేశంలో జాతీయ వాదానికి బీజకాలం అయ్యింది. ఇటువంటి కల్లోల పరిస్థితుల్లో రాజకీయ రంగంలో ఎన్నో మార్పులు వచ్చాయి. బ్రిటీషు పాలకులు భారత ప్రజల్ని మభ్యపెట్టేందుకు భారతీయుల్ని కొందర్ని పరిపాలనా యంత్రాంగంలోకి తీసుకొన్నారు. 1885 లో భారత జాతీయ కాంగ్రెస్ స్థాపనతో భారత ప్రజల్లోని జాతీయ చైతన్యం ఉరకలు వేసింది.

ఇదే సమయంలో ప్రపంచంలోని కొన్ని దేశాల్లోని రాజకీయ పరిస్థితులు కూడా భారతీయుల జాతీయ చైతన్యానికి ఆజ్యం పోశాయి. జపాన్, ఐర్లాండ్, రష్యా, చైనా మొదలైన దేశాల స్వాతంత్ర్య పోరాట విజయాలు భారతీయులకి ప్రోత్సాహాన్ని కలిగించాయి. 19వ శతాబ్దపు ఉత్తరార్థంలో వున్న రాజకీయ పరిస్థితులు అన్ని రాష్ట్రాల ప్రజల్లోనూ రాజకీయ చైతన్యాన్ని రేకెత్తించాయి.

భారత దేశం అంతటిలోకీ రాజకీయంగా ఎక్కువ చైతన్యాన్ని చూపిస్తూ వుండిన ఆంధ్రభూమిలో వీటిప్రభావం వల్ల సాంఘిక, సాంస్కృతికాది విషయాలలో మార్పులు వచ్చాయి. అప్పటి రాజకీయ పరిస్థితులకు అనుకూలంగా సాహిత్యంలో కూడా మార్పు కనిపించింది. 1900 లోనే కట్టమంచి రామలింగారెడ్డి "ముసలమ్మ మరణము" కావ్యం వెలువడింది. తరువాత రాయప్రోలు సుబ్బారావు గురజాడ అప్పారావు నవ్య కవిత్వ మహోదయానికి స్వాగతం పలికి యుగకర్తలయ్యారు. 1910లో అప్పారావుగారి ముత్యాలసరాల రూపంలో నవ్య కవిత్వం ఆవిర్భవించింది.

రాయప్రోలు 1909 లో రచించిన 'లలిత' కావ్యంతో సాహితీ జగత్తులో నూతన కాంతుల్ని వెదజల్లాడు, 1912లో 'తృణకంకణము'తో నవ్య కవిత్వానికి యుగకర్త అయ్యాడు. ఈ కావ్యంలో వస్తువులోనూ, భావంలోనూ, రచనల్లోను నవ్యత ప్రదర్శించాడు. వీరిరువురితో ప్రారంభమైన నవ్య కవిత్వం తరువాతి వారైన విశ్వనాథ, కృష్ణశాస్త్రి, దువ్వూరి, వేదుల, నాయని మొదలైన కవి శిఖామణుల కలాల్లోంచి భావ కవిత్వోద్యమంగా రూపు దాల్చింది.

1900 వరకూ దేశంలో వున్న రాజకీయ పరిస్థితులు ఆధునికాంధ్ర కవిత్వ ఆవిర్భావానికి హేతువులు కాగా 1900 నుంచి 1950 వరకూదేశంలోనూ, ఆంధ్ర రాష్ట్రంలోనూ వుండిన రాజకీయ పరిస్థితులు నవ్య కవిత్వ వికాసానికి హేతువులయ్యాయి. 1930 35 మధ్య కాలం ప్రపంచం అంతా ఆర్థిక సంక్షోభానికి గురి అయ్యింది. 1946 లో ఆంధ్రజాతి మాతృ భూమిలో భాగమైన తెలంగాణాలోరజాకార్ల దుండగాలు ప్రారంభం అయ్యాయి. స్వాతంత్ర్యానంతరమే జరిగిన ఈ రజాకార్ల దుండగాల్ని ప్రజాశక్తులు ప్రతిఘటించాయి. తెలంగాణా సాయుధ పోరాటం, పోలీసుల అమానుష చర్యలు మొదలైన అంశాలన్నీ తెలుగు సాహిత్యం పైన ముఖ్యంగా కవిత్వం మీద తమ ప్రభావాన్ని చూపాయి.

ఆంధ్ర దేశంలో 1930 – 33 శాసనోల్లంఘనోద్యమం విఫలమయింది. పత్యాగ్రహాల్లో ప్రభుత్వ వ్యతిరేకంగా హర్తాళ్ళు చేసిన యువకుల్ని అరెస్టు చేశారు. వీరికి రష్యాదేశాల వంటి ఉత్తర దేశాల విప్లవ కారులతో సంబంధాలు ఏర్పడ్డాయి. మార్క్స్, లెనిన్ మొదలైన వారి రచనల్ని చదివి వారి సోషలిస్టు భావాల్ని అనుసరింపజొచ్చారు. 1934 లో శ్రీశ్రీ. మార్క్సిస్టు దృక్పథంతో 'మహాప్రస్థాన' గేయాన్ని వ్రాసి అభ్యుదయ కవిత్వానికి నాందీ గీతం పలికాడు.

ఆంధ్ర దేశంలో తెలంగాణాలో జరిగిన రజాకార్ల దుండగాలను నిరసిస్తూ ఆరుద్ర. అవిసెట్టి, దాశరథి సోమసుందర్ మొదలైన కవులు కావ్యాల్ని వ్రాశారు. తెలంగాణా పోరాటం తెలుగు సాహిత్యంలో నవ్య కవిత్వానికి వికాస దశను కలుగ జేసింది. శ్రామికులు, మధ్యతరగతి ప్రజలు కావ్య వస్తువులైనారు. అభ్యుదయ కవిత్వంలో మానవతావాదం చోటు చేసుకొంది.

ఇలా భారత దేశంలోని రాజకీయ పరిస్థితులు ఒక రకంగా ఆధుని కాంధ్ర కవిత్వానికి బీజం వేయగా 20వ శతాబ్దం ప్రారంభ దశలోని దేశీయ పరిస్థితులు, ఆంధ్ర దేశంలోని రాజకీయ పరిస్థితులు ఆధునికాంధ్ర కవిత్వ వికాసానికి హేతువులయ్యాయి

దేశ సాంఘిక, రాజకీయ పరిస్థితులతోపాటు పాశ్చాత్యుల విద్యా విధాన ప్రభావం, ముద్రణా యంత్ర సౌకర్యం. పత్రికల వ్యాప్తి ప్రభావ కారణంగా తెలుగు కవిత్వంలో మార్పులు రాదొడిగాయి కందుకూరి వీరేశలింగం పంతులు వంటి సంఘ సంస్కర్తలు, గురజాడ అప్పారావు వంటి సాహిత్య సంస్కర్తలు, గిడుగువంటి భాషా శాస్త్రవేత్తలు, మేధావులు సాహిత్య విషయంలో మార్పులు తీసుక వచ్చారు, మరోవైపు తిరుపతి వేంకటకవులు దేశం నలుమూలా సంచ రించి తెలుగు కవిత్వానికి ప్రచారం కల్పిస్తూ వచ్చారు,

దీంతో కవిత్వం కేవలం ప్రభువులకు, పండితులకు మాత్రమే పరిమిత మైందన్న సంకుచితత్వం పోయింది. కవిత్వం ప్రజల్ని సంస్కరించడం కోసం జాతిని సక్రమమైన పద్ధతుల్లో నడిపించడం కోసం ఉపయోగించాలి అన్న కొత్త ఆలోచన ఏర్పడింది.

పత్రికల్లో స్థలాన్ని పురస్కరించుకొని ఖండ కావ్య ప్రక్రియ ఆవిర్భ వించింది. పత్రికల్లో పుటలు పరిమితం కాబట్టి లఘురచనలు బయలు దేరాయి.

సూటిగా హృదయానికి తాకేటట్టు సంక్షిప్తతనే ప్రధాన గుణంగా కలిగి ఛందస్సు నాశ్రయించో, మాత్రా ఛందోబద్ధంగానో కవిత్వం వెలువడుతూ కొత్త పుంతలు తొక్కనారంభించింది.

గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావుల వంటి మహావ్యక్తుల కలాల ప్రభావంతో సాహితీ ప్రవంతిలో కొత్త కెరటాలు మిన్ను ముట్టాయి. సంప్రదాయాన్ని కొంతవరకు అనుసరిస్తూనే వీరు కాలానుగుణంగా నూతన ప్రయోగాలు చేశారు. ప్రాచీన సంప్రదాయానుగుణంగా కావ్యాన్ని శ్రీ తో ప్రారంభించడం, మోదాంతంగా ముగించటం కాక దుఃఖపూరితమైన ప్రసక్తితో కథా ప్రారంభం చేస్తూ ఖేదాంతంగా కావ్యాన్ని ముగించటం వంటి నవ్య ప్రయోగాలు వీరు చేశారు.

ఛందో విషయంలో కూడా గురజాడ అప్పారావు నూతన పంథాని అనుసరించాడు. ముత్యాల సరాల సృష్టి నూతనత్వాన్నే సంతరించుకుంది. ఛందో విషయంలో నవ్యతని గురజాడ ప్రదర్శింపగా శృంగార విషయంలో రాయప్రోలు నవ్యతని రేకెత్తింపజేశాడు. స్త్రీని కామవాంఛతో గాక సౌందర్యారాధనా తత్వంతోనూ, ప్రేమ పిపాసతోనూ చూడటాన్ని ప్రతిపాదించాడు. ఈయన రచనల్లో దాంపత్య శృంగారం కంటే, భగ్న హృదయంతో ప్రేయసీ ప్రియులు పొందే బాధా తీవ్రతని వ్యక్తం చేస్తూ, కలయిక కంటే ఎడబాటులోనే ఎక్కువ సంతోషం॥ సంతృప్తి వున్నాయన్న అభిప్రాయాన్ని ప్రదర్శించాడు. ఈ విషయంలో పాశ్చాత్య ప్లాటోనిక్ లవ్ ప్రభావం కొంత ఆయన రచనపై పొడచూపింది.

దీంతో స్త్రీని అంగాంగ వర్ణనా సౌందర్యదృష్టితో కాక ఆత్మసౌందర్యాన్నీ, గుణ సౌందర్యాన్నీ చూసి ఆరాధించే తత్వం అలవడింది. ప్రకృతిగత సౌందర్య విషయంలోనూ ఈ దృష్టే ప్రబలింది. నగర వర్ణనలకు స్వస్తి చెప్పి కవి పల్లె పట్టుల్ని గురించి ఆలోచించడం ప్రారంభించి పల్లీయ ప్రకృతిని, పల్లీ జనప్రవృత్తుల్ని కావ్యగతం చేయటం మొదలెట్టాడు.

ఆంగ్ల కవులైన వర్డ్స్‌వర్త్, కీట్స్, బైరన్, షెల్లీ, బ్లేక్ వంటి కవుల ప్రభావంతో తెలుగు కవిత్వంలో క్రొంగొత్త రీతులు ఆవిర్భవించాయి. ప్రకృతి, ప్రణయం వంటి కవిత్వ అంశాల ప్రాధాన్యం హెచ్చింది. కవిత్వంలో వస్తు

ప్రాధాన్యం కంటే భావ ప్రాధాన్యం ప్రబలింది. కవి తన సుకుమార హృదయ ఫలకంపై ప్రతిబింబించే అంశాల్ని ఊహాధిక్యతతో కాక భావనా బలంతో రూప కల్పనచేసి కవితాబద్ధం చేయ నారంభించాడు. తాను విన్న, కన్న ఏ చిన్న సంఘ టనకైనా కవి హృదయం స్పందించటంతో కవిత్వానికి ప్రధానమయిన వస్తు విష యంలో విస్తృతి ఏర్పడింది. గడ్డి పరక నుంచి గగన గంగ దాకా వున్న సమస్త ప్రకృతి కవిత్వాంశమై కూర్చుంది. దీనికితోడు భక్తి, దేశభక్తి, సంఘసంస్కరణ, స్మృతిప్రాధాన్యాలు కూడా కవిత్వానికి విషయ నవ్యతని సంతరించాయి.

వివిధ వస్తుగత విషయాల్ని ప్రకటించటం కోసం కవిత్వ పరిభాషలో భాషా విషయంగా కూడా మార్పువచ్చింది. అలంకార భరితమైన కవిసమయాలకీ వర్ణనలకీ అనుకూలమైన ప్రబంధశైలి కంటే భిన్నమైన శైలిని నవ్యకవులు సంత రించుకోవాల్సిన అవసరం ఏర్పడింది. సంస్కృత పద బాహుళ్యం, దీర్ఘ సమా సాలు, పాత వాసనల్ని వెదజల్లే మారుమూల పదాలు, పాద పూరణలకుపకరించే పదజాలం క్రమేణ తగ్గు ముఖం పట్టి వాటి స్థానే భావానుకూలానికి అనువైన లలిత పద ప్రయోగం, సుకుమార సమాస ఘటన, నవ్యపద బంధాలు ఏర్పడ టమే గాక గ్రాంధిక భాషా విషయంలో కూడా కొన్ని మార్పులు వచ్చాయి.

గిడుగు రామమూర్తి పంతులు, గురుజాడల ప్రభావంతో గ్రాంధిక చ్ఛాయాల్లో మార్పు వచ్చి వ్యవహారిక భాష కావ్యభాషగా ఏర్పడ్డానికి పునాదులు కల్పింప బడ్డాయి. అంతేకాక మాండలిక భాషకు కూడా కవిత్వంలో కొంతచోటు లభించింది.

ఈ విధంగా దేశకాల పరిస్థితుల్లోనూ, కావ్య వస్తు విషయంలోనూ, భాష లోనూ, భావంలోనూ, శైలివిషయంలోనూ, రచయితల మానసిక విలువల్లోనూ మార్పులు రావటం వల్ల ఉక్కు చట్రాల్లో బిగింపబడ్డ కవిత్వానికి కొంత స్వేచ్ఛ లభించి నూతనోత్తేజంతో పరుగులెత్తి కొండవాగులా ఎగిసి దుముకుతూ జల పాతాలై ప్రవహించింది. ఆ ప్రవాహం తెలుగునేల ప్రవహించి మోడు వారిన చెట్లను చిగురింపచేస్తూ నూతనబీజాల్ని మొలకెత్తించదొడగింది, ఆ చిగురాకుల్ని మేస్తూ తెలుగు కోయిలలు గొంతుకలు సవరించుకొని కొత్తపాటలకి స్రుతి సరి చేసుకొన్నాయి, వివిధమైన రంగుల పక్షుల కిలకిలారావంతో, వివిధ పుష్పాల

సుగంధాలతో నందనవనం అలరారినట్లు నవ్య కవిత్వం ఆవిర్భవించి వికాస దశను పల్లవించింది.

వికాసదశ : పాశ్చాత్య కవితా సంప్రదాయ ప్రభావంతోనూ, దేశీయమైన ఉద్య మాల కారణంగానూ నూతనోత్తేజంతో మొలకెత్తిన నవ్య కవిత్వంలో ప్రధానంగా భావ కవిత్వ ఉద్యమమం. అభ్యుదయ కవిత్వ ఉద్యమాలతోపాటు దిగంబర కవి త్వం, విప్లవ కవిత్వం వస్తు విషయ ప్రాధాన్యాన్ని కలిగి నవ్య కవిత్వ ఉద్యమా లుగా తలలెత్తి నిలిచాయి. వాటిలో భావ కవిత్వ ఉద్యమం, అభ్యుదయ కవిత్వ ఉద్యమం స్వరూపంలోనూ, స్వభావంలోనూ ప్రత్యేకతని సంతరించుకొని ఆధుని కాంధ్ర కవిత్వంలో తాలోత్తాలమైన ఉద్యమాలుగా స్థిరత్వం పొందాయి. దిగంబర విప్లవ కవిత్వాలు స్వరూప స్వభావాల్లో అభ్యుదయ కవిత్వంలో అంతర్లీనమయ్యేవే.

గేయ కవిత్వం, వచనకవిత్వం, మినీకవిత్వం, అనేవి వస్తు విషయంలో గాక రూపం విషయంలో నూతనోద్యమాలుగా ఆవిర్భవించాయి. వస్తుపరంగానూ, రూపం విషయంలోనూ రూపొందిన కవిత్వ ఉద్యమాల గురించి ఇక్కడ ఒకింత ప్రస్తావిస్తాను.

భావ కవిత్వం : నవ్య కవిత్వ ఉద్యమాల్లో మొదట పేర్కొదగింది భావ కవిత్వ మహోద్యమం. పాశ్చాత్యుల కాల్పనిక కవిత్వ ప్రభావంతోనూ, దేశీయ మైన స్వాతంత్ర్య, సంఘ సంస్కరణల వంటి ఉద్యమాల ఫలితంగానూ తెలుగులో భావ కవిత్వం ఆవిర్భవించింది. ఈ కవిత్వ మహోద్యమం క్రీ.శ. 1900 ప్రాంతలో ప్రారంభమై క్రీ.శ. 1930 వరకు తెలుగు కవిత్వాన్ని ప్రభా వితం చేసింది. అటు తరువాత కూడా భావ కవిత్వ వీచికలు తెలుగునేల వీస్తూనే వచ్చాయి. అభ్యుదయ కవుల్లో మొదటి తరం కవులు భావ కవిత్వ ప్రభావానికి లోనై రచనలు చేసినవారే. ఆపైన ప్రయోగశీలురై అభ్యుదయ కవిత్వ ప్రారం భానికి శ్రీకారం చుట్టారు.

'భావ' పదం తొలుత రాయప్రోలు వారు ప్రయోగించారు. తర్వాత గాడిచర్ల హరిసర్వోత్తమ రావు గారు దానికి ప్రచారం తెచ్చారు. భావ ప్రాధాన్యంతో వ్రాసిన కవిత్వాన్ని భావ కవిత్వమని వ్యవహరించారు. ఈ భావ కవిత్వాన్ని పలువురు పలు రకాలుగా నిర్వచించారు. డా॥ సి నారాయణరెడ్డి

విశ్వనాథ సత్యనారాయణ, కవికొండల వెంకటరావు, శ్రీశ్రీలు భావ కవిత్వానికి చేసిన నిర్వచనాల్ని పేర్కొంటూ కవిత్వానికి వస్తువు, భావం, రచన అనే మూడంగా లున్నాయని వీటిలో భావానికే అత్యధిక ప్రాధాన్యం ఇచ్చే కవిత్వమే భావ కవిత్వమని వివరించారు.[1]

భావ కవిత్వం వస్తుగత నవ్యతని, శైలీ నవ్యతని కాంక్షిస్తూ వెలువడింది. భావ కవులు ఊహా మరుత్తుల్లో దివ్య హర్మ్యాల్ని నిర్మించి అందులోని సౌంద ర్యాన్ని ఆస్వాదిస్తూ ఏ దిగంతాల కావల నున్న దివ్య ప్రేయసినో, ప్రేమ భావాన్నో అంటి పెట్టుకొని రచనలు కావించారు. అటువంటి దివ్య సీమల్లో విహ రిస్తూ, ఆహ్లాదాన్ని అనుభవవిస్తూ, స్వేచ్ఛా ప్రవృత్తిని ప్రకటిస్తూ కవిత్వం వ్రాశారు.

అట్టి వారి స్వేచ్ఛా విహారంలో ప్రకృతి, ప్రేమ, ప్రణయమే కాక భక్తి, దేశ భక్తి, సంఘ సంస్కరణ, స్మృతి మొదలైన దివ్య సీమలు వారి కవిత్వానికి విడిది తీరాలయ్యాయి. భావ కవులు రంగుల చలవద్దాలు ధరించి లోకాన్ని హరి విల్లుగా భావించినా ఆ కాలానికి అనుగుణమైన సంఘ సంస్కరణని, దేశ భక్తిని ప్రదర్శించి వాస్తవ చిత్రిణని, సామాజిక స్పృహని ప్రకటించారు. అందువల్ల సామాజిక స్పృహ లేకుండా ఊహా ప్రపంచం ఇసుక ఎడారిలో తల దూర్చిన ఉష్ట్రపక్షుల్లా వీరిని పేర్కొనడం సమంజసం కాదు.

భావ కవులు దేశ కాల పరిస్థితులకు అనుకూలంగా పాశ్చాత్య కాల్పనిక కవుల ప్రభావానికి లోనై పరుగులు తీశారే కాని అంధత్వంలోకి కూరుక పోలేదు. ఊహా ప్రేయసుల కౌగిళ్ళలో బంధింప బడనూ లేదు. ఆకాశానికి ఎగిసి పోయి అక్కడే వుండి పోనూలేదు.

భావ కవులు తమకున్న సాధక బాధకాల్ని ఇతరులతో పంచుకోడానికి కవిత్వాన్ని సాధనంగా వినియోగించుకొన్నారు. ఇతరులనుంచి ఊరడింపున్నూ, సానుభూతిని ఆశించారు. ఇది మానవ సమాజం. వీరు కేవలం స్వార్థమే పరమార్థంగా ఎంచుకోలేదు. బ్రతుకు బరువును దించుకో ప్రయత్నించారంతే.

తెలుగులో ఈ భావ కవిత్వ మహోద్యమం రాయప్రోలుతో ప్రారంభమై దువ్వూరి, బసవరాజు, నండూరి, వాయని, వేదుల, పింగళి, కాటూరి మొదలైన

వారిచే ఆదరింపబడి కృష్ణశాస్త్రి ప్రమేయముతో పరిపుష్టత సమకూర్చుకొని అలరారింది.

అభ్యుదయ కవిత్వం: భావ కవిత్వంపై తిరుగుబాటుతో ఆవిర్భవించిందే అభ్యుదయ కవిత్వం. భావ కవుల స్వేచ్ఛా ప్రియత్వాన్ని, ప్రణయ తత్వాన్ని, సౌందర్య కాంక్షని, పలాయన తత్వాన్ని నిరసిస్తూ సామాజిక స్పృహకి ప్రాతినిధ్యం ఇస్తూ సామాజిక చైతన్యాన్ని రగుల్కొల్పడానికి అభ్యుదయ కవులు ప్రయోగాలు చేశారు.

ఆధునిక కవిత్వంలో ఇలా ప్రయోగా వాదులుగా పేర్కొనదగినవారు శ్రీశ్రీ, శిష్లా, పురిపండ, పఠాబి మొదలైన వారు శ్రీశ్రీ ఆ ప్రయోగాలకి ఒక నిర్దిష్ట క్రమాన్ని, కొన్ని మౌళిక సూత్రాల్ని నిబంధించి అభ్యుదయ కవిత్వ ఉద్యమానికి మూల విరాట్టయ్యాడు. శైలీవిషయంలో కూడా అభ్యుదయ కవిత్వానికి ఒక ప్రత్యేకత సమకూర్చాడు. మానవతా వాద దృక్పథంతో, మార్క్స ప్రభావంతో శ్రీశ్రీ అభ్యుదయ కవిత్వానికి గట్టి పునాదులేర్పరచాడు. అభ్యుదయ కవిత్వం ఆవేశంతో అంచులు తీరి ప్రవహించడానికి మార్గదర్శకుడయ్యాడు.

అభ్యుదయ కవిత్వాన్ని నిర్వచించిన వారిలో రాజమన్నార్, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీముఖ్యులు. వీరందరి దృష్టిమార్క్స దృక్పథంతో కూడుకొని మానవతా వాదాన్ని ప్రకటిస్తూ సమ సమాజాన్ని కోరుకొనేదిగా వుంది. సమాజం యొక్క అభ్యుదయాన్ని కాంక్షించే కవిత్వమే అభ్యుదయ కవిత్వం అన్న అంశాన్నే ప్రధానంగానో, పాక్షికంగానో మొగ్గు చూపేదిగా వుంది2

ఈర్ష్యా ద్వేషాలతోనూ, అకృత్రిమ అన్యాయాలతోనూ, కులమత వైషమ్యాలతోనూ, ఆకలీ దాహంతోనూ, రోగాలతోనూ, బాధలతోనూ కుమిలి పోతున్న ప్రజా పక్షాన్ని బలపరుస్తూ వారిని దోచుకొంటున్న బలీయమైన దౌర్జన్యం, దగా హస్తాల్ని అణచి వేయడమే ప్రథమ ధ్యేయంగా పుంచుకొని అభ్యుదయ కవిత్వం ఆవిర్భవించింది. 1930 లోనే భావ కవిత్వంపై తిరుగుబాటుతో ఒక ఉద్యమంగా పొడచూపిన ఈ అభ్యుదయ కవిత్వం 1940 తర్వాత పరిపుష్టత సమకూర్చుకొని లక్ష్య సాధనకై నిర్విరామంగా కృషిచేస్తూవుంది. వ్యక్తి నుంచి సమిష్టివైపు పరిణతి చెందిన ఈ అభ్యుదయ కవిత్వం ప్రస్తుత పరిస్థితుల్లో ఎంతో ఆదరణీయమైందిగా కనిపిస్తూ వుంది.

అభ్యుదయ కవిత్వ పయనంలో శ్రీశ్రీ, నారాయణబాబు, శిష్ట్లా, పురిపండ, పఠాభి మొదలైన వారు దారి చూపగా బైరాగి,సోమసుందర్, అనిసెట్టి, బెల్లంకొండ రామదాసు, కుందుర్తి, దాశరథి, ఆరుద్ర, నారాయణరెడ్డి కె.వి. రమణారెడ్డి, గజ్జల మల్లారెడ్డి వంటి కవులు ఆ మహోద్యమానికి ఆజ్యంపోసి శాయశక్తులా కృషిచేశారు. తిలక్ శేషేంద్రల వంటి వారు అటు భావ కవితా ఛాయల్ని వెద జల్లుతూ ఇటు అభ్యుదయ కవిత్వ ఉద్యమాన్ని పరిపుష్టం చేయడానికి రచనలు చేశారు.

వీరందరి బహుముఖ ప్రజ్ఞతో విస్తృత రూపం దాల్చిన అభ్యుదయ కవిత్వం వర్గ సంఘర్షణ, విప్లవప్రబోధం, వీరగాథా కథనం, గతనిరాసనం, యుద్ధ విముఖత – శాంతి ప్రియత, మానవతా వాదాల్ని ప్రధాన లక్షణాలుగా కలిగి సమాజ శ్రేయస్సు విర్విరామంగా కృషి చేస్తూ వుంది.

దిగంబర కవిత్వం : అభ్యుదయ కవిత్వ లక్షణాల్ని కొంత వరకు అనుస రిస్తూనే మొలకెత్తిన కవిత్వమే దిగంబర కవిత్వం. నిరాశా నిస్పృహల్తో కృంగి పోతూ వున్న ప్రజల దుస్థితిని చూసిన కొందరు కవులు అభ్యుదయ కవిత్వంపై తిరుగుబాటు ప్రకటించారు. అభ్యుదయ కవిత్వం ఆశించిన ప్రయోజనాల్ని నెర వేర్చ లేక పోవడాన్ని గమనించి ఆ కవిత్వంపై తమ అసహనాన్ని ప్రదర్శించిన వారు దిగంబర కవులు. వారి అసహనం సంఘంపై కూడా తిరస్కార భావాన్ని ప్రకటించింది. వారి భావ ప్రకటనలో జుగుప్స, అశ్లీలత చోటు చేసుకొన్నాయి.

దిగంబర కవులు అభ్యుదయ కవుల్లాగే సమాజ శ్రేయస్సునే కోరుకొన్నా, సంఘంలో వుండే కుళ్ళును, మురికిని అసహ్యమైన పద్ధతిలో ఎత్తి చూపటం ద్వారా సాంఘిక పురోభి వృద్ధిని సాంధిచ వచ్చుననుకొన్నారు. ఈ ధోరణిలో కవిత్వంలో కొంత నగ్నత్వాన్ని ప్రదర్శిస్తూ నగ్నముని, నిఖిలేశ్వర్, జ్వాలాముఖి చెరబండరాజు, భైరవయ్య, మహాస్వప్నలు తమని దిగంబర కవులుగా ప్రకటిం చుకొన్నారు. వీరి కలాల, మంచి వెలికురికిన కవిత్వమే దిగంబర కవిత్వమని వ్యవహరించబడింది. వీరు వరుసగా 1965 లోనూ, 1966 లోనూ, 1968లోనూ "దిక్కుల" సంపుటాల్ని మూడింటిని ప్రచురించారు. ఈ సంపుటాల ఆవిష్క రణ విషయంలో కూడా వీరు ప్రత్యేకతని ప్రదర్శించారు. విద్యావంతుల, ధన

వంతులచే గాక ఎవరికోసమైతే తమ కవిత్వాన్ని, తత్ప్రయోజనాన్ని ఉద్దేశించారో అటువంటి బిచ్చగత్తె, రిక్షావాలాల చేత నట్టనడి రాత్రి వీధుల్లో కావ్యా విష్కరణలు చేయించారు.

వీరి ధ్యేయాలు, ఆశయాలూ, అభ్యుదయ కవుల ధ్యేయాలూ, ఆశయాలు ఒకటే అయినా వాటిని సాధించటంకోసం దిగంబర కవులు అనుసరించిన పంథా వేరుగావుంది. అందువల్లే వీరు అభ్యుదయ కవి వర్గంకంటే భిన్నమైన వారిగా తమను తాము గుర్తించుకొన్నారు. వీరు ఆరుగురూ కలిసికట్టుగా పనిచేయాలన్న దృఢ సంకల్పం సడలడం వల్ల, వ్యక్తిగత వైషమ్యాల కారణంగా, వీరి కవిత్వ ఉద్యమం ఫలవంతం కాలేదు. అంతేకాక వీరి కవిత్వం కూడా ప్రజాదరణనీ, విమర్శకుల మెప్పునీ పొందలేక పోయింది.

విప్లవ కవిత్వం : అభ్యుదయ కవుల మార్గంతోనూ దిగంబర కవుల పద్ధతులతోనూ ఏకీభవించని కొందరు కవులు విప్లవాన్నే ఆదరిస్తూ విప్లవమే అన్ని సమస్యల్ని పరిష్కరిస్తుందని విశ్వసిస్తూ తమ కవిత్వాన్ని విప్లవ కవిత్వం అని నామకరణం చేసుకొన్నారు. 1970 లో ఏర్పడ్డ విప్లవ రచయితల సంఘానికి 'విరసం' అన్న ముద్దు పేరు పెట్టుకొన్నారు.

అభ్యుదయ కవులు దేశీయమైన గాంధీయ మార్గంలో శాంతిని కాంక్షిస్తూ సమాజ అభివృద్ధిని, అభ్యుదయాన్ని కాంక్షించగా; విప్లవ కవులు విదేశీయమైన మార్క్సియ దృక్పథంతోనూ, మావోదృక్పథంతోనూ విప్లవం వైపు మొగ్గుచూపారు. విప్లవమేనేటి సమస్యలకు పరిష్కారం చూపుతుందని రచనలు చేశారు వారి కవిత్వమే విప్లవ ప్రాధాన్యతని కలిగి విప్లవ కవిత్వంగా పేరుమోసింది.

కె.వి. రమణారెడ్డి, జ్వాలాముఖి, చెరబండరాజు, నగ్నముని, శివారెడ్డి, శ్రీశ్రీ మొదలైన వారు విప్లవ కవులుగా స్థిరపడి రచనలు చేశారు. సాయుధ పోరాటాన్ని ప్రోత్సహించేది గానూ, నినాదాల ప్రధానంగానూ, అమరవీరుల సాహసాల్ని కొనియాడేది గానూ విప్లవ కవిత్వం విలసిల్లింది. శ్రీకాకుళ గిరిజనుల అండతో జరిగిన సాయుధ రైతాంగ పోరాటమే నక్సల్బరీ ఉద్యమంగా పరిణమించి తెలుగులో విప్లవ కవిత్వం ఆవిర్భవించడానికి దోహదం చేసింది. విప్లవ కవుల కవిత్వంలోని మూలసూత్రం అరాజకమయింది. అందువల్ల ఈఉద్యమానికి తెలుగు

దేశంలో ఆదరణ లభించలేదు. చంపితే శవాల కంపు తప్ప మరేమీ మిగలవని, విప్లవం వల్ల జాతి వినాశనమే కానీ అభ్యుదయం సిద్ధించదని దృఢ విశ్వాసంగలవారు ఈ కవిత్వ ఉద్యమానికి చేయూత నివ్వలేదు.

ఆధునికాంధ్ర కవిత్వం ఇన్ని పరిణామాలకి గురైవస్తు విషయంలో వైవిధ్యాన్ని ప్రదర్శించింది. సాంఘిక ప్రయోజనాన్ని దృష్టిలో వుంచుకొని వచ్చిన కవిత్వ ఉద్యమాల్లో అభ్యుదయ కవిత్వ ఉద్యమం తరువాత దిగంబర, విప్లవ కవిత్వాలు ఆవిర్భవించినా విశాల దృక్పథం గల అభ్యుదయ కవిత్వమే అందరి మన్ననలూపొందింది. ఎన్నో కవితా ఖండికలు, కవితా సంకలనాలు పుంఖాను పుంఖంగా వెలువడుతున్నాయి. నేటికీ మిరియాల రామకృష్ణ, రామాచంద్ర మౌళి, చొప్ప కట్ల చంద్ర మౌళి, గోపి, శాతకర్ణి మొదలైన అధునాతన యువ కవులు అభ్యుదయ కవిత్వాన్ని ధారావాహంగా వెలార్చుతూ వున్నారు.

ఇంతవరకూ ఆధునికాంధ్ర కవిత్వంలో తాలోత్తాలమైన కవిత్వ ఉద్యమాల్లో భావ కవిత్వ, అభ్యుదయ కవిత్వ ఉద్యమాలతో పాటు దిగంబర, విప్లవ కవిత్వాల్ని గూర్చి చర్చించటం జరిగింది. ఈ ప్రకరణంలో వస్తు విషయంగానే కాక రూపానికి సంబంధించి నవ్య కవిత్వంలో వచ్చిన ఉద్యమాలను గూర్చి ప్రస్తావిస్తాను.

ప్రాచీన కాలంనుంచీ కవిత్వ వాహకాలుగా పద్యం, గేయం, మాత్రాఛందోబద్ధ రచనలు వ్యాప్తిలో వున్నాయి. భావ కవిత్వం కాలంనాటికి వృత్తాలు, జాతులతోపాటు గేయం కూడా ఆదరణని పొందింది. ఇటీవలి కాలంలో వీటి అవసరం తగ్గి పోయింది. వచనం కవిత్వ వాహకమైంది. ఆధునికాంధ్ర కవిత్వాన్ని ప్రచారం చేసిన గేయ కవిత్వాన్ని గురించీ, వచన కవిత్వాన్ని గురించీ చర్చించటమే గాక ఇటీవలి కాలంలో ప్రచారంలోకి వచ్చిన మినీ కవిత్వాన్ని గురించి ఒకింత ఈ ప్రకరణంలో వివరిస్తాను.

**గేయ కవిత్వం :** ప్రాచీన కవిత్వమంతా ఛందోబద్ధంగానే కొనసాగింది. ప్రాఙ్నన్నయ యుగంలోనూ, శివ కవి యుగంలోనూ మాత్రాఛందోబద్ధమైన కవిత్వం వ్యాప్తిలో వుండేది. నన్నయ యుగంలో నన్నయచే సంస్కరించబడ్డ కవిత్వం సంస్కృత వృత్తాల్ని, జాతుల్ని ప్రధానంగా గ్రహించింది.

ఆధునిక కాలంలో మాత్రా ఛందస్సుకు తిరిగి పట్టం గట్టబడింది. త్ర్యస్ర చతురస్ర, ఖండ, మిశ్ర గతుల ప్రాభవం ప్రబలింది. భావ విషయంలో నవ్యతని ప్రదర్శించిన భావ కవులు ఛందో విషయంలో స్వేచ్ఛను కోరుకొంటూ నవ్యతని ప్రదర్శించారు. దీంతో గేయ కవిత్వం భావ కవిత్వ వాహకంగా నిలిచింది.

మాత్రా ఛందస్సులచేత నిర్మింపబడి రాగ తాళయుక్తమై గానానుకూలంగా సంతరించబడిన కవిత్వమే గేయ కవిత్వం. పాడదగిన గానానుకూలమైన కవిత్వమంతా గేయ కవిత్వంగా వ్యవహరింపబడింది. గేయ కవిత్వాన్ని ఆదరించిన భావ కవులు గేయంతో పాటు, వృత్తాలతో పాటు ఆటవెలదుల్ని, తేటగీతల్ని, కందాల్ని విరివిగా వాడుకొన్నా కోకిల కుహూ కుహూ రావాలకు, సెలయేటి ప్రవాహాల సవ్వడులకు అనుకూలమైన గేయాన్నే ఎక్కువగా ఆదరించి రచనలు చేయటం గేయ కవిత్వానికి ప్రచారాన్ని లభింప జేసింది.

గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావు, బసవరాజు అప్పారావు, కృష్ణశాస్త్రి, నండూరి సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ మొదలైన వారు భావ కవిత్వాన్ని గేయ ఫణితిలో రచించారు. అభ్యుదయ కవులు గేయ కవిత్వానికంటే వచన కవిత్వానికే ఎక్కువ ప్రాధాన్యాన్నిచ్చారు. అయినా శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణబాబు వంటి వారు మొదట వచన గేయాల్ని రచించిన వారే అటుపైన్నే అభ్యుదయ కవిత్వం వచన కవిత్వంగా పరిణతి చెందింది.

ఆధునిక యుగంలో గురజాడ, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, నారాయణరెడ్డి ఈ నలుగురూ ప్రత్యేకతని సంతరించుకొన్న గేయ కవులుగా ప్రసిద్ధి పొందారు.

వచన కవిత్వం : వచన కవిత్వం కూడా కవిత్వ బాహ్య స్వరూపానికి సంబంధించిదే, ఈ వచన కవిత్వానికి వచన పద్యం, వచన గేయం, వచనగీతం, ముక్తచ్ఛందం, అనిబద్ధ కవిత, స్వచ్ఛంద కవిత, స్వేచ్ఛా కవిత, ఫ్రీవర్స్ అనేవి పర్యాయ పదాలుగా వ్యాప్తిలో వున్నాయి.

వ్యావహారిక భాషావాద ప్రభావంతో కవిత్వంలో వచన కవితోద్యమం ప్రారంభమైంది. సులభమైన- స్పష్టమైన శిష్ట వ్యావహారికంలో, ప్రామాణికమైన వచనంలో అందరికీ అర్థమయ్యేలా వెలువడుతున్న కవిత్వమే వచన కవిత్వంగా వ్యవహరింప బడుతూ వుంది. అయినా ఏది ప్రామాణిక మైన వ్యావహారికం, ఏది ప్రామాణికమైన వచనం అన్న విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. ప్రస్తు

తం స్థిరరూపం దాల్చిన వచన కవిత్వం కొంత పత్రికల భాషను ప్రామాణికంగా స్వీకరించిందిగా వుంది.

భావ కవిత్వ ప్రాభవం తగ్గి అభ్యుదయ కవిత్వం ప్రారంభ దశలో వుండగా వచన కవిత్వానికి శ్రీకారం చుట్టబడింది. వచన కవిత్వానికి పితామహుడుగా కుందుర్తి ఆంజనేయులు కొనియాడబడ్డా; దేవరకొండ బాలగంగాధర తిలక్ కలం బలంతో వచన కవిత్వం పరిపుష్టమైంది. ప్రేమ భావాన్ని కానీ, అభ్యుదయ భావాన్ని కానీ వచన కవిత్వంలో చెప్ప వచ్చునని చెప్పి మెప్పించి లబ్ధ ప్రతిష్ఠుడైన వాడు తిలక్. దాశరథి, నారాయణరెడ్డి ఆరుద్ర, సోమసుందర్, శేషేంద్రల వంటి ఆధునిక కవుల చేతుల్లో ఈ వచన కవిత్వం ఇంకా పరిపుష్టం కావింపబడింది.

ఇంత మంది కవులచేత వచన కవిత్వం నిర్వహింప బడుతున్నప్పటికీ ఈ వచన కవిత్వానికి ఒక నియమితమైన రూపం ఏర్పడలేదు. ఎవరికి తోచినట్లు వారు ఈ వచన కవిత్వాన్ని నిర్మించుకొని వారి వారి ప్రత్యేకతని ప్రదర్శిస్తున్నారు. ఎలాంటి నియమ నిబంధనలు లేకుండా ఈ వచన కవిత్వం నిర్మింపబడి నందున ఆంగ్లంలో దీనికి ఫ్రీవర్స్, వర్స్ లిబర్ అనే పేర్లు వచ్చాయి. తెలుగు వచన కవుల్లో కొందరు అంత్య ప్రాసల ప్రాభవంతోనూ, మరి కొందరు సంస్కృత పద భూయిష్ఠంగాను ఈ వచన కవిత్వాన్ని వ్రాస్తున్నారు. ఇలా భిన్నమైన పద్ధతుల్లో నిర్వహింప బడుతూన్న ఈ వచన కవిత్వంపై సమగ్రమైన పరిశోధన జరగాల్సిన అవసరం వుంది

మినీ కవిత్వం : ఇదీ కవిత్వ బాహ్య రూపానికి సంబంధించి జరిగిన ప్రయోగమే. అయినా గేయ కవిత్వానికి, వచన కవిత్వానికంటే ఇది భిన్నమైంది. సంక్షిప్తతే దీని ప్రథమ లక్షణం. చాలా క్లుప్తంగా నాలుగైదు పాదాల్లో ఎలాంటి నియమ నిబంధనలూ లేకుండా వచనంలో భావ తీవ్రతని హృదయానికి చురుక్కున తగిలేలా చెప్పటమే మినీ కవిత్వంలోని ప్రధాన గుణం.

ఇది 1980 తరువాత వ్యాప్తిలోకి వచ్చింది. శ్రీశ్రీ మహాప్రస్థానంలోనే ఇటువంటి రచనలున్నాయి. 'ఆః' అనే కవిత ఇటువంటిదే. ఇటీవలి కాలంలోనే ఇటువంటి సంక్షిప్త రచనల్ని మినీ కవిత్వం అని వ్యవహరిస్తున్నారు.

మినీ కవిత్వంలోని పాదాల పరిమితి నాలుగు, ఐదు నుంచి తగ్గుతూ వచ్చి అక్షర ప్రాధాన్యాన్ని నింపుకొన్న కవిత్వం కూడా పత్రికా ముఖంగా వెలువడ తూవుంది. నాలుగైదు అక్షరాలు కానీ ఒకే అక్షరం కానీ ఒకభావాన్ని ప్రకటించే దిగా వుంటే అటువంటి కవిత్వాన్ని అక్షర కవిత అని పత్రికల్లో ఈ మధ్య అంటున్నారు. ఇవిఎంత వరకు సుస్థిరత్వాన్ని దాలుస్తాయో వేచి చూడాలి.

ఈ అధ్యాయంలో ఇంత వరకు ఆధునికాంధ్ర కవిత్వ ఆవిర్భావ వికాసాల్ని గురించి చెప్పటం జరిగింది. ఆధునికాంధ్ర కవిత్వంలో ఆత్మాశ్రియత్వాన్ని పరిశీలించబోయే ముందు ఆధునికాంధ్ర కవిత్వాన్ని గూర్చి, దాని వికాసాన్ని గూర్చి చెప్పటం అవసరం గనుక ఆధునికాంధ్ర కవిత్వంలో వస్తు విషయంలోనూ, రూపం విషయంలోనూ వచ్చిన కవిత్వ ఉద్యమాలను గురించీ, కవితా ప్రక్రియలను గురించీ రేఖా మాత్రంగా స్పృశించాను. రెండవ ప్రకరణంలో కవిత్వం అందులోని ప్రధానమైన రెండురీతులు-ఆత్మాశ్రయ, వస్త్వాశ్రయరీతులు; వాటికి సంబంధించిన నిర్వచనాలు; వివిధ కవుల, విమర్శకుల అభిప్రాయాలను గూర్చి వివరించే ప్రయత్నంచేస్తాను.

## ఉదాహృత సూచికలు


1. నారాయణరెడ్డి. సి. ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు - ప్రయోగములు. పుటలు; 302, 303.
2. " " పు. 560, 561.
3. దాశరథి. తిమిరంతో సమరం (వచన కవితా సంపుటి) పు. 32.

# 2. కవిత్వం — రీతులు

కవిత్వాన్ని విశాల దృష్టితో పరిశీలిస్తే రెండు రకాలైన కవిత్వాలు కనిపిస్తాయి. 1. వస్త్వాశ్రయ కవిత్వం 2 ఆత్మాశ్రయ కవిత్వం. పాశ్చాత్య సాహిత్య విమర్శకులు కూడా కవిత్వాన్ని స్థూలదృష్టితో పై రెండు విభాగాల క్రిందనే విభజించారు. వస్త్వాశ్రయ కవిత్వాన్ని Objective Poetry గానూ, ఆత్మాశ్రయ కవిత్వాన్ని Subjective Poetry గానూ పేర్కొన్నారు.

వస్త్వాశ్రయ కవిత్వానికే "పరాశ్రయకవిత్వం', 'పరేంగిత నిరూపణ కవిత్వం'[1], 'బాహిరకవిత్వం'[2] అనేవి పర్యాయ పదాలు. ఆత్మాశ్రయ కవిత్వానికి "ఆంతర కవిత్వం', "స్వేంగిత నిరూపణ కవిత్వం', "వ్యక్తివాద కవిత్వం" అనేవి పర్యాయ పదాలైనాయి.

వస్త్వాశ్రయ కవిత్వం: 'Dictionary of Literary terms' లో వస్త్వాశ్రయ కవిత్వం (Objective Poetry) అంటే 'A dealing with outward things' అనీ; 'A Quality of imper-sonality: of freedom from personal Sentiments, beliefs and emotions'[3] పేర్కొనబడివుంది అంటే బాహ్య విషయగత మైందీ, అవ్యక్తిగతమైందీ అనీ; వ్యక్తిగతమైన సిద్ధాంతాలకూ, నమ్మకాలకూ ఉద్రేకాలకూ సుదూరంగా వుండేది వస్త్వాశ్రయ కవిత్వం అనే అర్థంస్ఫురిస్తుంది. ఈకవిత్వంలో ఇతి వృత్తమే ప్రాధాన్యం వహిస్తుంది. అన్యోన్యాశ్రయాలైన కథలు, పాత్రలు కలిపి కవికి కావ్య వస్తువులుగా లభ్యమౌతుంటాయి. అవి వస్తువులుగా గల కవిత్వమే వస్త్వాశ్రయ కవిత్వం.4

దృశ్యమానమైన ఈ చరాచర ప్రపంచం అంతా బాహ్యం, కవి ఈ బాహ్య జగత్తు నుంచి తన కావ్య రచనకు వస్తువును స్వీకరించి రచన చేస్తే అది వస్త్వాశ్రయ కవిత్వం.[5] పురాణాలు, ప్రబంధాలు, కావ్యాలు మొదలైన వన్నీ ఈ కోవకు చెందిన రచనలే. వీటిలో బాహ్యమైన ఇతివృత్తం, పాత్రలు, వర్ణనలు, అలంకారాలు, రసపోషణ మొదలైనవి ప్రాధాన్యం వహించి వుంటాయి. బాహ్యమైన అంశాలికి ప్రాధాన్యం ఇస్తూ వస్తు ప్రధానమైన రచన కాబట్టి ఇటు వంటి కవిత్వాన్ని వస్తు కవిత్వం అనీ, బాహిరకవిత్వం అనీ, పరాశ్రియ కవిత్వం అనీ, వస్త్వాశ్రియ కవిత్వం అనీ వ్యవహరించటం పరిపాటైంది.

ఆత్మాశ్రియం కవిత్వం : కవియైన వాడు తన మానసిక క్షేత్రంలో పుట్టిన విఖ దుఃఖ పూరితాలైన భావాలను కావ్యగతం చేస్తే అది ఆత్మాశ్రియ కవిత్వం అవుతుంది ఇందులో ఇతివృత్తం, పాత్రలు, వర్ణనలు, అలంకారాలు, రసపోషణ ప్రాధాన్యం వహించవు. కేవలం కవియైన వాని అంతర ప్రేరణచే కలిగిన భావ జాలం కావ్యస్థ మవుతుంది హడ్సన్ 'An introduction to the study of Literature' అనే గ్రంథంలో ఆత్మాశ్రియ కవిత్వాన్ని (Subjective Poetry) గూర్చి 'There is the poetry in which the poet goes down into himself and finds his inspiration and his subjects in his own experiences thoughts and feelings[6], అని పేర్కొన్నాడు. ఈ విషయాన్నే డా॥ సి. నారాయణరెడ్డి 'ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు ప్రయోగములు' అన్న సిద్ధాంత గ్రంథంలో 'ఆత్మాశ్రయ కవితా రీతిలో ........భక్తిగానీ, రక్తిగానీ, సుఖముగానీ, దుఃఖముగాని, ప్రణయముగాని, ప్రళయముగాని కవియే స్వయముగా అనుభవించి ఆలోచించి సూటిగా కవితాబద్ధ మొనర్చు'[7] నని పేర్కొన్నాడు.

అంటే కవిస్వానుభవమైన మానసిక వ్యాపారంలో మునిగి అందుతాను పొందిన సుఖాన్నో, దుఃఖాన్నో కావ్యగతం చేయటమే ఆత్మాశ్రయ కవిత్వం అన్నది స్పష్టమౌతూవుంది: బాహిరమైన వస్తు ప్రేరణ ప్రాధాన్యంతోనూ, ఇతివృత్త ప్రాధాన్యంతోనూ కాక కవి తాను విన్న కన్న ఏ చిన్న సంఘటన తాలూకు భావాలనో కావ్యగతం చేయటమే ఆత్మాశ్రయ కవిత్వంలోని తత్వం.

వస్త్వాశ్రియ కవిత్వానికున్న కాన్వాసు ఈ సువిశాల ప్రపంచం అంతా కాగా ఆత్మాశ్రయ కవిత్వానికున్న కాన్వాసు చాలా చిన్నది. అది కవికున్న హృదయం మాత్రమే. అంటే కవి హృదయ సంబంధమైన వ్యక్తిగత భావాలను ఆశ్రియించి అతని అనుభవాలకు మాత్రమే పరిమితమైందిగా ఈ ఆత్మాశ్రియ కవిత్వం కనిపిస్తుంది.*

ఆత్మాశ్రియ కవిత్వం గురించి పలువురు కవులూ, విమర్శకులూ తమతమ అభిప్రాయాల్ని ప్రకటించారు. వాటి స్వరూప స్వభావాలివి. — "కవి అనుభవాన్ని పాడుకోవడమనేది యీనాటి కవితలో రెండవపరివర్తన. దీనికే ఇంగ్లీషులో Subjective poetry అని పేరు. కవిత్వంలోని కవియొక్క వ్యక్తిత్వం ప్రతి

బింబిస్తూ వుండడమే యీ రచన యొక్క లక్షణం."[8] అని కటికనేని జగన్నాథ రావు, "కవి తన యొక్క ప్రేమ పూరిత మగు హృదయము వల్లను, ప్రతిభా శక్తి వలనను ఇతరుల ఇంగితములను ఊహించి గ్రహించి తన్మ యత్వము చెంది ప్రదర్శించును'[9] అని పిల్లలమర్రి వెంకట హనుమంత రావు, ఏ కవి అయినా తన ఎదుట వున్న ప్రకృతికిగాని, సంఘటనకుగాని వ్యక్తుల మనస్తత్వాలకుగాని, తన ఆలోచన మేరకు, జీవితం తనకు నేర్పిన అనుభవాల మేరకు స్పందించి— ఆత్మాశ్రయంగా రచనలు చేస్తాడు."[10] అని ఇంద్రగంటి శ్రీకాంతశర్మ "ఆత్మలో విలీనుడై సృష్టి రహస్యములనచ్చటనే గాంచి వాని తత్వము నూహించును, ఇది యొక కవితా సీమ. దీనిని Subjective poetry అని చెప్పుకొందుము.'[11] అని ఖండవల్లి లక్ష్మీరంజనం, "కవియైన వాడు తన మానసిక క్షేత్రమున ఉద్భవించి నట్టి సుఖ దుఃఖాత్మకములగు భావములను వ్యక్తము చేసి నపుడు ఆ భావములు అతని ఆత్మీయములు గనుక, అది ఆత్మాశ్రయ కవిత్వము.'[12] అని పింగళి లక్ష్మీకాంతం ఆత్మాశ్రియ కవిత్వానికి నిర్వచనాలు చేశారు.

పై నిర్వచనాలన్నింటిలో రెండు ప్రధానమైన అంశాలు కనిపిస్తాయి. అవి 1. కవి 2. అనుభవం. కవి తన రాగ ద్వేషాలకనుకూలంగా ప్రకృతి గతమైన అంశాలను అనుభవించి తాను పొందిన అనుభవాన్ని తన మాటల్లో వ్యక్తం చేయటమే ఆత్మాశ్రయ కవిత్వ ముఖ్య లక్షణంగా పేర్కొన వచ్చు.

కవి ఆత్మాశ్రయుడు కావడానికి ఈ క్రింది అంశాలు కారణాలుగా కనిపిస్తాయి.

1. కవి తాను ఒంటరినని అనుకొన్నప్పుడు.
2. తన బాధల్లో మునిగి వున్నప్పుడు.
3. తనచుట్టూ వున్న ప్రకృతిపై, మానవ ప్రవృత్తులపై విముఖ భావ మేర్పడినపుడు.
4. తనకీ లోకంలో అన్యాయం జరింగిదని తెలిపినపుడు.
5. తన నమ్మకాన్ని, తన సంతోషాన్ని ఇతరులు వమ్ము చేసినప్పుడు లేదా వాటిని ఇతరులు అటంక పరచినప్పుడు.
6. తాను ఆరాధించే ప్రకృతి నాశనమైనప్పుడు, తనకు దూరం అయిం దని పించినప్పుడు.

7. వైరాగ్యదృష్టి, పరమాత్మ చింతన అలవడినప్పుడు.

బాహ్య ప్రపంచం నుండి ఇతివృత్తం గ్రహించి బాహ్య ప్రేరణలచే రచనలు చేసే కవి ఉన్నట్లుండి ఆత్మాశ్రయుడు కావచ్చు. దీనికి కారణం అతని మానసిక ప్రవృత్తే. భావకవులు ఇలాగే ప్రబంధచ్ఛాయల్నుంచి బయటపడి ఆత్మాశ్రయ ధోరణిని అనుసరించారు. పైన పేర్కొన్న అంశాల కారణంగానే భావ కవులు ఆత్మాశ్రయులయ్యారు. ప్రాచీన కవుల్ని పరిశీలిస్తే పై అంశాల కారణంగానే కొన్ని సందర్భాల్లో ఆత్మాశ్రయత్వాన్ని ప్రకటించినట్లు కనిపిస్తుంది.

వేములవాడ భీమకవి, శ్రీనాథుడు, పెద్దన మొదలైన వారు బహుముఖ ప్రజ్ఞతో వస్త్వాశ్రియ రచనలు చేస్తూ వుండేవారు. రాజుల పోషణలో సుఖ సంతోషాల్ని అనుభవిస్తూ వస్త్వాశ్రియ రచనలు చేస్తూవుండి రాజు మరణించగా బాధల్లో కూరుకపోయి ఆత్మాశ్రయతని వెల్లడిచేశారు. దాదాపు భావకవులు కూడా ఇలాగే ఆత్మాశ్రియులయ్యారు.

మైలమ భీమరాజు మరణించగా దుఃఖపూరితమైన హృదయంతో వేముల వాడ భీమకవి చాటు పద్యాల్ని చెప్పాడు.[13] ఇవి మైలమ భీముని గుణగణాల్ని కొనియాడేవిగా వుంటూ కొంత వరకు ఆత్మాశ్రయత్వాన్ని కలిగివున్నాయి, ఇంత కంటే 'కాశికా విశ్వేశు గలసె వీరారెడ్డి రత్నాంబ రంబులే రాయడిచ్చు?'....'[14] అన్న శ్రీనాథుని చాటు పద్యం ఆత్మాశ్రయత్వంతో పెల్లుబికిన కవిత్వం. శ్రీనాథుని ఆదరిస్తూ వుండిన రెడ్డి రాజు, మైలారు విభుడు, విస్సన్న మంత్రి లేక పోవడంతో వారి ఎడబాటులో ఒంటరియైన శ్రీనాథుడు దుఃఖిస్తూ ఆత్మాశ్రయత్వాన్ని ప్రదర్శిం చాడు. ఇలాగే పెద్దన కూడా శ్రీకృష్ణదేవరాయల మరణానంతరం 'ఎదురైనచో తన మద కరీంద్రము డిగ్గి కేలూత యొసగి యెక్కించుకొనియె....'[15] అనే పద్యంలో రాయల ఎడబాటుకు కృంగిపోతూ ఆయనతో పాటు చనిపోక పోవ డానికి విలపిస్తాడు. ఇక్కడకూడ కొండంత అండంగా వున్న రాజు చనిపోగా ఏకాకి తనాన్ని అనుభవిస్తూ ఆత్మపరమైన రచనలు చేసినట్లు పెద్దన కవిత్వం కనిపిస్తూ వుంది.

దాదాపు భావకవులు కూడా ఇలాగే ఆత్మాశ్రయత్వాన్ని నింపుకొన్నారు తమ కవిత్వంలో. భావకవులు ఏవో అందరాని సౌందర్యాలకోసం ,సుఖాలకోసం అర్రులు

పొందారు. అవి లభించక పోగా నిరాశా నిస్పృహల్ని పొందకొని దుఃఖించారు. అటువంటి స్థితిలో వారికి జీవితమంతా బాధామయంగా తోచింది. లోకం వీరిని ఆదరించక పోవటంతో సంఘంపై విరక్తి భావంతో ఒంటరి తనాన్ని అనుభవించారు. కొంత బాధ నిజమైనబాధ కాగా మరికొంత పాశ్చాత్య సంప్రదాయం నుంచి తీసుకొచ్చింది కూడా భావకవులపై ప్రభావితమైంది పాశ్చాత్య సాహిత్య జగత్తులో చాలా కాలం నుంచి కవులు తాము ప్రేమించిన తరుణులు లభించక పోగా నిరాశా నిస్పృహలకు లోనై ఆత్మాశ్రయ ధోరణిలో కవిత అల్లారు. డాంటీ, పెట్రార్క్, సిడ్నీ, షేక్స్పియర్, షెల్లీ, కీట్సు, బైరన్, బ్రౌనింగ్, రోసెటీ మొదలైన వారు ఇటువంటి స్థితిలోనే ఆత్మాశ్రయ కవిత్వం వ్రాశారు.16 వీరి ప్రభావాలకు లోనై భావ కవులూ తమని వరించిన దుఃఖంలో కంఠ దఘ్నంగా కూరుక పోయి ఆత్మాశ్రతత్వాన్ని ఆశ్రయించి రచనలు చేశారు.

ఇంత వరకు ఆత్మాశ్రయ కవిత్వం అంటే ఏమిటో కవి ఆత్మాశ్రయుడు కావడానికి కారణాలేమిటో తెలుసుకొన్నాం. ఇక కవిత్వంలో ఆత్మాశ్రయత్వం ఎలా ప్రతిబింబిస్తూ వుంటుందో చూద్దాం. సర్వ సామాన్యంగా ఈ ఆత్మాశ్రయత్వం కవి వ్యక్తిగతమైన అనుభవానికి సంబంధించింది, కవిత్వంలో ఆత్మాశ్రయత్వం ఉత్తమ పురుష సర్వనామం 'నేను' తో వ్యక్త మవుతుంది. ఈ 'నేను' కేవలం కవి వ్యక్తిత్వానికి మాత్రమే సూచకం. అంతేకాని అభ్యుదయ కవిత్వం లోని 'నేను' లాంటి సమాజ సూచకం కాదు. అభ్యుదయ కవిత్వంలోని 'నేను' సమాజ పరమైంది. అక్కడ "నేను" లో కవి వ్యక్తిత్వం లేదు, సమాజంలోని ఒకడుగా మాత్రమే అక్కడ కవి వుంటాడు అలా కాకుండా భావ కవిత్వంలో ఆత్మపరమైన 'నేను' కేవలం వ్యక్తి వాదానికి సంబంధించింది. ఆ 'నేను'లో కవి మాత్రమే ప్రతిబింబిస్తూ వుండి అతని వ్యక్తిత్వం మేరకు భావాలు చెప్పబడి వుంటాయి.

కవియైన వాడు తన మానసిక క్షేత్రంలో పుట్టిన సుఖదుఃఖాత్మకాలైన భావాలను కావ్యరూపంలో వ్యక్తం చేసినపుడు, అటువంటి రచన ఆత్మాశ్రయ మౌతుంది. అంతే కాదు కవియైన వాడు చుట్టూవున్న ప్రపంచాన్ని చూసి తద్వారా ఏర్పడ్డభావాల్ని తనవిగా వెల్లడిచేస్తే అట్టి రచనకూడా ఆత్మాశ్రయమే అవుతుంది. ఏకత్వంలో ఇటువంటి సందర్భాల్లోని ఆత్మాశ్రయత్వం చోటుచేసుకొని వుంటుంది.

అంటే ఈ ఆత్మాశ్రయత్వం కవి కవిత్వాన్ని వ్యక్తం చేసే తీరు పైన్నే ఆధార పడి వుంటుంది. ఏభావాన్నైనా తన వ్యక్తిత్వంతో రంగరించి తనదిగా ప్రకటించు కొన్నప్పుడే అది ఆత్మాశ్రయ మౌతుంది.

అలా కాక కవి యైన వాడు తన భావాల్ని ఇతర పాత్రలకు అంటగట్టి ఇతర పాత్రల ముఖంగా చెప్పినపుడు ఆ భావాలు స్వయంగా కవివే అయినా మనం వాటిని కవి భావాలుగా కాక ఆయాపాత్రల భావాలుగా గ్రహిస్తాం. అవి బాహ్యంగా పాత్రలను ఆశ్రయించినవి కాబట్టి వస్త్వాశ్రయాలౌతాయి. అలా కాక ఒక్కో సంద ర్భంలో ఇతరుల బాధల్నే, భావాల్నే కవి తనవిగా భావించి తన ముఖంగా చెప్పు కొన్నప్పుడు పైన వివరించినట్లు ఆత్మాశ్రయాలే అవుతాయి. అందువల్ల కవిత్వంలో ఆత్మాశ్రయత్వం అనేది కవి చెప్పేతీరు పైన్నే ఎక్కువ ఆధారపడి వుంటుంది. ఇందుకే నారాయణరెడ్డి పోతన భాగవతంలోనూ, కాళిదాసుని మేఘసందేశంలోనూ ఆత్మాశ్రయత్వం లేదని పేర్కొన్నాడు.17

ఒక్కోసారి కవి తన భావాలను, అనుభవాలను గాక తన జీవితాన్నే కావ్య గతం చేస్తే అది ఆత్మాశ్రయం అనిపించుకోనదు. కారణం కవియైనవాని భావాల్ని కాక ఇక్కడ కవి జీవితాన్ని, జీవితంలోని సంఘటనల్ని, ఇతర వ్యక్తులకు సంబంధించిన అంశాల్ని కవి చెప్పవలసి వస్తుంది. ఇవన్నీ బాహ్య విషయాలు. అంతేకాక కవి జీవితాన్ని ఇతివృత్తంగా గ్రహించి చెప్పబడేవి. అందువల్ల కవే స్వయంగా తన జీవిత గాథని కథనం చేసినపుడు అది ఆత్మాశ్రయం కాక వస్త్వా శ్రయం అవుతుంది.

కవిత్వంలో ప్రతిబింబించే ఈ ఆత్మాశ్రయత్వంతో చాలా సన్నిహితంగా రెండు అంశాలు ముడిపడి వున్నాయి. అవి 1. అంతర్ముఖత్వం 2. అనుభూతి తత్వం. వీటిని గురించి ఒకింత ప్రస్తావించి ఆపైన ఆత్మాశ్రయత్వం పైన వచ్చిన విమర్శల గురించి చర్చిస్తాను.

అంతర్ముఖత్వం : కవిత్వంలో ఆత్మాశ్రయత్వానికి అంతర్ముఖత్వానికి చాలా దగ్గరి సంబంధం వుంది. కవి తనలోకి తాను చూసుకోవడాన్ని అంతర్ముఖత్వం అంటున్నారు. కవి బాహ్య విషయాలకు ప్రాధాన్యం ఇవ్వకుండా తన వ్యక్తిత్వ విలువల్ని బట్టి తనలో నిమగ్నమై ఆత్మ సందర్శనం చేసుకోవటం అంతర్ముఖత్వం అవుతుంది. అంతేకాదు తనలోకి తాను నిమగ్నమైన కవి తనలో బాహ్య ప్రపం చాన్ని చూసుకోవటం కూడా అంతర్ముఖత్వమే అవుతుంది.

కవి అంతర్ముఖుడు కావటం వల్ల కవికి తన స్థితిగతులతోపాటు అతని అభిరుచుల కనుగుణంగా ప్రతిబింబించే లోక విషయాలు కూడా తనవిగా భావించే అవకాశం ఏర్పడుతుంది. దాన్ని బట్టి కవి అంతర్ముఖుడవటంవల్ల కవి చేసే రచనలు ఆత్మాశ్రయంగా వెలువడతాయి. కవి చేసే రచనలు కవి వ్యక్తిగత అంశాలతో పాటు, లోక సంబంధమైన లేక అలౌకికమైన అంశాలు కావ్యగతం అవటానికి వీలుంది. అంతే కాకుండా కవి ప్రతి వస్తువును భౌతిక దృష్టితో కాక మనో నేత్రంతో దర్శించే అవకాశం కలుగుతుంది. ప్రతి వస్తువులోనూ బాహ్య సౌందర్యాన్ని గాక అంతఃసౌందర్యాన్ని చూడ గలుగుతాడు. ఆ చూడ గలిగిన దాన్ని కావ్యగతం చేస్తాడు. అది ఆత్మాశ్రయ ధోరణిలో కొనసాగుతుంది. అంటే కవి అంతర్ముఖుడై తనసీ, తన చుట్టూ వున్న ప్రపంచాన్ని దర్శించి రచించిన కవిత్వం ఆత్మాశ్రయ కవిత్వం కావడానికి వీలుంది. అందువల్లే అంతర్ముఖత్వానికి, ఆత్మాశ్రియత్వానికి విడదీయరాని సంబంధం ఏర్పడింది.

ఈ అంతర్ముఖత్వం అనేది ఆత్మాశ్రయత్వంతో పాటు ఆధునిక కవిత్వంలో చోటు చేసుకొన్న ముఖ్యాంశగా కనిపిస్తుంది ఈ అంతర్ముఖత్వం వల్ల కవికి విస్తృతమైన దృక్పథం ఏర్పడింది. కవి తన వ్యక్తిత్వాన్ని విస్మరించి ఇతరుల సుఖ దుఃఖాలతోనూ, విశాలమైన ప్రపంచంతోనూ ఐక్యం కావటానికి, అలా ఐక్యమై వాటితో తాదాత్మ్యం చెందడానికి అంతర్ముఖత్వం దోహదం చేసింది. అంతే కాక కవికి కొండంత సహనాన్ని ఈ అంతర్ముఖత్వమే అలవర్చింది. దీంతో కవికి ఆత్మస్థైర్యం ఏర్పడి తనూ ఇతర ప్రాణుల్లాంటి వాడేనని తన బాధ కూడా ప్రపంచంలోని ఇతర ప్రాణుల బాధలాంటిదేనని వేడిగా వాడిగా తన బాధనూ, తన సంతోషాన్ని కావ్యగతం చేశాడు. ఇలాంటి భావాలే ఆత్మాశ్రయ రీతిని సంతరించు కొన్నాయి.

అనుభూతి తత్వం: ఆత్మాశ్రయ కవిత్వంలో ముఖ్యంగా కనిపించేది కవి యొక్క అనుభవం లేక అనుభూతి కావటం చేత అంతర్ముఖత్వానికిఆత్మాశ్రయత్వానికి ఎలాంటి అవినాభావ సంబంధం వుందో అలాంటి అవినాభావ సంబంధమే అనుభూతికి ఆత్మాశ్రయత్వానికి వుంది. ఈ అనుభూతి తత్వం అనేది భావ కవితా సంబంధం అయినా ఇటీవలి కాలంలో బహుళ ప్రచారాన్ని సంతరించుకుంది. అనుభూతి తత్వంతో కూడుకొన్న కవిత్వానికి ఇటీవలి కాలంలో ఇంద్రగంటి శ్రీకాంత శర్మ, ఇస్మాయిల్ మొదలైన వాళ్ళు ప్రచారాన్ని కలిగించారు.

కవి అనుభవానికి లేక అనుభూతికి అత్యంత ప్రాధాన్యం ఇచ్చే తత్వాన్ని అనుభూతి తత్వం అని అలాంటి తత్వంతో వెలువడుతున్న కవిత్వాన్ని అనుభూతి కవిత్వం అనీ అంటున్నారు. ఇది కూడా కవి వ్యక్తిత్వాన్ని అంటి పెట్టుకొని వుండేతత్వం కాబట్టి ఆత్మాశ్రయత్వంతో కొంత సామీప్యాన్ని కలిగివుంది.

"భావము కాని భావ పరంపర కాని హృదయము మీద ప్రభావ వంతమైన ముద్ర వేసిన యెడల దానిని "అనుభూతి" అని యందుము. అనగా నాటి భావము యొక్క ప్రభావము భవిష్యత్తులోనికి కొంత వరకేని చొచ్చుకొని పోవగలిగినప్పుడే 'అనుభూతి' అని అనిపించు కొనుటకు తగిన అర్హతను గడించుకొనును". 18 అని స్ఫూర్తి శ్రీ పేర్కొన్నాడు.

కవియైన వాడు ఒక దృశ్యాన్ని, ఒక సంఘటనను చూసినపుడు కలిగే భావాల్ని అనుభూతులుగా హృదయంలో భద్రపరుచు కొంటాడు. కవి హృదయంలో భావాలు కవి ప్రయత్నం లేకుండా వాటంతటవే ఏర్పడు తుంటాయి. అలాంటి భావాల్లో కవికి నచ్చినవి మాత్రమే నిలిచి మిగిలినవి మరపులో లయిస్తాయి. మరచిపోగా మిగిలినవి అనుభూతులుగా రూపు దాల్చుకొంటాయి. ఈ అనుభూతి ఎప్పుడూ ఆత్మాశ్రయమయ్యే వుంటుంది. కాబట్టి ఆత్మాశ్రయత్వానికీ అనుభూతికీ దగ్గర సంబంధం స్ఫురిస్తుంది.

కవి హృదయంలో తటిల్లతవలే మెరసిన భావాలు కవి అనుభవానికి అనుగుణంగా రూప కల్పన కావింపబడి కావ్యగతం చేయబడితే అవి ఆత్మాశ్రయాలవుతాయని ఇది వరకే పేర్కొన్నాను. ఈవిషయాన్నే 'కేవలమొక్క క్షణములో కలిగిన యాత్మానుభవమును చక్కని భావముతో మేళవించి యుద్వేగముతో చెప్పుట నవ్య కవితా లక్షణమైనదని". 19 కవిత్వంలో ఆత్మాశ్రయత్వాన్ని వివరిస్తూ పిల్లల మర్రి వెంకట హనుమంత రావు పేర్కొన్నాడు. కానీ అలాంటి భావ సముదాయమే కవిహృదయంలో అణగి మణిగివుండి తరువాతి కాలంలో ఏదో ఒక సన్ముహూర్తంలో మళ్ళీ స్ఫురణకు వచ్చి ఆలోచనా మగ్నమైన హృదయం నుంచి వెలువడి కావ్యరూపం వహిస్తే అది అనుభూతి పరమైందవుతుంది. అనుభూతిలో ఆత్మాశ్రయత్వం బలీయంగా ఉంటుంది. అంటే అనుభూతి కవిత్వం అంతా ఆత్మాశ్రయ కవిత్వం అవడానికి వీలుంది. కానీ ఆత్మాశ్రయ మైందంతా అను భూతి పరం కావడానికి అవకాశం లేదు. ఆంగ్ల కవిత్వంలోని

'Subjectivity' ని తెలుగులో ఆత్మాశ్రయ మన్నట్లు 'feeling' ని అనుభూతి అంటున్నారు.

ఆత్మాశ్రయ కవిత్వం_విమర్శలు: ఆధునికాంధ్ర కవిత్వంలో పొడచూపిన ఆత్మాశ్రియత్వంపై పలు విమర్శలు వచ్చాయి. ఆత్మాశ్రయ కవిత్వం వ్యక్తిగతమైందనీ, కవి రాగద్వేషాలే అందులో ప్రదర్శితాలవుతాయని ఒక అపోహ ఏర్పడింది. ఇంకా ఆత్మాశ్రయ కవిత్వం వ్యక్తివాదంతో నిండి సాంఘిక అంశాలకి ప్రాతినిధ్యం ఇవ్వదన్న అభిప్రాయం కూడా వ్యాప్తిలో వుంది.

ఆత్మాశ్రయ కవిత్వంలో 'నేను' అన్నది కనిపించటం వల్ల ఈ కవిత్వం వ్యక్తిగత మైందనీ, వ్యక్తివాద కవిత్వం అనీగుర్తించబడింది. వాస్తవానికి ఈ "నేను" అన్నది కేవలం కవికి మాత్రమే సంబంధించిది కాదు. ఒక్కొక్కప్పుడు ఈ 'నేను' కవి మానసిక అవస్థల్ని బట్టి ఒక చెట్టు కావచ్చు. ఒక పుట్ట కావచ్చు, ఒక కొమ్మ కావచ్చు, ఒక ఆకు కావచ్చు, ఒక ప్రవాహం కావచ్చు. ఒక సముద్రం కావచ్చు, లేక ఎదుటి వ్యక్తి కావచ్చు. సమాజమూ కావచ్చు. కవి కేవలం తన భావాల్నే కాక ఇతరుల భావాల్ని తనవిగా భావించి మదన పడి అనుభవించి ఆలోచించి తనవిగా చెప్పటమే ఆత్మాశ్రయ కవిత్వ లక్షణం. అందువల్ల 'నేను' కవికి మాత్రమే పరిమితమైంది కాక విశాల దృక్పథంతో కూడుకొని కవి చుట్టూ వున్న ప్రపంచాన్నంతా కవి వ్యక్తిత్వం ద్వారా ప్రతిబింబింప జేసేదిగా వుంటుంది.

ముఖ్యంగా ప్రణయ కవిత్వంలో కనిపించే 'నేను' కూడా ఇలాంటిదే కావచ్చు విధి వంచితులైన ప్రేయసీ ప్రియుల కరుణరస పూరిత గాధల్ని విన్నప్పుడు కవి హృదయం స్పందిస్తుంది. ఆ హృదయ స్పందనలోంచి ప్రేయసీ ప్రియులకు సంబంధించిన ప్రేమ భావాల్ని, ప్రేమతీవ్రతని వెల్లడిచేయవచ్చు. అటువంటప్పుడు అవి సంకుచితత్వంతో కూడు కొన్న వ్యక్తిగత భావాలు కావు. విశాల దృక్పథంతో వెలువడ్డ విశ్వ ప్రేమకి సంబంధించిన అంశాలవుతాయి. అంటే ఆత్మాశ్రయ కవిత్వంలో కవి స్వానుభవాలతో పాటు తన చుట్టూవున్న సంఘం, దాని సాధక బాధకాలు కూడా వ్యక్తం కావడానికి అవకాశం వుంది.

గుంటూరు శేషేంద్ర శర్మ, 20 డా॥ కేతవరపు రామకోటి శాస్త్రి[21] లు ఆత్మాశ్రయ కవిత్వం, వస్త్వాశ్రయ కవిత్వం అనే విభాగమే అశాస్త్రీయ మైంద

న్నాడు. వీరిద్దరూ ఆత్మాశ్రయ కవిత్వం అన్న విభాగాన్ని చేసినవారే. కానీ అలాంటి విభజన పనికాదన్నారు. శేషేంద్రశర్మ ఆత్మాశ్రయ కవిత్వాన్ని గూర్చి పేర్కొంటూ..... Subjectivity is considered the hall mark of Poetry as distinguished from the external beauty of human life which was the concern of old Poetry.[22] అని నిర్వచనం చేశారు. డా॥ కేతవరపు రామకోటి శాస్త్రి "ప్రేమ వలన శాంతి లేదని భక్తి భావముతో ఈశ్వరుని యందు నిలుకడపొందుటగా భావ కవిత్వము ఆత్మాశ్రయమై కృష్ణశాస్త్రిగారి యందు తిష్టవేసినది."[23] అని పేర్కొన్నాడు. వీరిరువురూ కవిత్వంలో ఆత్మాశ్రయత్వం వుందని అభిప్రాయ పడ్డవారే. కానీ అటువంటి విభాగం అశాస్త్రీయమైందని చెప్తున్నారు.

నిజానికి 'కవి సేన మేని ఫేస్టోలో' శేషేంద్ర శర్మ వ్రాస్తూవున్న కవిత్వం ఆత్మాశ్రయమైంది అని ఇతరులు దాన్ని నేటి కవిత్వ విలువలతో ఆదరించక పోయినపుడు కలిగిన ఉద్రేకంతో ఈ మాటలన్నట్లు తెలుస్తుంది. కవిసేన మేనిఫెస్టోలో "కవిత్వం అది ప్రేమ కవిత్వ అది ఆత్మాశ్రయ కవిత్వం"[24] అన్న విభాగంలో శేషేంద్ర శర్మ ఆత్మాశ్రయ కవిత్వాన్ని గురించి విపులంగా చర్చించాడు. ఆత్మాశ్రియ కవిత్వానికి నిర్వచనం చెప్పి, ఆ కవిత్వాన్ని గురించి విపులంగా చర్చించి ఆవిభాగం సరియైంది కాదనటం సమంజసంగా లేదు. ఏదైనా ఒకనిర్వచనానికి లొంగి, ఒక విభాగంగా విభజించడానికి ఆధారాలున్న అంశాన్ని ప్రత్యేకమైన అంశంగా వింగడించటం శాస్త్రీయ దృక్పథమే అవుతుంది. అసలు ప్రాచీన కవిత్వాన్ని నుంచి ఈ ఆధునిక కవిత్వాన్ని వేరు చేసే ముఖ్యమైన అంశం ఈ ఆత్మాశ్రయమే. అటువంటి అంశాలున్న కవిత్వాన్ని ప్రత్యేక విభాగం క్రింద పేర్కొంటూ పరిశీలన చేయటం అవసరం.

తిరుపతిలో 14, జూన్. 1981 న జరిగిన చర్చలో రామకోటి శాస్త్రి కవిత్వాన్ని ఆత్మాశ్రియం, వస్త్వాశ్రయం అన్న విభాగాలుగా విభజించటం ఏమంత శాస్త్రీయమైన పద్ధతి కాదంటూ కొంత సడలింపుతో బాగా పరిశీలించిన పిమ్మట ఏనిర్ణయిమూ తీసుకోవాలన్నారు. వీరి అభిప్రాయంలో కొంత సడలింపు కనిపిస్తూవుంది. శేషేంద్ర శర్మ లాగా రామకోటిశాస్త్రి దృఢంగా ఆ విభాగం అశాస్త్రీయమైందని పేర్కొన లేదు.

శేషేంద్ర శర్మ, రామకోటి శాస్త్రిల వంటి విమర్శకులు కవిత్వంలో ఆత్మాశ్రయ కవిత్వం, వస్త్వాశ్రయ కవిత్వం అన్న విభాగం అశాస్త్రీయమైంది అనడానికి పై కారణాలతో పాటు వేరొక కారణం వుంది. ఒక్కొక్కప్పుడు స్వల్ప ఇతివృత్త ప్రాధాన్యం గల కవిత్వం ఆత్మాశ్రయం కావడానికి వీలున్నది. అటువంటప్పుడు దాన్ని ఏ విభాగం క్రింద చేర్చాలన్నా సమస్య ఎదురౌతుంది. కాబట్టి ఇటువంటి విభాగం ఆదరణీయం కాదన్నది వీరి అభిప్రాయం కావచ్చు కానీ అటువంటి కవిత్వాన్ని వస్తు ప్రాధాన్యం వుంది కాబట్టి వస్త్వాశ్రయ కవిత్వం క్రిందనే పొందు పరచవచ్చు లేదా వస్తు ప్రాధాన్యం వున్న ఆత్మాశ్రయ కవితగా పేర్కొనవచ్చు

ఈ సందర్భంలో ఆత్మాశ్రయ కవిత్వం పై వున్న ఇంకో విమర్శనుకూడా పరిశీలించాల్సిన అవసరం వుంది. అసలు వస్తువులేకుండా కవిత్వం ఉండదు కదా? ప్రేమ, ప్రకృతి, భక్తి మొదలైన వాటికి సంబంధించిన భావాలకు ఆయా అంశాలు వస్తువులౌతున్నాయికదా: ఈ విషయాన్ని అలోచించాలని ఆయన సూచించారు.25

కావ్యాల్లో నిర్వహింపబడే ఇతివృత్తంలో భావ కవిత్వంలో వున్న కావ్య వస్తువుల్ని పోల్చి చూస్తే వాటి ముందు చాలా అల్పమైన ఇతి వృత్తాలుగా భావ కవిత్వంలోని కావ్య వస్తువులు కనిపిస్తాయి. కావ్యాల్లో చోటు చేసుకున్న ఇతి వృత్తాలు సుదీర్ఘమైనవి, విస్తృత పరిధి గల్గినవి. అంతేకాక ఆ ఇతివృత్త నిర్వహ ణకు అనేక అంశాలు తోడ్పడతాయి. భావ కవిత్వంలోని ప్రేమ, ప్రకృతి, భక్తి మొదలైనవి ఆయా భావాలకు ఇతివృత్తాలే అయినా వాటి ప్రాధాన్యత అంతగా కవిత్వంలో చోటుచేసుకోదు. కేవలం ఆ వాసనలతో కవి కున్న అనుభవజ్ఞానంతో వాటికి సంబంధించిన భావాలను కావ్యగతం చేస్తుంటాడు. ఇక్కడ వస్తువుల కంటే కవి భావనా బలానికే ఎక్కువ ప్రాధాన్యం వుంటుంది. కానీ వస్త్వాశ్రయ కవిత్వంలో అలా కాక కావ్య వస్తువులకే ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వడం జరుగు తుంది. అందువల్ల ఆత్మాశ్రయ కవిత్వంలో అణుమాత్రమైన వస్తువు వున్నా ఆయా విషయాలకి సంబంధించిన కవి ఆత్మీయత అనుభవం మాత్రం ప్రధా నంగా వుంటాయి. వాటి పరిమితుల్లో జరిగిన కవి హృదయ స్పందన మాత్రం కవిత్వంగా రూపు సంతరించు కొంటుంది. కాబట్టి వస్తు విషయం ఇక్కడ ప్రధానం కాదు.

ఆత్మాశ్రయ కవిత్వం సాంఘిక ప్రయోజనం దృష్ట్యా ఆదరణీయ మైంది కాదు అన్న విమర్శకూడా వ్యాప్తిలో వుంది. కానీ ఇదీ సత్యదూరమైన విషయం గానే కనిపిస్తుంది. ఆత్మాశ్రయ కవిత్వం విశ్వ జనీన దృక్పథాన్ని సంతరించు కొంటే కలిగే ప్రయోజనం విస్తృత పరిధి కలది. కవి వ్యక్తిత్వాని కంటే మానవ వ్యక్తిత్వాలకి పరిమితమైన విషయాలు ఆత్మాశ్రయ పద్ధతిని ఆశ్రయిస్తే అవి అందరికీ వర్తించే అంశాలవుతాయి. అప్పుడు వస్త్వాశ్రియ కవిత్వం సాధించిన సామాజిక స్పృహ ఆత్మాశ్రయ కవిత్వమూ సాధించడానికి వీలవుతుంది. అంతే కాకఉత్తమమైన మేల్తరమైన కవిత్వం రూపొందే అవకాశం వుంటుంది.

భావ కవిత్వంలోని ఆత్మాశ్రియత్వంలో కవి వ్యక్తిత్వంతో పాటు సామా జిక స్పృహ ధ్వనిస్తూనే వుంటుంది. ఈ విషయాన్నే26 'భావ కవిత్వంలోని ఆత్మాశ్రయత్వంలో సమాజశ్రేయం ధ్వనింపబడుతూనే వుంది'26 అని సోమ సుందర్, 'భావ కవిత్వము నందు వాచ్యార్థముగా కన్పించెడు కవి జీవిత కష్ట సుఖముల వెంట అదే పనిగా పడరాదు. తమకు తెలిసీ తెలియకుండా మానవు లభిషించుచున్న, చెప్పుకొనుటకు చేత కాక తిక మక పడుచున్న, దుర్భలము లయ్యును భరింపబడుచున్న-ఇచ్ఛలనూ, సుఖదుఃఖాలను. వేదనలనూ కవి తాను తనను వ్యక్తము చేసి కొనుటకు నెపముగా విశ్వ మానవుల బాహ్యాభ్యంతర జీవిత తత్వమును ప్రదర్శించు చున్నాడు'27 అని రామకోటి శాస్త్రి పేర్కొన్నారు.

ఆత్మాశ్రయ కవిత్వం సామాజిక స్పృహని కలిగి వుంటుంది అనడానికి తిలక్ కవిత కొంతవరకు ఉదాహరణ ప్రాయంగా నిలుస్తుంది. 'ముసలివాడు' అనే ఖండికలో తిలక్ కరుణరస పూరితమైన మానవ గాథని ఆత్మాశ్రయ ధోరణిలో వ్యక్తం చేశాడు. నర్వస్ వీక్‌నెస్ వల్ల తిలక్ జబ్బు పడ్డం. ఆ కారణంగా చని పోతానేమో నన్న భయం చుట్టుకోవటం మూలంగా తిలక్ తన్ను తానొక ముసలి వాడుగా భావించుకొంటూ-

'కను గూడులు నల్లనయి
పెను మ్రోడులు చల్లనయి
కీలు కీలుగా బాధగా
నాడు నాడులు లాగగా
.... .... ....

కన్ర నానుక సాగి పోయే
ఎముకల గూడుని అరిగి పోయిన జోడుని'28

అంటూ జీర్ణ దేహాణ్ణి, ఆకలితో అరుస్తున్న వాణ్ణి మానసిక సంచలనంతో మన కళ్ళకు కట్టినట్లు చూపించాడు కరుణరస భరితంగా. ఈ విషయంలో ముసలి వాని రూప చిత్రణ కన్నా కవి ఆర్ద్ర హృదయం బలీయమై ఆత్మాశ్రయ ధోరణికి పుణికి పుచ్చుకొంది. ఇక్కడ ముసలి వాడుగా కనిపించేది తిలక్ మాత్రమే కాదు మానవ వ్యక్తిత్వం. అందువల్ల వ్యష్టి పరమైన విషయం కాకుండా సమిష్టి పరమైన విషయమూ ఇక్కడ ఆత్మాశ్రయ ధోరణిలో సామాజిక స్పృహని కలిగి వుందని చెప్పవచ్చు.

ఇంతవరకు ఆత్మాశ్రయ కవిత్వం అంటే ఏమిటో వివరించి, అంతర్ముఖత్వానికి, ఆత్మాశ్రయత్వానికి; అనుభూతికి, ఆత్మాశ్రయత్వానికి వున్న సంబంధాన్ని వివరించడం జరిగింది. దీంతో పాటు ఆత్మాశ్రయ కవిత్వంపై వచ్చిన విమర్శల పరిశీలనా జరిగింది. ఇక ఆత్మాశ్రయతత్వం కవిత్వంలో ఏయే అంశాల్లో చోటు చేసుకొందో పేర్కొని వాటిని ముందు ముందు విపులీకరిస్తాను.

ఆంగ్లంలో లిరికల్ కవిత్వం, మెడిటేటివ్ మరియూ ఫిలసాఫిక్ కవిత్వం, ఓడ్, ఎలిజీ, ఎపిస్టల్, సెటైర్ వంటి వాటిని ఆత్మాశ్రయ కవిత్వంగా పరిగణించారు. నెరేటివ్ మరియు డ్రామటిక్ కవిత్వాలు వస్త్వాశ్రయ కవిత్వాలుగా గుర్తింపబడ్డాయి. తెలుగు కవిత్వంలో దాదాపు ప్రాచీన కవిత్వం అంతా వస్త్వాశ్రయ కవిత్వంగానే కొనసాగింది. పురాణాలు, ప్రబంధాలు, కావ్యాలు వస్తువునాశ్రయించే వెలువడ్డ రచనలు. ఆధునిక కవిత్వంలో భావ కవిత్వం ఆత్మాశ్రయ ధోరణుల్ని ఆశ్రయించి వెలువడింది. గురజాడ, రాయప్రోలు రచనలు కొంత వరకు వస్త్వాశ్రయ రీతిలో కొనసాగాయి. కృష్ణశాస్త్రి, నండూరి, బసవరాజు, అబ్బూరి, విశ్వనాథ మొదలైనవారి రచనలు ఆత్మాశ్రయ రీతినే ఎక్కువగా అనుసరించాయని చెప్పొచ్చు.

ప్రాచీన కవిత్వంలో ముఖ్యంగా శతక కవిత్వం, పద కవిత్వం ఆత్మాశ్రయతతే కలిగి వున్నాయి. భావ కవిత్వ శాఖలో ముఖ్యంగా ప్రకృతి, ప్రణయం, భక్తి, దేశభక్తి, స్మృతి ఆత్మాశ్రయంగానే వెలువడ్డాయి. సంఘ

సంస్కరణ కవిత్వం మాత్రం అభ్యుదయ కవిత్వంలా వస్త్వాశ్రయంగా వెలువడింది. ఈ విషయాన్ని తరువాతి ప్రకరణాల్లో విపులంగా చర్చిస్తాను.

ఈ ఆత్మాశ్రయత్వం ప్రాచీన కవిత్వంలో కంటే ఎక్కువగా అధునిక కవిత్వంలోనే - పాశ్చాత్య కవితా ప్రభావంతో-కనిపిస్తుంది. అధునిక కవిత్వంలో ఆత్మాశ్రయత్వం ప్రేమ. ప్రణయంతోనే ప్రారంభమై ప్రకృతి. భక్తి దేశభక్తి. స్మృతి మొదలైన అంశాలకు విస్తరించిందని చెప్పవచ్చు. ప్రేమ, ప్రణయంతో కంఠ దగ్నంగా దుఃఖంలో మునిగి పోతున్న కవికి తన విషయాల్ని బహిర్గతం చెయ్యాలన్న దృఢ సంకల్పం ఏర్పడి నా ప్రేయసి. నా వలపు అంటూ కవి ఆత్మాశ్రయత్వాన్ని వెల్లడించు కొన్నాడు. మనదేశం, మనదేవుళ్ళు అనడంలో ఔచిత్యం వుంది. కానీ మన ప్రేయసి, మన ప్రణయం అనటంలో ఔచిత్యంలేదు కాబట్టి భావ కవి 'నా', 'నేను'లను కావ్యగతంచేస్తూ ఆత్మాశ్రయత్వాన్ని వెల్లడి చేసుకొన్నాడు. అందువల్లే ప్రణయ కవిత్వంలోని వ్యక్తివాదం ప్రారంభమై అధునిక కవిత్వంలో ఆత్మాశ్రయత్వం చోటుచేసుకొంది.

ప్రేమ ప్రవాహంలో కొట్టుకపోతూన్న భావకవి స్వేచ్ఛని కాంక్షించి చుట్టూ వున్న ప్రదేశాల్లో సంచరిస్తూ బాధోశపమనం చేసుకో ప్రయత్నించాడు అటువంటి సమయాల్లో కొండ చరియల్లోనో, జలపాతం సమీపాన్నో, సముద్రపు ఒడ్డునో పూధోటల్లోనో సుందర వస్తుజాలం మ్రోలనో కవి స్వేచ్ఛా విహారం చేశాడు. అటువంటి అతని సంచారంలో ప్రకృతి కవికి ఆకర్షణీయంగా కనిపించింది. జలపాతం హోరో, సముద్రం అలల విన్యాసమో, కోకిల కల కూజితమో అతని హృదయాన్ని ప్రకంపింపజేసింది. ఆ ప్రకంపనలు అతని హృదయంపై చెరగని ముద్రవేశాయి. ఆ ఆనందాన్ని కవి వ్యక్తిగత అంశాలతో కావ్యగతం చేయటం వల్ల ప్రకృతి విషయాలు కూడా ఆత్మాశ్రయ ధోరణిలో చెప్పబడ్డాయి.

కవి పొందిన సంతోషమే కాక దుఃఖం కూడా కవి హృదయాన్ని కదలించడం మూలాన తట్టుకోలేక ప్రకృతిని సంతోషం కోసం ఆశ్రయించినట్లే దుఃఖంలో భావ కవి భగవంతుణ్ణి ఆశ్రయించాడు. భక్తిభావంకూడా కవి హృదయంపై ప్రభావం చూపి ఆత్మీయతా ముద్రని సంతరించుకొంది. అందువల్ల భక్తికూడా ఆత్మాశ్రయతతో జాల్వారింది. ఇలాగే ప్రణయం, ప్రకృతి. భక్తితోపాటే దేశభక్తి, స్మృతితలు కవివ్యక్తిత్వాన్నే ప్రతిబింబించేవిగా వుంటూ ఆత్మాశ్రయత్వాన్నే వెలిబిమ్మాయి.

ఆత్మాశ్రయత్వం భావ కవిత్వంలోనే కాక భావ కవిత్వ ప్రభావానికి లోనైన కొందరు అభ్యుదయ కవుల్లోనూ చోటుచేసుకొంది. ఈ అంశం తరువాతి ప్రకరణంలో చర్చకు వస్తుంది.

ఈ అధ్యాయంలో కవిత్వంలో వున్న రెండు రీతులు - వస్త్వాశ్రయరీతి. ఆత్మాశ్రయ రీతుల వివరణతో పాటు వివిధ కవుల, విమర్శకుల నిర్వచనాలు ప్రస్తావనకు వచ్చాయి. అంతేకాక ఆత్మాశ్రయ కవిత్వానికి, అంతర్ముఖత్వానికి అనుభూతి కవిత్వానికి వున్న పరస్పర సంబంధం వివరించడం జరిగింది. తరువాత ఆత్మాశ్రయ కవిత్వంపై వచ్చిన విమర్శలు ప్రస్తావనకు వచ్చాయి. చివరగా కవిత్వంలో ఆత్మాశ్రయత్వం ఏఏ అంశాల్లో చోటుచేసుకుందో వివరించాను.

రాబోయే ప్రకరణంలో ప్రాచీన కవిత్వంలో ఆత్మాశ్రయ వైఖరులను వివరించడానికి ప్రయత్నం చేస్తాను. ముఖ్యంగా పురాణ కవిత్వం నుంచి తిట్టు కవిత్వం వరకూ వున్న కవిత్వ ప్రక్రియలు వాటిలోని ఆత్మాశ్రయ, వస్త్వాశ్రయ రీతుల్ని పరికిద్దాం.

## ఉదాహృత సూచికలు

1. అప్పల నరసింహం, దేవులపల్లి, ఆంధ్రవాఙ్మయమున ఆంగ్లసారస్వత ప్రోద్బలము, భారతి, మార్చి, 1924. పు. 24.
2. సత్యనారాయణ, విశ్వనాథ, లిరికల్‌పొయిట్రీ, భారతి, అక్టోబరు, 1939. పు. 423.
3. Dictionary of Literary Terms, PP. 259, 260.
4. లక్ష్మీకాంతం, పింగళి, సాహిత్య శిల్ప సమీక్ష, పు. 204.
5. „ „ పు. 210.
6. Hudson. An Introduction to the Study of Literature, p. 96.
7. నారాయణరెడ్డి, సి. ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు - ప్రయోగములు. పు. 177.

8. జగన్నాథరావు, కటికినేని. ఆధునికాంధ్ర కవిత్వం, భారతి, మే. 1940. పు. 528.

9. వెంకట హనుమంతరావు. పిల్లలమర్రి. అభినవ కవిత, భారతి. జనవరి. 1946. పు. 5

10. శ్రీకాంతశర్మ. ఇంద్రగంటి, కాంతికవాటం. పు. 62

11. లక్ష్మీరంజనం, ఖండవల్లి. భావకవిత్వము, లక్ష్మీరంజన వ్యాసావళి.

12. లక్ష్మీకాంతం, పింగళి, సాహిత్య శిల్ప సమీక్ష. పు. 211, 212.

13. చాటుపద్యమణిమంజరి, రెండవభాగము. పు. 179, 180.

14. ప్రభాకరశాస్త్రి. వేటూరి, శృంగార శ్రీనాధము, పు. 293.

15. ప్రభాకరశాస్త్రి, వేటూరి, చాటుపద్యమణిమంజరి, మొదటిభాగము,పు.161.

16. నారాయణరెడ్డి, సి. ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు ప్రయోగములు పు. 336.

17. నారాయణరెడ్డి, సి. ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు-ప్రయోగములు, పు, 178.

18 స్ఫూర్తిశ్రీ - స్ఫూర్తిశ్రీ వ్యాసావళి, రెండవభాగము, పుటలు. 20, 21.

19. వేంకటహనుమంతరావు, పిల్లలమర్రి-భారతి. జనవరి 1946, పు. 5.

20. శేషేంద్రశర్మ. గుంటూరు - కవిసేన మేనిఫెస్టో. పు, 141.

21. రామకోటిశాస్త్రి. కేతవరపు, 111 ఎ.పి. ఓరియంటల్ కాన్ఫరెన్స్, తిరుపతిలో జరిపిన చర్చలో (14 జూన్, 1981).

22. శేషేంద్రశర్మ. గుంటూరు - రక్తరేఖ. పు. 11

23. రామకోటిశాస్త్రి కేతవరపు, భావికవిత్వవిచారము, విమర్శని, జనవరి1976, పు. 85.

24. శేషేంద్రశర్మ. గుంటూరు. కవిసేన మేనిఫెస్టో పుటలు. 112-151.

25. ఛండీదాస్. వద్దెర. లో జరిపిన చర్చలో (10 ఏప్రిల్. 1982)

26. సోమసుందర్, ఆవంత్స కృష్ణశాస్త్రి కవితాత్మ, పు. 74.

27. రామకోటిశాస్త్రి, కేతవరపు, భావకవిత్వ విచారము, విమర్శిని. జనవరి 1976, పు. 87.

28. తిలక్, దేవరకొండ, బాలగంగాధర, అమృతం కురిసిన రాత్రి (వచన కవితా సంపుటి) పుటలు, 83, 84.

# 3. ప్రాచీన కవిత్వం — ఆత్మాశ్రయత్వం

ప్రాచీన తెలుగు కవిత్వం అధికంగా వస్త్వాశ్రయ రీతిలో సాగిన కవిత్వమే అని చెప్పవచ్చు. ఆధునిక తెలుగు కవిత్వంలో మాత్రం ఆత్మాశ్రయ కవితా రీతులు అధికంగా కనిపిస్తాయి.

తెలుగు కవిత్వానికి మూలపురుషుడైన నన్నయ భారత రచన బృహత్ప్రణాళికా బద్ధ వస్తు ప్రాధాన్యమైన రచన. నన్నయ కంటె పూర్వం ప్రచారంలో వుండిన పదసాహిత్యం కూడా వస్తు ప్రాధాన్యత కల్గిందిగానే వుండి వుండవచ్చు. జానపద సాహిత్యం కూడా దాదాపు వస్తు ప్రాధాన్యతనే కలిగివుంది.

నన్నయ దగ్గర నుంచి నేటివరకూ వున్న కవిత్వాన్ని ప్రక్రియాపరంగా వర్గీకరించి అందులోని వస్త్వాశ్రయ ఆత్మాశ్రయ రీతుల్ని వింగడించి చూపడానికి ఇక్కడ ప్రయత్నిస్తాను.

తెలుగు కవిత్వాన్ని పురాణకవిత్వం, ప్రబంధకవిత్వం, పదకవిత్వం, శతక కవిత్వం, అవధాన కవిత్వం, ఆశుకవిత్వం, చాటుకవిత్వం, తిట్టుకవిత్వం అని విభజించుకోవచ్చు వాటిలో పురాణ కవిత్వం, ప్రబంధకవిత్వం, అవధాన కవిత్వం, ఆశుకవిత్వం, తిట్టు కవిత్వాలు పూర్తిగా వస్త్వాధిక్యతనే కలిగి వున్నాయి. పద కవిత్వం, శతక కవిత్వం, చాటుకవిత్వాలు కొంత ఆత్మాశ్రయత్వాన్ని మరికొంత వస్త్వాశ్రయత్వాన్ని పెనవేసుకొని వున్నవని చెప్పవచ్చు. తెలుగులో ఈ కవితా ప్రక్రియల స్వరూపస్వభావాల్ని రేఖా మాత్రంగా పరికిస్తూ అందులోని వస్త్వాశ్రయ, ఆత్మాశ్రయ రీతుల్ని పరిశీలిద్దాం.

**పురాణ కవిత్వం :** అష్టాదశ పురాణాల్లో చెప్పబడిన ఏ ఒక్క పురాణకథనైనా ఇతివృత్తంగా తీసుకొని చేసిన రచన పురాణమని వ్యవహరించటం జరుగుతూ వుంది. ఆ కవిత్వమే పురాణ కవిత్వమని పిలువబడుతూంది. తెలుగులో పురాణాలు చాలా వెలిశాయి. మారన మార్కండేయ పురాణం, శ్రీనాథుని కాశీఖండం, భీమఖండం మడికి సింగన పద్మపురాణం, హరిభట్టు మత్స్య, కూర్మ, నారసింహ పురాణాలు, వందిమల్లయ ఘంటసింగనల వరాహపురాణం, పింగళిసూరన గరుడ పురాణం మొదలైన పురాణాలు తెలుగులో ప్రసిద్ధి పొందాయి.

పురాణాల్లో కల్పనా మధురాలైన విచిత్ర కథలు, గాథలు, చరిత్రలు, ఉపాఖ్యానాలు తామర తంపరలుగా కనిపిస్తాయి.[1] అందువల్ల పురాణాలు ఆత్మాశ్రయాలు కావడానికి అవకాశంలేదు. వస్తు నిర్ణయం రచనకు పూర్వమే జరిగి వుంటుంది. ఆ వస్తువుకూడా పురాణాంతర్గతం. కాబట్టి మూలాను సరణంగానో లేక కొంతస్వతంత్రతతోనో పురాణాల్లో ఇతి వృత్తం నిర్వహింపబడి వుంటుంది. కవికి అంతగా స్వేచ్ఛ వుండదు. స్వానుభవమైన అంశాల్ని కావ్యగతం చేయటానికి వీలుండదు. ఒకవేళ స్వానుభవమైన అంశాల్ని కావ్యగతం చేయటానికి వీలున్నా ఔచిత్య పరిమితుల్లోనే ఇతి వృత్త నిర్వహణకు భంగం కలుగకుండా చేయాల్సి వుంటుంది. కాబట్టి వస్తు ప్రాధాన్యతని, మూల విధేయతని పాటించి రచింపబడిన పురాణాల్లో ఆత్మాశ్రయత్వం ఏ కొద్దిగానైనా కనిపించే అవకాశం లేక పోయింది.

ఇతి హాసాలు కూడా పురాణాల వంటివే. అందువల్ల భారత, భాగవత, రామాయణాల్లో కూడా బృహత్ప్రణాళికా బద్ధమైన వస్తు ప్రాధాన్యమే ద్యోతకమౌతూంది. పురాణాల్లోలాగే ఇతిహాసాల్లోనూ ఆత్మాశ్రయ ప్రసక్తే కనిపించదు. అంతేకాక ఇవి తెలుగులోనికి అనువదింపబడిన సంస్కృత రచనలు. కొంత స్వతంత్రించి నన్నయాదులు ఇతి వృత్త నిర్వహణలో, భావంలో కొన్నిమార్పులు చేశారే కాని ఏట్టి ఆత్మీయ విషయాల్ని ప్రతిపాదిస్తూ మార్పులు చేయలేదు. కాబట్టి ఇవీ మూల విధేయతని, వస్తునిర్వహణని ప్రధానంగా స్వీకరించిన వస్త్వాశ్రయ రచనలే అయ్యాయి.

కానీ పోతన భాగవత విషయంలో ఆత్మాశ్రయత్వాన్ని గూర్చి కొన్ని అభిప్రాయ భేదాలున్నాయి. కొందరు భాగవతంలో పోతన ఆత్మీయత ప్రతిబింబిస్తూ వుందని కొన్ని ఘట్టాల్ని ఉదహరించారు. భాగవతంలో గోపికాగీతల్లోనూ, భ్రమర గీతల్లోనూ పోతన వ్యక్తిత్వం కనిపిస్తుందని పేర్కొన్నారు. ఈ సన్నివేశాలు భాగవతంలో కొంత ఆత్మాశ్రయతాన్ని కలిగి వున్నట్లనిపించినా అవి పోతన భావాలుగా చెప్పబడలేదు. శ్రీ కృష్ణునిపై వున్న అనురాగం పోతనదికాదు. అది గోపికలది. పూర్వ జన్మలో తాము వ్యక్తం చేసిన అనురాగ కారణంగా తరువాతి జన్మలో గోపికలుగా జన్మించిన ఋషుల ప్రణయ ఉద్విగ్నతే పోతన కంటం నుంచి జాల్వారింది. అందువల్ల గోపికా గీతల్లోనూ, భ్రమర గీతల్లోనూ పోతన వక్తిత్వం ప్రతిబింబించ లేదు. కాబట్టి భాగవతంలోని గోపికా గీతల్లోనూ, భ్రమర గీతల్లోనూ కొంత ఆత్మాశ్రయత్వం ఉందన్న భావం సరియైంది కాదు.[2]

ప్రబంధ కవిత్వం : తెలుగులో ప్రబంధాలు కూడా పురాణాల్లాగే వస్తు సంభరి తాలు. పురాణ ప్రసిద్ధం అయిన కథో, కథా భాగమో, చారిత్రక యితి వృత్తమో, కల్పనా మధురమైన ఇతి వృత్తమో ప్రబంధ నిర్మాణానికి ఆధారం. అందువల్ల ప్రబంధాల్లో కూడా వస్తువు ఉనికే కనిపిస్తుంది కానీ ఆత్మాశ్రయత్వం కనిపించదు.

స్వీకరింపబడిన వస్తువు పురాణాల్లోకంటే చిన్నదే అయినా వర్ణనా బాహుళ్యం, అలంకార వైచిత్రి, సన్నివేశ కల్పన, రస పోషణ, పాత్ర పోషణ, మొదలైన అంశాలు ప్రబంధాల్లో ప్రాధాన్యం వహిస్తాయి. పురాణాలు వస్తు భరితమై ఆత్మాశ్రయత కొరవడినట్లే ప్రబంధాలు కూడా వస్తు విషయంలోనే గాక మిగిలిన అంశాల విషయంలోనూ వస్త్వాశ్రయంగానే కొనసాగాయి. ప్రబంధాల్లో కూడా పురాణాల్లోలాగే కవికి ఆత్మాశ్రయ ధోరణిని కొన సాగించడానికి అవకాశం చాలా తక్కువ. ప్రాబంధిక అంశాల నిర్వహణకే ప్రబంధ కవి ఎక్కువ ప్రాధాన్యం ఇస్తాడు. వ్యక్తిగత భావ ప్రకటనకు వీలుండదు. ఒక వేళ కవి అలాంటి ప్రయత్నం చేసినా పాత్రల ముఖంగానే తన భావాల్ని చెప్పాల్సి వస్తుంది.

తెలుగులో మనుచరిత్ర, వసుచరిత్ర, పారిజాతాపహరణం, ఆముక్తమాల్యద, పాండురంగ మహాత్మ్యం వంటి ప్రబంధాలు వస్తు ప్రాధాన్యంగానే అష్టాదశ వర్ణనలతో, అలంకార పరిపోషణతో, పాత్రచిత్రణతో, రసనిర్వహణతో వెలిశాయి. ఒక్కొక్క ప్రబంధంలో వస్తు సంవిధానం ఐదారు ఆశ్వాసాల్లోకి విస్తరింపబడింది. ప్రబంధ రచన ప్రకృష్టమైన బంధంతో సాగింది కాబట్టి ప్రణాళికా బద్ధమైన వస్తు నిర్వహణమే ఇందులోనూ దర్శనమిస్తుంది. అందువల్ల ప్రబంధాలు కూడా వస్త్వాశ్రయంగానే వెలిశాయి. ఆత్మాశ్రయత్వం ప్రబంధాల్లో అంతగా కన్పించదు.

పద కవిత్వం : పద కవిత్వం తెలుగు సాహిత్యంలో ఒక ప్రత్యేక శాఖగా పేర్కొనబడింది. ఇందులో శృంగారం, భక్తి, వైరాగ్యం మొదలైన అంశాలతోపాటు తాత్త్విక చింతన ఇతివృత్తాలుగా నిర్వహింపబడ్డాయి. ఇవన్నీ పదరూపంలోవుండి, రాగతాళ యుక్తంగా పాడుకో వీలయ్యేవిగా వుంటాయి. శృంగారం, భక్తి, వైరాగ్యం, తాత్త్విక చింతన మొదలైన అంశాలు ఇతివృత్తాలుగా నిర్వహింపబడ్డా వాటి ప్రసక్తి కొద్దిగా మాత్రమే వుంది ఆయా అంశాలకు సంబంధించిన పదకర్త మనోగత భావాలు ఇందులో ప్రకటితమై వుండటంవల్ల పద కవిత్వంలో ఆత్మా

శ్రయత్వమే చోటుచేసుకొంది. పదకర్త భగవంతునిపై తనకున్న ప్రేమభావాన్ని కానీ, ప్రణయ భావాన్నికానీ భక్తిభావాన్నిగానీ తనపరంగానే భగవంతునికి నివే దించుకొంటాడు. అందువల్ల పద కవిత్వం ఆత్మాశ్రయంగానే సాగిందని చెప్ప వచ్చు.

పద కవిత్వంలో ప్రసిద్ధిపొందిన అన్నమయ్య, క్షేత్రయ్యలు ఆత్మాశ్రయ రీతిలోనే శృంగార, వైరాగ్య ప్రతిపాదనలు కావించారు. వేంకటేశ్వరుని వర ప్రసాదంతో జన్మించి జీవితమంతా ఆ వెంకటేశ్వరుని సేవలోనే గడిపిన అన్న మయ్య సంగీత సాహిత్యాల్ని ఆస్వామికే అంకితం కావించాడు. అన్నమయ్యకు వెంకటేశ్వరుడు ఆరాధ్యదైవమైనా అరమరలు లేని నెచ్చెలికాడుగా కూడా ధ్వనించి నట్లు అన్నమయ్య ఆధ్యాత్మిక, శృంగార సంకీర్తనల ద్వారా తెలుస్తూ వుంది. అన్నమయ్య సంకీర్తనల్లో-

'నా పాలిటి ఘన నిధానమవు నీవే నన్ను
నీపాల నిండుకొంటి నీవే నీవే
ఒలిసి నన్నేలేదే వుఁడవు నీవే, యెందుఁ
దొలఁగని నిజ బంధుడవు నీవే
పలు సుఖమిచ్చే సంపదవు నీవే, యిట్టె
వెలయ నన్నియును నీవే నీవే'[3]

అనటంలో పరమాత్మనే సర్వస్వంగా భావించి ఉపాసించే తత్వం ప్రతిపాదింప బడింది. ఇక్కడ అన్నమయ్య ఆత్మలో ప్రతిబింబించే పరమాత్మ స్వరూపం తనకు సమస్తం అనే తత్వం అన్నమయ్య వ్యక్తిగత భావమై ఆత్మాశ్రయతని కలిగివుంది. ఇలాగే భగవంతుణ్ణి శృంగార పురుషుడుగా భావించి తనను నెచ్చెలిగా భావించుకొన్న సందర్భాల్లో కూడా ఆత్మాశ్రయత్వమే ధ్వనిస్తుంది.

'యింత వలపించు కొంటి విదివో నన్ను
యెంతకెంత నాయాసోదేమి చెప్పేనయ్యా
కన్నులఁజూతు నిన్ను కరఁగుదు మనసులో
సన్నలనే నీ మోవి చవి గొందును'[4]

అని అనడంలో భగవంతునిపైని భక్త్యావేశంతో మధురభక్తితత్వాన్ని వెల్లడి చేయ డం వ్యక్తిగతమైన అభిప్రాయం. ఇక్కడ జీవాత్మ పరమాత్మల మధ్య స్త్రీ పురు

షుల సంబంధం భావింపబడి శృంగార భావం ప్రకటితమై ఆత్మాశ్రయత్వాన్ని కలిగివుంది.

ఇలాగే క్షేత్రయ్య పదకవితల్లోనూ ఆత్మాశ్రయ ధోరణి ద్యోతకమౌతుంది. క్షేత్రయ్య మధురభక్తి రస సముద్రంలో ఓలలాడినవాడు. అందువల్లే ఆయన పద కవిత్వంలో ఆత్మాశ్రయత్వంతో కూడుకొన్న మధుర భక్తితత్వం విస్తృతరూపం దాల్చింది. భగవంతుని శక్తిని శృంగారంగా భావించిన వారు భగవంతుని పురుషుడుగానూ, తమని స్త్రీలుగానూ భావించుకొంటారు. క్షేత్రయ్య గోపాలునిపై భక్త్యాధిక్యం చేత తన్నుతాను స్త్రీగా సంభావించుకొన్నాడు. భగవంతునిపై మరులుగొన్నాడు. తనకూ మువ్వ. గోపాలునికి మధ్య జరిగిన ప్రణయ భావాలను ఆత్మీయతా ముద్రతో క్షేత్రయ్య వెలిబుచ్చాడు. క్షేత్రయ్య పదకవిత్వంలో ప్రేయసియైన తాను ప్రియుడైన భగవంతునిలో ఐక్యం కావాటానికి పడిన తాపత్రయం వ్యక్తం చేయబడింది.

"అంత రంగమైన నీనె నన్నాదరించిన నివే
చింతించి చూడ నా జీవ స్వామివి నీవే"5

అని అనడం భావ కవిలాగా సర్వమూ నీవే అని పరమాత్మ స్వరూపాన్ని ప్రేమ భావంతో ఉపాసించి తరించటం ఆత్మాశ్రయ పద్ధతిని ఆశ్రయించిందిగా వుంది.

త్యాగయ్య కూడా ఈ విధంగా ఆత్మాశ్రయ ధోరణిలో కృతులు రచించి పాడి తరించిన మధుర భక్తుడుగా ప్రసిద్ధిపొందాడు. సారంగపాణి పదములుకూడా ఈ కోవకు చెందిన రచనలే. త్యాగరాజు కృతుల్లో శృంగార భావం కాక భక్తి తత్వమే ప్రదర్శింపబడింది. త్యాగరాజు ఉపనిషత్తుల్లో ప్రతిపాదితమైన బ్రహ్మ స్వరూపాన్ని నాద బ్రహ్మగా ఉపాసించి తరించాడు. త్యాగరాజ కీర్తనల్లో భక్తుడుగా త్యాగరాజు అనుభవించిన ఆనంద పారవశ్యం, మనోవేదన, పశ్చాత్తాపం, మొదలైన భావాలు ప్రదర్శితాలయ్యాయి. భగవంతుని ఎడబాటును క్షణమైనా ఓర్చుకోలేని భక్తుడుగా త్యాగరాజు -

"నీవాడనే గాన నిఖిలలోక నిధాన
నిముష మోర్వగ గలనా...." అంటూ
"నీవే నన్నెడఁ జేసితే. నేనెవరితో దెలుపుదునయ్యా ॥నీ॥

భావ భావ మహానుభావ శ్రీరామచంద్ర
భావ జనక నా భావముఁ దేనియు
కోరిన కోరికలీడేరు ననుచునిన్ను
ఆరాధించిన నన్ను అరటి బెట్టుట
మేరగాదు నాదు నేర మేమి న
న్నేలు కోర యీలోకమున నింక"6

అని ఇహ లోకంలో జీవించే త్యాగరాజు పరలోక వాసియైన శ్రీరామచంద్రునికి తన భావాల్ని నివేదించుకొన్నాడు. ఇహలోకంలో ఎవరైనా తన్ను వేరుచేస్తే భగవంతునితో చెప్పుకోవచ్చు. ఆ భగవంతుడే భక్తుని వేరు చేస్తే ఇక ఎవరు దిక్కంటూ సర్వమూ తానేయైన శ్రీరామచంద్రునికి తన్నుతాను సమర్పించుకొంటూ ఏలుకోవాలని ఆత్మాశ్రయ ధోరణిలో త్యాగయ్య భక్తిభావాలను ప్రదర్శించాడు.

సారంగపాణి కూడా క్షేత్రయ్యలాగే వేణుగోపాలుని వలపుకు నోచుకొన్న భక్తుడు. భగవంతుడూ తానూ ఒకర్నొకరు చూసుకొన్న వేళా విశేష మేమోగాని వారి అనురాగం ఎడబాయని దైందంటూ చిన్ననాటి జ్ఞాపకాలను స్మృతికి తెచ్చుకొని సంతోష పూరిత హృదయంతో సారంగపాణి భగవంతునిపై భక్తిభావాన్ని గాక శృంగార భావాన్ని ప్రకటిస్తూ -

"పల్లవి : నేను నీవు కనుగొన్న వేళేముగ
నేస్తము బాయదుగా మరి మరి
నెమ్మది గలిగెనుగా

అను : మేను నీ సొమ్మనియానలిడుకొని
మెచ్చితి యీడన వేణు గోపాలుడని ॥నేను॥
చిన్నవాడు పండు వెన్నెలలో యిసుక
దిన్నెలపై సుర పొన్నల పొన్నున
పన్నీరు జల్లుక పవళించె లాహిరై
యెన్నెన్నో విధముల యెదనెద నదుముక"7 ॥నేను॥

అని అంటూ చిన్ననాడు పండు వెన్నెల్లో ఇసుక తిన్నెలపై తానూ భగవంతుడూ ప్రణయ మాధుర్యంలో తేలిపోతూ ఎన్నెన్నో సుఖాల్ని అనుభవించినట్లు భావించు

కొంటున్నాడు. ఇక్కడ సారంగపాణి అనుభూతి తత్వంతో కూడుకొన్న భావాన్ని ఆత్మాశ్రియత్వంలో వెల్లడి చేశాడు.

ఇలా పద కవిత్వంలో ఆత్మాశ్రియ కవితా రీతి అధికంగా కనిపిస్తూవుంది. అయినా పద కవిత్వం అంతా ఆత్మాశ్రయ ధోరణిలో కొనసాగిందని చెప్పడానికి వీలులేదు. పద కవిత్వంలో ఎక్కువ భాగం భగవంతునిపై భక్తునికున్న భక్తి భావాన్ని, శృంగార భావాన్ని ఆలంబనగా తీసుకొని ప్రకటించడంలో ఆత్మాశ్రయత్వమే నిండివున్నా అక్కడక్కడా వస్త్వాశ్రియ రీతి కూడా వుంది.

భగవంతుని స్వరూపాన్ని వ్యక్తం చేసేటప్పుడు భక్తుడు ఆ భగవంతుని రూపు రేఖా విలాసాలను వర్ణించటం పరిపాటిగా వుంటుంది. ఇటువంటి సందర్భాల్లో భగవంతునికీ భక్తునికి మధ్య వున్న భక్తి, అనురాగం కాక ఆయన ధరించిన ఆభరణాల్ని, ఆయన వస్త్ర వాహనాల్ని వర్ణించే తీరు ఆత్మాశ్రియతని కాక వస్త్వాశ్రయితని కలిగిందిగా కొనసాగింది. అంతేకాక భగవంతునితో సంబంధ వున్న కథలను గానం చేయడంలోనూ, అతని మహిమల్ని గూర్చి కొనియాడే సందర్భాల్లో చెప్పబడిన ఇతిహ్యాల్లోనూ, భగవల్లీలలు వర్ణించే సందర్భాల్లోను, భగవంతుని అవతారకథల్ని చెప్పేప్పుడూ వస్త్వాధిక్యమే అధికంగా వుండి ఆత్మాశ్రయత్వాన్ని ప్రదర్శించేదిగా పద కవిత్వం లేదు.

కేవలం భగవల్లీలలను, అవతార కథలను, వస్తువాహనాలను గూర్చి చెప్పేటప్పుడే గాక శృంగార సంబంధ విషయాల్ని చెప్పేటప్పుడు కూడా పద కవిత్వంలో వస్త్వాశ్రయతే వుంది. తన ప్రియుడు, ఆరాధ్యదైవం అయిన భగవంతుడు తనతో కాలం గడడానికి రాకుండా ఆలస్యం చేస్తున్నప్పుడు ఆయనకున్న ప్రియురాండ్ర విషయం, వారి కౌగిట్లో ఆయన పొందుతూ వుండే ఆనందాన్ని గూర్చి భగవంతునిపై అక్కసు వెళ్ళగక్కుతూ చెప్పబడింది. ఇటువంటి సందర్భంలో కూడా ఆత్మాశ్రియరీతి కంటే భిన్నమైన కవిత్వ పోకడల్ని పదకర్త ప్రదర్శించడం వల్ల వస్త్వాశ్రియత్వమే కనిపిస్తుంది.

తెలుగు శతక కవిత్వంలో లాగానే పద కవిత్వంలో కూడా కొన్ని సందర్భాల్లో ఆత్మాశ్రయ రీతిని బలీయంగానూ, మరి కొన్ని సందర్భాల్లో వస్త్వాశ్రయ రీతిని ఎక్కువగానూ, అనుసరించినట్లు తెలుస్తుంది.

శతక కవిత్వం : తెలుగులో శతక కవిత్వం ఒక ప్రత్యేకతని సంతరించుకొంది. శివకవుల కాలం నుంచీ శతక రచన తన ప్రాభవాన్ని ప్రకటించుకొంది. శతకాలు సర్వ సాధారణంగా దైవ పరంగా వెలిశాయి. భగవంతునిపై భక్తునికుండే భక్తి భావాన్ని ప్రదర్శించడం కోసం శతకాలు వెలిశాయి. భక్తి పూరితమైన శతకాలే కాక తెలుగులో శృంగార శతకాలు, తత్వ, వేదాంత శతకాలు, నీతి శతకాలు, వ్యాజస్తుతి శతకాలు కూడా వచ్చాయి.

శతకాలు కవి యొక్క ఆత్మ భావాల్ని ప్రకటించేవిగా కనిపిస్తున్నాయి. దోషాల్ని, మన్నించిఆపదల్ని నివారించి తనను రక్షించమంటూ కవి భగవంతుని ప్రార్థించటం కోసం ముఖ్యంగా శతకాలు వెలిశాయి. అంతేకాక కవి ఆత్మ పరిశీలన కావించుకొని గత జీవితంలో దోషాల్ని స్మృతికి తెచ్చుకొంటూ పశ్చాత్తప్త హృదయంతో భగవంతునిపై భక్తి భావాన్ని ప్రకటించేందుకు కూడా శతకాలు ఉపకరించాయి భగవంతునిలో తనకు నచ్చిన, తనకు ఆకర్షించిన దైవ గుణాల్ని, మహిమానుభావాల్ని కవి శతక రచనల్లో పేర్కొంటాడు. అందువల్ల శతక కవిత్వంలో కవి యొక్క స్వీయ భావాలు ప్రకటింపబడి ఆత్మాశ్రియత్వాన్ని కలిగి వుండేవిగా అగుపిస్తాయి.

శతకాల్లో శృగార, తత్వ, వేదాంత- నీతి, వ్యాజస్తుతి శతకాలంటే భక్తి శతకాల్లో ఆత్మాశ్రయ తత్వం అధికంగా పాదులు దన్నుకొనట్లనిపిస్తుంది. ఆత్మాశ్రియ లక్షణం శతకాల్లో కవి వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించేవిగా వుండి శతక లక్షణాల్లో ఒకటైంది. 'తెలుగు శతకాల్లో ప్రధానంగా పాటింపబడే లక్షణాల్లో ఆత్మాశ్రియ కవితా ధర్మం ఒకటి'8 అన్న కె. గోపాలకృష్ణారావు మాటలూ, 'సాహిత్య పరంగా శతకాలు విషయ ప్రధానాలు కావు. ఆత్మ భావ ప్రధానాలు అందుకే ఈ పద్యాల మాటున కవి హృదయం స్పందిస్తూ వుంటుంది'9 అన్న యండమూరి సత్యనారాయణ గారి వాక్యాలు ఈ సందర్భంలో గుర్తించ దగ్గవి.

భక్తి శతకాల సంఖ్య తెలుగులో అధికం కావటం వల్ల భక్తి ప్రదానమైన శతకాల్లో ప్రతిబింబించే ఆత్మాశ్రియ లక్షణం శతక లక్షణంగా భావింపబడింది. కాని వివిధ కథాత్మక, వర్ణనాత్మక, శాస్త్రాత్మక శతకాల్లో ఈ నియమం కనిపించదు కాని కొన్ని నీతి శతకాల్లో ఈ ఆత్మాశ్రియత్వం కనిపిస్తుంది, కాబట్టి శతకాలన్నీ ఆత్మాశ్రయ ధోరణినే కలిగి లేవని, కొన్ని ఆత్మాశ్రయ ధోరణిలోనూ మరికొన్ని వస్త్వాశ్రియ ధోరణిలోనూ కొనసాగాయని చెప్పవచ్చు.

'నీరూపంబు దలంపఁగా దుదమొదల్నేఁ గాన నీవైన చో
రారమ్మని యంచుఁజెప్పవు వృథా రంభంబులింకేటికిన్
నీరన్మంపుము పాల ముంపుమిక విన్నే నమ్మినాఁ డంజుమీ
శ్రీ రామార్చిత పాద పద్మ యుగళా శ్రీ కాళహస్తీశ్వరా' 10

అని శతక కవి వాపోవడం దాదాపు భావకవి బాధా తీవ్రతతో భగవంతుని వేడు కొన్నట్లేవుంది. భగవంతుని ఆద్యంతాలు తెలుకోలేనని కవిభావన చేస్తూ భగవంతు డైన పిలవటం లేదంటూ ఆయన పాదపద్మాలను ఆశ్రయిస్తున్నా నంటున్నాడు. నీట ముంచిన పాల ముంచిన నీవే దిక్కు అని చెప్పటంలో ఆత్మాశ్రయతే కన్పి స్తుంది. ఐహిక జీవితం పై ప్రీతి తగ్గడంతో భక్తి తత్వంతో భగవంతుణ్ణే సర్వస్వంగా భావించి ఆత్మార్పణ గావించుకోవటం ఇక్కడ కన్పిస్తుంది. ఇలాగే భగవత్ చింతనతో అంతర్ముఖులైన శతక కవులు తమ మనోగత భావాల్ని వెర్రిగా ప్రకటిస్తూ విలపించారు.

'కరుణగల దొరవు నీవని
నిరతము నిను నెమ్మనమున నెర నమ్మితినో
పరతత్వ రూప నిరుపమ
నరరత్న కిరీట హార వక్ష కృష్ణా' 11

అని దూపాటి వెంకట రత్నమాచార్యులు అన్నా,-

సర్వేశ నీపాద సరసిజ ద్వయమందు
చిత్త ముంచగ లేను చెదరకుండ
నీవైన దయ యుంచి నిలిచి యుండెడు నట్లు
చేసి నన్నిపుడేలు సేవకుఁడను
వనజ లోచన నేను పట్టి మూర్ఖుడ సుమ్మి
నీ స్వరూపముఁ జూడ నేర్పు వేగ
తన కుమారునకుగ్గు దల్లి పోసిన యట్లు
భక్తి మార్గంబను పాలు బోసి
ప్రేమతో నన్నుఁబోషించి పెంచు కొనుము
ఘనత కెక్కించు నీదాస గణములోన
భూషణ వికాస శ్రీ ధర్మ పురి నివాస

దుష్ట సంహార నరసింహ దురితదూర'[12]

అని శేషప్ప కవి అన్నా ఆత్మాశ్రయ ధోరణి ప్రాధాన్యం వహిస్తుంది.

కానీ శతక కవిత్వంలో శృంగార, నీతి, తత్వ, వేదాంత శతకాల్లో వస్త్వాశ్రయపద్ధతి వున్నట్లు; భక్తి శతకాల్లోనూ ఆధోరణే కొంతవరకు పాటింపబడింది. భక్తి శతకాల్లో భగవంతునిపై శతక కర్తకున్న భక్తితత్వంతోపాటు, తన బాధల్ని, తన కష్టాల్ని భగవంతునికి నివేదించుకొంటూ ఈ జీవితం నుంచి తనను విముక్తుణ్ణి చెయ్యమని ప్రాదేయపడటంతో ఆత్మాశ్రయత్వమే ప్రబలింది. కానీ తాను ఆరాధించే దేవుని వైభవాన్ని ప్రకటించటంతో ప్రబంధ వర్ణనలలోలాగా వస్త్వాశ్రయమూ దర్శనమిస్తుంది. తనకు ఆరాధ్య దైవమైన భగవంతుని స్వభావము. ఆయన శౌర్యపరాక్రమ గుణాలు, ఆయన దివ్యతేజస్సు, ఆయన ధరించిన ఆభరణాలు, ఆయన వినియోగించే వస్తు వాహనాది విషయ ప్రస్తావన అంతా పదకవిత్వంలో లాగే వస్త్వాశ్రయ ధోరణిలోనే కొనసాగింది, అంతేకాక దేశచరిత్రని, చారిత్రక రాజకీయ సంఘటనల్ని ఇతివృత్తాలుగా గ్రహించి రచించిన శతకాలు, కథాత్మక శతకాలు (పురాణేతిహాస కథాత్మకాలు. జీవిత కథాత్మకాలు) వివిధ కథాత్మకాలు వస్త్వాశ్రయ పద్ధతిలోనే వెల్లివిరిశాయి.

వీటిలో జీవిత కథాత్మక (ఆత్మ కథ శతకాలు) శతాకాల్లో కవే స్వయంగా తన జీవితాన్ని గూర్చి చెప్పుకొన్నా అందులో కవి ఆత్మీయత కంటే కవి జీవిత విషయాలకే అధిక ప్రాధాన్యం వుంటుంది. అంటే కవి పుట్టుక, కవి పూర్వీకుల వివరాలు, కవి జీవితంలోని సంఘటనలు, ఇతర వ్యక్తులు - వారి సంఘటనలు పేర్కొనబడి వస్తు ప్రాధాన్యతని కలిగి వుంటాయి. కాబట్టి శతక రచనకూడా కొంత వస్త్వాశ్రియంగానూ మరికొంత ఆత్మాశ్రియంగాను జరిగిందని చెప్పవచ్చు.

అవధాన కవిత్వం : తెలుగులో ఈ శాఖను పరిపుష్టం చేసింది తిరుపతి వేంకట కవులు[1] దక్షిణాంధ్ర యుగ కవుల్లోనూ, ప్రాచీన కవుల్లోనూ అవధాన విద్య, చతుర్విధ కవిత్వంతోపాటు ప్రచారంలో ఉన్నప్పటికి తెలుగుదేశం నలుమూలలకు విస్తరించింది ఆధునిక యుగ ప్రారంభలోనే, అందునా తిరుపతి వేంకటకవులతోనే. వీరు పండిత సభలకు, రాజాస్థానాలకు మాత్రమే పరిమితమైన కవిత్వాన్ని అవధానాలద్వారా ప్రజల మధ్యకు తీసుకొచ్చారు, తద్వారా కవిత్వం ఒక ఉద్యమంగా అవధానాలద్వారా తెలుగుదేశంలో విస్తరించింది.

అవధాన కవిత్వం ఎనిమిదిమంది పృచ్ఛకుల పరీక్షకు చెప్పే సమాధానాలపై ఆధారపడిన ప్రక్రియ. ఈ అవధాన కవిత్వంలో అవధాని పృచ్ఛకులడిగే సమస్యలకు పద్యాలల్లి వారు పెట్టే చిక్కు సమస్యలనుండి బయట పడాలి. అవధానాలలో అష్టావధానం శతావధానం అనేవి ప్రచారంలో వున్నాయి.

అవధాన కవిత్వం అంతా పృచ్ఛకులిచ్చే అంశాలపైన ఆధారపడిన కవితా ప్రక్రియ కావటంవల్ల పృచ్ఛకుల సమస్యలే ఇతివృత్తాలుగా నిర్వహింపబడతాయి. అవధాన కవి చెప్పవలసిన అంశం కవికి ముందే నిర్దేశింపబడుతుంది. అవధాన కవికి ఒక సంఘటనో, ఒక సమస్యో కవితావస్తు వవుతుంది. తాను చెప్పదలచు కొన్న భావాలను పృచ్ఛకుల ప్రశ్నలకు పరిమితం చేసుకొని ఆశువుగా పద్యం చెప్పటం జరుగుతుంది. కాబట్టి ఇక్కడకూడా పురాణాల్లోలాగా, ప్రబంధాల్లోలాగ వస్తు నిర్దేశం రచనకు పూర్వమే జరుగుతుంది. కానీ ఆ వస్తువు అల్పమైంది.

అవధాన కవిత్వంలో ఇవ్వబడే వస్తువు అల్పమైందే అయినా ఆ వస్తువుకు సంబంధించిన విషయాలే చెప్పబడతాయి. కాబట్టి అవధాన కవిత్వంలో కవి అభిరుచీ, ఆత్మీయతా చోటుచేసుకోవు. అవధాన కవిత్వం కవి పాండితీ ప్రకర్షలను ప్రదర్శించేదిగా వుంటుంది. ఈ అంశం కూడా వస్త్వాశ్రయతనే సూచిస్తుంది. కవి భావనకి కానీ కవి ఆత్మీయ విషయాలకి కానీ అవధాన కవిత్వంలో చోటులేక పోవడంవల్ల, అవధాన కవిత్వంలో స్వల్పమైన ఇతివృత్తం ఇతరులచే సూచింపబడి కవిచే నిర్వహింప బడటంవల్ల వస్త్వాశ్రయతని కలిగిన కవిత్వంగానే అవధాన కవిత్వం వెలువడింది. ఆత్మాశ్రయత్వానికి అవకాశం లేకపోయింది.

ఆశు కవిత్వం: తెలుగులో అవధాన కవిత్వంలో ఆశు కవిత్వం ఒక అంశమే అయినా కొన్ని సందర్భాల్లో అవధానాల్లోనే కాక కవి పండిత విద్వత్ సభల్లో ఆశువుగా కవిత్వం చెప్పబడేది. సంగీత సాహిత్యాల్లో వైదుష్యం గలిగిన రఘునాథ నాయకుడు ఒక రాత్రి ఆశువుగా పారిజాతాపహరణాన్ని చెప్పిన వుదంతం వుంది. వ్రాయసకాళ్ళు చుట్టూవుండగా వారు అతికష్టంతో వ్రాసుకొనేటట్లు రెండు యామాల్లో ఈ కథని ఆశువుగా చెప్పాడట. దీనినిబట్టి తెలుగులో కావ్యాలు కూడా ఆశువుగా చెప్పబడినట్లు కన్పిస్తుంది.

ఆశుకవి ఇతరుల కోరిక మేర వారిచ్చిన సన్నివేశాన్నో, సంఘటనల్నో దృష్టిలో వుంచుకొని ఉన్నచోట ఉన్నట్లే కవిత్వం చెప్పటాన్ని ఆశు కవిత్వంగా

వ్యవహరిస్తున్నారు. ఈ కవిత్వంలోకూడా అవధాన కవిత్వంలోలాగే కవి ఆత్మీయ విషయాలకి కాకుండా ఇతరులచేత కోరబడే పలు విధాలైన అంశాలకి, పురాణ సంఘటనలకి ప్రాముఖ్యం ఇవ్వడం జరుగుతుంది.

సామాజిక సమస్యలపైనా, పురాణ సంఘటనలపైనా, పురాణ వ్యక్తులపైనా కవి పాండిత్యం మేరకు ఆశు కవిత్వం నిర్వహించడం వల్ల ఆశు కవిత్వం కూడా తెలుగులో వస్త్వాశ్రయంగానే వెలువడింది. కవి వ్యక్తిత్వాన్ని, ఆత్మీయతని ప్రతిబింబించేవిగా కాకుండా కవి ప్రతిభని, పాండితీ ప్రకర్షల్ని ప్రతిబింబించేదిగా ఆశుకవిత్వం వుంటుంన్నందువల్ల ఆత్మాశ్రయ కవితారీతులు ఇందులో కనిపించవు.

చాటు కవిత్వం : చాటుకవిత్వం ప్రాచీనకాలంనుంచీ వ్యాప్తిలో వున్నదే. కొన్ని కొన్ని ప్రత్యేక సందర్భాల్లో రాజులపైనో, సంస్థానాలపైనో, ఒక సామ్రాజ్యం మీదనో, ఒక వ్యక్తిపైనో లేక అంశం మీదనో చెప్పిన పద్యాలే చాటువులుగా ప్రసిద్ధి పొందాయి. అటువంటి పద్యరచనే చాటు కవిత్వంగా రూపొందింది.

ఈ చాటు కవిత్వం దాదాపు ఆశు కవిత్వం లాంటిదే అయినా కవి పాండితీ ప్రకర్షల్ని ప్రకటించుకోనేదిగా కాక కవి హృదయ తీవ్రతని, ఆవేశాన్ని, ఆత్మీయతని ప్రకటించుకోవటం కోసం వెలువడినట్లు తెలుస్తూంది. అందువల్ల తెలుగులో ఆశు కవిత్వం కంటే చాటు కవిత్వం ప్రత్యేకతతో ప్రచారం పొందింది.

ఆశు కవిత్వంలో ఎవరి కోరికమేరకో ఒక అంశంపై పద్యం చెప్పడం జరుగుతుంది. చాటుకవిత్వంలో అలాకాక కవి మానసిక క్షేత్రం సంతోషానికో, సంక్షోభానికో, దుఃఖానికో గురైనప్పుడు ఆ భావాల్ని ప్రకటించటం కోసం పద్య రచన జరుగుతుంది. చాటు కవిత్వం అందువల్లే కవి హృదయపు లోతుల్నుంచి భావాల్ని ప్రకటించేదిగా వుంటుంది కాబట్టే కొంత ఆత్మాశ్రయత్వాన్ని కలిగివుంది. చాటు కవిత్వం చెప్పిన సుప్రసిద్ధ కవులు ఆత్మాశ్రయ ధోరణిని ఆశ్రయించే కొంత చాటు కవిత్వం చెప్పారు. వేములవాడ భీమకవి, శ్రీనాథుడు, పెద్దనాది కవులు కొన్ని చాటువుల్లో ఆత్మాశ్రయత్వం చోటుచేసుకొంది.

కాని మరి కొన్ని రచనల్లోనూ, మరికొందరి కవుల చాటువుల్లోనూ ఆత్మాశ్రయత్వం కంటే వస్త్వాశ్రయత్వమే మిక్కుటంగావుంది. కేవలం కవి మనోభావాలు కాక రాజుల శౌర్య పరాక్రమాలో, వ్యక్తుల ఔన్నత్యాలో, సామ్రాజ్యాల

వైభవాలో, సంస్థానాల గొప్పదనాలో కొనియాడవలసిన చాటువులు వస్త్వాశ్రయం గానే వెలిశాయి. కారణం ఆయా వ్యక్తులు. సామ్రాజ్యాలు, సంస్థానాలు ఈ చాటువుల్లో వస్తువులు గాబట్టి.

అలాకాక కవికి సన్నిహితుడైన రాజో మంత్రో మరణించగా వారి ఎడబాటుకు బాధ పడుతూన్న కవి హృదయం నుంచి వెల్లుబికి వచ్చిన చాటుపద్యాల్లో కవికి ఎడబాసిన వ్యక్తికీ మధ్య వున్న సంబంధ బాంధవ్యాలతో పాటు సన్నిహితత్వం, ఆత్మీయత వ్యక్తమై ఆ వ్యక్తి తాలూకు స్మృతి వెల్లడి అవుతుంది. ఇటువంటి సందర్భాల్లో వెలువడిన కవిత్వం ఆత్మాశ్రయత్వంగా వెలిసింది.

ప్రాచీన కవుల చాటువుల్లో శ్రీనాథుని చాటువులు, పెద్దన చాటు పద్యం ఎక్కువ ఆత్మాశ్రయతని కలిగివున్నాయి. మిగిలిన వారి చాటువులన్నీ రాజుల పొగడ్తలకు, ఇతర కవులను తిట్టేందుకు ఉపయోగించడం మూలంగా వస్త్వాశ్రయత్వాన్నే కలిగివున్నాయి. తెనాలి రామకృష్ణుడు మొదలగువారి చాటువులుకూడా వస్త్వాశ్రయంగా తిట్టు కవిత్వంలో చేరేవిగా వున్నాయి.

జీవితమంటే శృంగార మయమైందిగానూ, వైభవోపేతంగానూ గడపిన శ్రీనాథుడు చరమ దశలో చెప్పిన పద్యాలు కవి దైన్యస్థితిని తెలిపేవిగా వుంటూ ఆత్మాశ్రయత్వాన్ని కలిగివున్నాయి. ఈ విషయాన్ని కవిత్వం రీతులు అనే ప్రకరణంలో ప్రస్తావించాను. ఐనా ఇక్కడ కొంత విపులంగా చర్చిస్తాను.

శ్రీనాథుడు చరమదశలో తన లేమికి బాధపడుతూ కుటుంబభారాన్ని వహిస్తూ వ్యవసాయం ప్రారంభించాడు. అప్పుడాతనికి ఎదురు దెబ్బ తగిలింది. ఆ స్థితిలో తనను పోషించిన రాజుల్ని తలచుకొంటూ తాను పొందిన గౌరవాల్నీ, సత్కారాల్నీ, వైభవాన్నీ తలచుకొని విలపించటం ఆత్మాశ్రయత్వంతో కూడుకొని స్మృతి కవితాలక్షణాల్ని కలిగివుంది.

'కవిరాజు కంఠంబుఁగౌఁగిలించెను గదా
పురవీధి నెదురెండఁ బొగడ దండ
ఆంధ్ర నైషధకర్త యంఘ్రి యుగ్మంబునఁ
దగిలి యుండెను గదా నిగళ యుగము
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత

విఱ్ఱ్యమంచెను గదా వెదుఱు గొడియ
సార్వభౌముని భుజస్తంభ మెక్కెను గదా
నగరి వాకిట నుండు నల్ల గుండు
కృష్ణవేణమ్మ గొనిపోయె నింత ఫలము
బిల బిలాక్షులు దినిపోయెఁ దిలలు పెసలు
బొడ్డ పల్లెను గొడ్డేటి మోసపోతి
నెట్లు చెల్లింతుఁ దంకంబు లేదు సూర్లు"[13]

అన్న శ్రీనాథుని చాటువులో కవికి వాటిల్లిన దురవస్థ, దానికి కారణమూ చెప్ప బడింది. ఇక్కడ కొంత కథన పద్ధతి వున్నా శ్రీనాథుని చరమ దశలో వుండే వేదనే ఇందులో చెప్పబడింది. అందువల్ల ఆత్మ వ్యక్తీకరణ ప్రాబల్యాన్ని సంత రించుకొన్న శ్రీనాథుని చాటుపద్యాల్లో ఆత్మాశ్రియత్వమే నిర్వహింపబడివుంది. ఆ శ్రీనాథుని అవసాన దశ తెలుగు సాహితీ ప్రియులందరి గుండెల్ని కరిగించే ఏగా వుండి శ్రీనాథునిపై, అతని అవసాన దశపై ఎనలేని సానుభూతిని ప్రక టించే విధంగా ఇక్కడ చాటు కవిత్వంలో ఆత్మాశ్రయత్వం బలీయంగా వుంది.

శ్రీనాథుని తరువాత ఇంతటి ఉత్తమమైన చాటువుల్ని ఆత్మాశ్రయంగా వెలిబుచ్చిన వాడు పెద్దన. పెద్దనకూడా శ్రీనాథుని వలెనే ఆత్మాశ్రయ పద్ధతిలో స్మృతి ప్రధానమైన చాటుపద్య రచన కావించినట్లు తెలుస్తూవుంది.

ఆంధ్ర కవితా పితా మహుడని కీర్తి పొందిని పెద్దన కృష్ణరాయలు స్వర్గస్తు డైన తరువాత అతని నిర్యాణాన్ని గూర్చి ఒక శతకం రచించాడని ప్రతీతి. అందులోనిదిగానో లేక చాటువుగానో ప్రసిద్ధి పొందిన ఒక పద్యం మాత్రం ఆత్మా శ్రయ లక్షణాల్ని కలిగివుంది.

"ఎదురైనచోఁ దన మద కరీంద్రము నిల్పి
కేలూత యొసఁగి యెక్కించు కొనియె
గోకట గ్రామాద్యనేకా గ్రహారంబు
లడిగిన సీమలయందు నిచ్చె
మనుచరిత్రంబందు కొను వేళ బురమేగ

బల్లకి దనకేలఁ బట్టి యెత్తె
బిరుదైన కవి గండపెండేరమున కీవె
తగుదని తానె పాదమున దొడిగె
'ఆంధ్ర కవితా పితా మహ అల్లసాని
పెద్దన కవీంద్ర'యని నన్ను బిలుచునట్టి
కృష్ణరాయలతో దివికేగలేక
బ్రతికి యున్నాడ జీవచ్ఛవంబనగుచు'[14]

అని చెప్పటం రాయలకు పెద్దనకు మధ్య వుండే గౌరవభావాలతో పాటు సాన్ని హిత్యం, ప్రేమానురాగాలు వ్యక్తమై ఆత్మాశ్రయత్వాన్నే కలిగివుంది.

చాటు కవిత్వం ఇలా కొన్ని ప్రత్యేక సందర్భాల్లో. స్మృతి పూర్వకంగా వెలువడిన రచనల్లో ఆత్మాశ్రయత్వాన్నే కలిగివుంది.

తిట్టు కవిత్వం: తిట్టుకవిత్వం తెలుగులో కొంత ప్రాచుర్యాన్ని కలిగివుంది. కవి ఇతరుల చేత తిరస్కరింప బడినపుడో, లేక తాను ఆశించిన ప్రతిఫలం తనకు దక్కనపుడో, మానసిక సంక్షోభానికి గురై వెర్రిగా ఇతరుల్ని దూషించటంతో తిట్టు కవిత్వం ఆవిర్భవించింది. కావ్యాల్లోని కుకవినింద కూడా ఈ విభాగం క్రిందికే వస్తుంది.

తిట్టుకవిత్వం హృదయ సంబంధమైన కోపాన్ని ఆవిష్కరించేదిగా రూపు సంతరించుకొంది. కోపం హృదయ సంబంధమే అయినా తిట్టుకవిత్వం చెప్పే వ్యక్తి వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించేదే అయినా ఇది ఆత్మాశ్రయ ధోరణిని కలిగిలేదు. కారణం కవి ఇతరులపైన తనకున్న అక్కసును వెళ్ళబోసుకోడానికి అనేక రీతుల దూషణచేస్తాడు. ఆ వ్యక్తుల్ని తక్కువ చేసి మాట్లాడతాడు. ఆ తక్కువ చేయ టంలో పీచోపమల్ని స్వీకరిస్తాడు. అందువల్ల తిట్టు కవిత్వం కవి మానసిక క్షేత్రంలో పుట్టి పెరిగిందే అయినా కోప కారణంగా జనించింది కాబట్టి వస్త్వా శ్రయతని కలిగివుంది. ఈర్ష్య, ద్వేషం, కోపం ఇలాంటి భావాలు ఆత్మ గతాలే అయినా ప్రేమ, భక్తి లాంటి ఆదరణీయమైన గుణాలు కావు కాబట్టి ఆత్మీయతని, దగ్గరయ్యే తత్వాన్ని కాక ఆత్మీయతా రాహిత్యాన్ని, దూరమయ్యే తత్వాన్ని కలిగి వున్నాయి కోప కారణంగా వెలువడే తిట్టు కవిత్వం ఇతర వ్యక్తుల్ని దగ్గరకు

తీసుకొని తనవారుగా. తన వస్తువులుగా చేసుకొనే మనస్తత్వాన్ని కలిగిలేదు. వ్యక్తుల్ని, వస్తువుల్ని అసహ్యించుకొని వాటి వినాశనాన్ని కోరుకొనే మనస్తత్వం కలిగివుంది. అందువల్ల పరాశ్రయమైందిగా తిట్టు కవిత్వం వ్యాప్తిలోవుంది.

ఇంతవరకు చర్చించిన కవితా ప్రక్రియల్లో పురాణ, ప్రబంధ అవధాన, ఆశు, తిట్టు కవిత్వాలు వస్త్వాశ్రియాలుగా కన్పిస్తాయి. పద, శతక కవిత్వంలోనూ, చాటు కవిత్వంలోనూ కొంత కవి వ్యక్తిగత అంశాలకి, అభిప్రాయాలకి, బాధలకి ప్రాధాన్యముండి ఆత్మాశ్రయంగా కొనసాగాయి.

ఆత్మాశ్రయత్వాన్ని ప్రతిబింబిస్తున్న ఈ కవితా ప్రక్రియ అన్నింటితోనూ భక్తే అధికంగా ఆత్మాశ్రయంగా వెలువడింది. భగవంతునికి భక్తునికి మధ్యవున్న వ్యక్తిగత సంబంధమే ఇందుకు కారణం. ప్రాచీన కవిత్వంలో పేర్కొబడ్డ ప్రణయం అంతా కవులకు సంబంధించిన ప్రణయం కాదు. రాజులు, ప్రభువులు, పాలకుల అభిరుచుల కనుగుణంగా చెప్పటం వల్ల పరాశ్రయమైన శృంగార ఇతి వృత్తాలు ప్రాచీన కవిత్వంలో దర్శనమిస్తున్నాయి. ప్రకృతి కూడా ప్రాచీనకవుల స్వానుభవాలతో కాక ప్రాచీన సంస్కృత సంప్రదాయానుసారం స్వీకరించి కావ్యగతం చేయటం వల్ల వర్ణనా ప్రాబల్యాన్ని కలిగి వస్త్వాశ్రయంగానే కొన సాగింది.

ప్రాచీన కవితా ప్రక్రియల్లో అక్కడక్కడా రేఖామాత్రంగా వెలుగొందు తూండిన ఆత్మాశ్రయత్వం పాశ్చాత్య కవితా సంప్రదాయంలో బలీయమైందిగా రూపొంది నవ్య కవిత్వానికి ఒక విశేషతని చేకూర్చుకొంది.

ప్రాచీన కవిత్వంలో ఆత్మాశ్రయత్వాన్ని గూర్చి తెలుసుకొన్న తరువాత పాశ్చాత్య కవితా సంప్రదాయ ప్రభావాన్నీ. తత్ఫలితంగా నవ్య కవిత్వంలో పొడ చూపిన ఆత్మాశ్రయత్వ వైఖరుల్ని తెలుసు కోవాల్సిన అవసరం ఉంది. రాబోయే ప్రకరణంలో ఈ చర్చ కొనసాగిస్తాను.

# ఉదాహృత సూచికలు


1. సుబ్రహ్మణ్యం, జి.వి. ప్రథమాంధ్ర మహాపురాణము - ప్రబంధకథా మూలము, పు. 18.

2. నారాయణరెడ్డి, సి. ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు, ప్రయోగములు, పు. 168.

3. తాళ్ళపాక సాహిత్యము, ఆధ్యాత్మిక సంకీర్తనలు, సంపుటము-1. పాట. 108.

4. తాళ్ళపాక అన్నమాచార్య శృంగార సంకీర్తనలు, సంపుటము : 18, సంకీర్తన : 94.

5. క్షేత్రయ్య పదములు, గిడుగు వెంకట సీతాపతి, పు. 47.

6. త్యాగరాజు, త్యాగరాజు కీర్తనలు విశేష వివరణము. ద్వితీయ సంపుటము, కీర్తనలు : 252, 258.

7. సారంగపాణి పదములు : పదము-67.

8. గోపాలకృష్ణారావు, కె. ఆంధ్ర శతకవికాసము. పు. 7.

9. సత్యనారాయణరావు. యండమూరి, ఉషఃకిరణాలు, పు. 152.

10. ధూర్జటి, శ్రీకాళహస్తీశ్వర శతకము, పద్యసంఖ్య. 19.

11. వెంకటరత్నమాచార్యులు. ధూర్జటి. శ్రీకృష్ణశతకము. పద్యసంఖ్య. 42.

12. శేషప్పకవి. నరసింహ శతకము, పద్యసంఖ్య. 77.

13. శ్రీనాథుడు. క్రీడాభిరామము. (శ్రీనాథుని చాటు పద్యములు).

14. పెద్దన, మనుచరిత్ర (వావిళ్ళ వారి ప్రతి)పీఠిక పుట. xi

తీసుకొని తనవారుగా. తన వస్తువులుగా చేసుకొనే మనస్తత్వాన్ని కలిగిలేదు. వ్యక్తుల్ని, వస్తువుల్ని అసహ్యించుకొని వాటి వినాశనాన్ని కోరుకొనే మనస్తత్వం కలిగివుంది. అందువల్ల పరాశ్రయమైందిగా తిట్టు కవిత్వం వ్యాప్తిలోవుంది.

ఇంతవరకు చర్చించిన కవితా ప్రక్రియల్లో పురాణ, ప్రబంధ అవధాన, ఆశు, తిట్టు కవిత్వాలు వస్త్వాశ్రియాలుగా కన్పిస్తాయి. పద, శతక కవిత్వంలోనూ, చాటు కవిత్వంలోనూ కొంత కవి వ్యక్తిగత అంశాలకి, అభిప్రాయాలకి, బాధలకి ప్రాధాన్యముండి ఆత్మాశ్రయంగా కొనసాగాయి.

ఆత్మాశ్రయత్వాన్ని ప్రతిబింబిస్తున్న ఈ కవితా ప్రక్రియ అన్నింటితోనూ భక్తే అధికంగా ఆత్మాశ్రయంగా వెలువడింది. భగవంతునికి భక్తునికి మధ్యవున్న వ్యక్తిగత సంబంధమే ఇందుకు కారణం. ప్రాచీన కవిత్వంలో పేర్కొబడ్డ ప్రణయం అంతా కవులకు సంబంధించిన ప్రణయం కాదు. రాజులు, ప్రభువులు, పాలకుల అభిరుచుల కనుగుణంగా చెప్పటం వల్ల పరాశ్రయమైన శృంగార ఇతి వృత్తాలు ప్రాచీన కవిత్వంలో దర్శనమిస్తున్నాయి. ప్రకృతి కూడా ప్రాచీనకవుల స్వానుభవాలతో కాక ప్రాచీన సంస్కృత సంప్రదాయానుసారం స్వీకరించి కావ్యగతం చేయటం వల్ల వర్ణనా ప్రాబల్యాన్ని కలిగి వస్త్వాశ్రయంగానే కొన సాగింది.

ప్రాచీన కవితా ప్రక్రియల్లో అక్కడక్కడా రేఖామాత్రంగా వెలుగొందు తూండిన ఆత్మాశ్రయత్వం పాశ్చాత్య కవితా సంప్రదాయంలో బలీయమైందిగా రూపొంది నవ్య కవిత్వానికి ఒక విశేషతని చేకూర్చుకొంది.

ప్రాచీన కవిత్వంలో ఆత్మాశ్రయత్వాన్ని గూర్చి తెలుసుకొన్న తరువాత పాశ్చాత్య కవితా సంప్రదాయ ప్రభావాన్నీ. తత్ఫలితంగా నవ్య కవిత్వంలో పొడ చూపిన ఆత్మాశ్రయత్వ వైఖరుల్ని తెలుసు కోవాల్సిన అవసరం ఉంది. రాబోయే ప్రకరణంలో ఈ చర్చ కొనసాగిస్తాను.

వారు. ఈ రొమాంటిక్ తత్వాన్ని రొమాంటిసిజమ్ (Romanticism) అని వ్యవహరిస్తారు. రొమాంటిసిజమ్ అంటే ఏమిటో ఇలా నిర్వచించ బడింది.

'...romanticism is a literary and philosophical theory which trends toplace the individual atthe centre ofand life experience and represents a shift from objectivity to subjectivity'2 అంటే జీవితానికీ అనుభవానికీ మధ్య వ్యక్తిని వుంచి అతన్ని వస్త్వాశ్రయత నుంచి ఆత్మాశ్రయం వైపు మళ్ళించడానికి ప్రయత్నం చేసే సాహిత్యం మరియు తాత్విక సిద్ధాంతం రొమాంటిసిజమ్ అన్న భావం ఇక్కడ వ్యక్తం చేయబడింది. రొమాంటిక్ కవిత్వాన్ని తెలుగులో కాల్పనిక కవిత్వం అని వ్యవహరిస్తున్నారు.

ఈ రొమాంటిక్ కవిత్వం బహు విశాలమైంది. కవిఆలోచనలకి, అనుభూతులకి, ఊహలకి మాత్రమే పరిమితమై వివిధ దృక్కోణాలలో ప్రసరించి ఒక తాత్విక గమ్యాన్ని చేరుకొనేదిగా ఈ రొమాంటిక్ కవిత్వం వుంది. ప్రకృతి సహజమైన అంశాల్లో కనిపించే సౌందర్యంలో దాని సృష్టి కర్త అయిన భగవంతుని స్వరూపాన్ని అంతర్నేత్రంలో దర్శించే తత్వం రొమాంటిక్ కవిత్వంలో అధికంగా వుంది. ఆ దర్శించే దృక్పథంలోనూ, ఊహలోనూ అనుభూతిలోనూ భిన్న మార్గాలున్నాయి. కానీ గమ్యం ఒకే అంశం వైపు పర్యవసించేదిగా వుంది. అందుకే రొమాంటిక్ కవులు భిన్న కవితా తత్వాల్ని కలిగి వున్నారు. రొమాంటిక్ కవులు ఊహ ద్వారా, ఆలోచనల ద్వారా, అనుభవం ద్వారా ప్రకృతిని పరామర్శిస్తారు. ఆ పరామర్శించటం బాహ్య నేత్రంతో కాదు, మనో నేత్రంతో, తాము దర్శించిన తత్వాన్ని కవిత్వం ద్వారా వెలిబుచ్చుతారు. అందువల్ల కవి వ్యక్తిత్వమే రొమాంటిక్ కవిత్వంలో ఆద్యంతాలకు వ్యాపించి వుంది. రొమాంటిక్ కవిత్వంలో ప్రకృతి వర్ణనం, వ్యక్తివాదం, సౌందర్య కాంక్ష, తాత్విక దృక్పథం, ఊహాధిక్యం అనుభూతి ప్రాధాన్యం వహించాయి.

బ్లేక్ రొమాంటిక్ కవిత్వ ప్రారంభకుడు కాగా కాల్ రిడ్జ్, వర్డ్స్ వర్త్, షెల్లీ కీట్సు ఈ కవిత్వాన్ని పరిపుష్టం చేసినవారు. అటు తరువాత బైరన్, పో, రోసెటీ, స్విన్ బర్న్ మొదలైన వారు రొమాంటిక్ కవిత్వాన్ని ప్రచారం చేశారు. వీరందరి కవితా వ్యక్తిత్వాల్లో ఏకత లేక పోయినా అందరూ అనుభూతికి, ఊహకు కట్టుబడిన వాళ్ళేవీళ్ళందరి కవిత్వంలో ప్రకృతి, ప్రణయం, తాత్విక దృష్టి ఆధిపత్యం వహించాయి, వీళ్ళంతా ఊహ ద్వారా, అనుభవం ద్వారా

విషయ పరిజ్ఞానంతో ప్రాపంచిక విషయాల్ని సౌందర్య దృష్టిలో వింగడించి సృష్టి కర్త స్వరూపాన్ని వ్యక్తం చెయ్యడానికి ప్రయత్నించారు. రొమాంటిక్ కవులు ఆలోచన కంటే అనుభవానికే తమ కవిత్వంలో ఎక్కువ ప్రాతినిధ్యం ఇచ్చారు. ఆ అనుభవం ద్వారానే సృష్టి సౌందర్యాన్ని, దాని వల్ల సృష్టి కర్త స్వరూపాన్ని అవగతం చేసుకొనే ప్రయత్నం చేశారు.

ఇలాంటి తత్వమే తెలుగు నవ్య కవుల విషయంలోనూ అధికంగా కని పిస్తుంది.. పాశ్చాత్య విద్యా విధానంతో అప్పట్లో నవయువకులుగా ఉన్న భావక వులు ఆంగ్ల రొమాంటిక్ కవుల కవిత్వాన్ని చదవటానికి అలవాటు పడ్డారు. భావ కవులు అందులోని మంచిచెడ్డల్ని గమనించటం కంటే వాళ్ళా కవిత్వం వ్రాయటం కోసం ఎక్కువగా ప్రయత్నించి కృతకృత్యులయ్యారు. కాల్పనిక కవుల ప్రభా వంతో స్వేచ్ఛా ప్రియత్వం, ప్రకృతి మమత్వం, ప్రణయతత్వం, తాత్విక దృక్పథం భావకవుల్ని ఆకర్షించాయి. ఆ ఆకర్షణలకు లోనైన భావ కవులు తమ కవిత్వంలో కాల్పనిక కవిత్వాంశాల్ని కావ్య వస్తువులుగా స్వీకరించి ఆదృక్పథం తోనే రచనలు చేశారు.

రొమాంటిక్ కవిత్వ ప్రభావానికి లోనైన భావ కవికి ప్రకృతిని భౌతిక దృష్టితో కాక తాత్విక దృష్టితో చూడటం అలవాటైంది. అలాగే స్త్రీని కామ వాంఛతో చూడటం కాక సౌదర్య దృష్టితోనూ, సౌందర్యోపాసనాతత్వంతోనూ చూడటం భావ కవుల లక్షణం అయింది. అంతే కాదు. తమలోకి తాము చూసు కొని ఆత్మావ లోకనం చేసుకొని తమ వ్యక్తిత్వ ప్రమాణాలతో అందాన్ని విలువ కట్టటం, ప్రపంచాన్ని తమ అనుభవంతో వింగడించి చూడటం వంటి ఆత్మీయ అంశాలు భావకవుల్లో రొమాంటిక్ కవితా సంప్రదాయానుసారమే వచ్చాయి.

రొమాంటిక్ కవుల్ని రోజాలు, వాటి సువాసనలు. స్కైలార్క్, నైటిం గేల్ వంటి పక్షులు, వాటి పాటలు; గొర్రెపిల్ల వంటి జంతువులు, వాటి ముగ్ధ త్వం; థేమ్స్ వంటి నదులు, వాటి సౌందర్యం కదిలించి కవిత్వపు జల్లు కురిపిం చగా భావ కవుల్ని అసాదృశ్యంతోనే మల్లెలు వాటి సౌరభాలు, కోకిలలు వాటి కలస్వరాలు, మబ్బులు వాటి గాంభీర్యాలు, మెరుపులు వాటి తళుకులు కదిలించి కవిత్వం వెలికురికేలా చేశాయి. రొమాంటిక్ కవుల్లాగే భావ కవులూ తాత్విక దృష్టిని అలవర్చుకొన్నారు. ప్రకృతి గతమైన అంశాల్లో తల్లిసీ, చెల్లిసీ, చెలిసీ,

చెలికాణ్ణి చివరకు భగవంతుణ్ణి దర్శించి తరించారు. కానీ రొమాంటిక్ కవుల ప్రతి అంశంలోనూ, ప్రతిదశలోనూ పారమాత్మిక తత్వాన్ని ప్రదర్శించగా భావ కవులు ప్రకృతి, ప్రణయం మొదలైన అంశాలకై అర్రులు చాచి అవి లభించక పోగా దుఃఖిస్తూ పరమాత్మ చింతన వైపు మొగ్గు చూపారు. ఇది హిందూ తాత్త్విక సిద్ధాంతాను సారం ప్రతిఫలించిన అంశంగా వుంది.

ప్రకృతి ప్రియత్వంతో కాల్పనిక కవి స్వేచ్ఛగా సంచారం చేయగా ఆ ప్రభావంతోనే భావ కవీ స్వేచ్ఛగా సంచరించాలని ఉబలాట పడి ప్రకృతిలోకి పరుగులు తీశాడు. ఆ పరుగులు తీయటంలో ప్రకృతి లోని అలౌకిక సౌంద ర్యాన్ని దర్శించి తాత్వికతని నింపుకొన్నాడు.

> 'I wandered lonely as a cloud
> that flots on high o' er velas and Hills 3

అని కాల్పనిక కవి భావించగా భావ కవి కూడా ఇలాంటి భావనతోనే –

> 'ఏను స్వేచ్ఛా కుమారుడ నేను గగన
> పథ విహార విహంగమ పతిని నేను
> మోహన వినీల జలధర మూర్తి నేను
> ప్రళయ ఝంఝూ ప్రభంజన స్వామి నేను'4

అనిఅన్నాడు కాల్పనిక కవితా సంప్రదాయాన్ని నింపుకొన్న భావకవి స్వేచ్ఛా ప్రియత్వంతో ఆకాశంలో విహంగమ పతిగా విహరించాడు. అంతేకాదు తన్నొక ప్రళయ ఝంఝూ ప్రభంజన స్వామిగా భావించాడు. ఈ భావన అంతా కాల్పనిక కవి తాత్విక దృక్పథాన్నే పుణికి పుచ్చుకొంది. కాల్పనిక కవి ప్రకృతిని పరమాత్మ స్వరూపంగా భావించి గౌరవించాడు. పాశ్చాత్య కవితాభ్యాసంతో అదేదృష్టి భావకవికీ అలవడింది.

కాల్పనిక కవికి ప్రకృతి చూడగానే ఎంతో సంతోషాన్ని నింపేదిగా కనిపించింది. తన దుఃఖోపశమనాన్ని కలుగజేసిందిగా అగుపించింది, అటువంటి సుందరమైన ప్రకృతిలో శాశ్వతమైన సంతోషాన్ని, స్వచ్ఛంద ప్రవృత్తిని కాల్పనిక కవి చూడ గలిగాడు. అటువంటి నిర్మలమైన స్వచ్ఛమైన ప్రకృతిని సంబోధిస్తూ —

'......O Nature! Though hast fed
my lofty speculations; and in thee
For this uneasy hearts of ours, I find
A never - failing Principle of joy
And purest Passion' 5

అని అన్నాడు, ఇలాంటి భావంతోనే భావకవి ప్రకృతిలోకి పరులిడి నిండైన ఆనందాన్ని అనుభవించాడు.

ఆ అనుభవ మాధుర్యాన్ని —

'పరమ సంతోషయుత దాన పారవశ్య
కలన నొడ తెలుంగ కను జగంబు మరచి
విస్ఫుటంబుగ బాడు నీ విమల గీతి"6

అని కొనియాడాడు. కోయిల కూతలు, అడవిపూలు, సెలయేటి రొదలు భావ కవిని కాల్పనిక కవిలాగే పులకిత గాత్రుణ్ణిచేశాయి. ఆ ఆనంద పారవశ్యంలో భావ కవికి ప్రకృతంతా ఆనంద నిలయంగా తోచింది. ప్రకృతి స్వరూపం భావ కవిలో ఒక కోకిల స్వరంలో అలౌకికానందంగానూ, విమలమైందిగానూ దర్శన మివ్వడం కాల్పనిక కవితా సంప్రదాయాన్నే వ్యక్తం చేసేదిగా వుంది.

రొమాంటిక్ కవికి ప్రకృతి ప్రతి చర్యతోనూ సంబంధం వుంది. ప్రపంచంలోని చెట్టుచేమలూ, పక్షులు, జంతువులు తనవంటివి గానే కనిపించాయి. వాటిలోనూ సుఖదుఃఖాత్మక సన్నివేశాలు వుంటాయని గ్రహించాడు. అందుకే వాటి సంతోషంలో స్వర్గాల్ని చవిచూచాడు. రొమాంటిక్ కవి. సృష్టిలోని జీవులన్నీ ఆశీర్వదింప బడినవిగా కనిపించగా....

'Ye blessed Creatures, I have heard the call
Ye to each other make; I see
The heavens laugh with you in your jubilee;
My heart is at your festival
My head hath its Coronal
The fullness of your bliss I feel - I feel it all' 7

అని అన్నాడు. ఇదే భావమే భావ కవిలోనూ రేకెత్తింది. కానీ భావ కవి దృక్ప థం స్వర్గ సంతోషాల్ని, దైవత్వాన్నీ దర్శించేదిగా కాకుండా ప్రణయ తత్వాన్ని ప్రదర్శించేదిగా రూపుదాల్చింది.'

"ఈ మావి పైనుండి
ఈవు కూకూ యంచు
ఆ మావి పైనుండి
ఆపె కూకూయంచు

ఏమి బాసల జేతురే
కోకిలా: ఏమి బాసల జేతురే!

ప్రకృతి జన్యంబులై
పరమ రమ్యంబులౌ
భావముల, సౌందర్యముల
ప్రణయ మొల్కెడునట్లు

పల్కరించుచు నుంటిరే.
కోకిలా, పల్కరించుచు నుంటిరే"[8]

అని భావకవి అనడం కాల్పనిక కవితా సంప్రదాయ ప్రభావాన్నే వ్యక్తం చేస్తూ వుంది. రొమాంటిక్ కవి భగవంతునిచేత ఆశీర్వదింపబడిన జీవుల పిలుపులు విని వాటి సరదాల్లో స్వర్గం నవ్వుతూ వుండగా వాటి ఆనందంతో కవి ఐక్యమై పోయాడు. ఇలాగే భావకవి కోయిలల వలపు కూజితాల్లోని ఆనందాన్ని అనుభవించి అనుభవ మాధుర్యాన్ని చవిచూపి సంతృప్తుడయ్యాడు. కాల్పనిక కవిది తాత్విక దృక్పథం కాగా కాల్పనిక కవిత్వంచేత ప్రభావితమైన భావకవిది ప్రణయ దృక్పథాన్ని వింపుకొంది అయింది. ఈ ప్రణయం కూడా తాత్విక దృష్టితో ముడిపడి నదే. ఆత్మ పరమాత్మ ప్రణయైక్యమే తాత్విక దృక్పథం కలది. అందువల్ల కాల్పనిక కవిత్వ ప్రభావంతో భావకవి ప్రకృతిలోని పరమ రామణీయ కతకి ముగ్ధుడై ఆనందాన్ని అనుభవించినట్లు ఆ ఆనందానుభూతే 'మనుజుల కగమ్యమై మహిత శక్తిగల్గి పరమామృతము వొల్కు'[9] నదిగా ప్రకటితమైంది.

ప్రకృతి విషయంలోనే గాక కాల్పనిక కవితా ప్రభావం ప్రణయ విషయం లోనూ భావ కవిని ప్రేరితుణ్ణి చేసింది. ప్రణయ మాధుర్యంలో తేలియాడు తున్న కాల్పనిక కవికి అతని రాత్రింబవళ్ళు చెలి చూపులు ప్రతిబింబించే స్థలాలు: చెలి అడుగిడిన వెలుగు కిరణాల కలలు, కలలతోటి తన్మయత్వాలు అయ్యాయి. అవి

శాశ్వతత్వాన్ని నింపుకొన్న ప్రవాహాల నృత్యాలయ్యాయి. ఈ విషయాన్నే కాల్ప నిక కవి తన కవితలో -

'And all my days are trances,
And all my mighty dreams
Are where thy dark eye glances,
And where thy foot step gleams-
In what ethereal dances,
By what eternal streams!' 10

అని పేర్కొన్నాడు. ఇలాంటి భావాన్నే భావ కవి-

'................సీ
సోగ కన్నుల కొనల
సుమియించెనో సఖీ!
వేయి తారల మిన్కు
లూ తళుక్కులూ నాకు! -

ఏ నభస్సీమవో?
ఏ సుభ స్వర్గాల
య జ్యోతులో? దివ్య
సుమ కోరకాలో?

నీ కళ్ళ లోతులం
దో కామ లీ! తూగు
తూ, ఊగుతూ, పాడు
తూ నాట్య మాడేవి.
ఆలేత వెల్గుచూ
యతె' ||     అన్నాడు.

ఇక్కడ కాల్పనిక కవితా సంప్రదాయ ప్రభావంతో నిండిందిగా లేక ఆ కవితా సంప్రదాయాన్ని స్ఫురింప జేసేదిగా ఈ భావంవుంది. చెలి కన్నులకాంతుల స్వర్గంలోని శుభాలయ జ్యోతులుగా భావింపబడటంలో కాల్పనిక ప్రభావమే వుంది. రొమాంటిక్ కవిత్వంలో ప్రేయసి చూపులకి, పాదాలకి వాటి విన్యా సాలకీ శాశ్వతత్వం ప్రతిపాదింపబడి దివ్యత్వం ఆపాదింపబడగా భావ కవిత్వంలో

కూడా అలాంటి శాశ్వతత్వమే దివ్యత్వమే ప్రేయసి కను సొగసులకు అపాదింప బడింది.

రొమాంటిక్ కవిత్వ ప్రణయ తత్వమే భావకవిత్వంలో అనేక భంగుల దర్శనమిచ్చింది. ప్రేయసి దివ్యత్వాన్ని నింపుకొనేదిగానే కాక తను ఎల్లప్పుడూ సంతోషాన్ని పులుముకొని ప్రియుణ్ణి దుఃఖ సాగరంలో ముంచేదిగా కనిపించింది. ఇలాంటి భావమే భావ కవిలోనూ చోటు చేసుకొంది. కాల్పనిక కవి -

'You will proceed in pleasure and pride,
Beloved and loving many; all is O' er
For me on earth 'except some years to hide
My shame and sorrow deep in my heart's eore:
These I would bear, but cannot cast aside
The passion which still rages as befor-' 12

అని అంటే భావ కవి ఇలాంటి భావాన్నే -

"కిల కిలని నవ్వ చెలులతోఁ గలసి మెలసి
పూవుపై, మబ్బుపై చిన్ని పుల్గు వౌచుఁ
బ్రసవ కోమల రమణీయ పదముఁ బట్టి
పోవు చుందువు లావణ్య మూర్తి నీవు
.... .... ....
ఏనో దీనుఁడ నేసీడ నైన నొదిగి
మోడునై నిల్చి పోదు నకట! 13

అని వాపోయాడు. కాల్పనిక కవి లాగే భావ కవీ తన ప్రేయసిలో సుఖాన్ని చూస్తూ తాను మాత్రం దుఃఖ భారంతో కృంగి కృసిస్తాననడం ఇక్కడ గమనార్హం.

ఈ విధంగా బలీయమైన ప్రభావాన్ని చూపిన కాల్పనిక కవిత్వం భావ కవిత్వ శాఖల్లో ప్రకృతి కవిత్వం పైన, ప్రణయ కవిత్వంపైనా, స్మృతి కవిత్వం పైనా చెరగని ముద్ర వేసింది. భక్తి, దేశభక్తి, సంఘసంస్కరణ కవిత్వాలు ఈముద్రకు కొంత దూరంగా నిలిచాయి.

ఆంగ్ల కాల్పనిక కవిత్వంలోని ప్రకృతి ప్రీతి, ప్రకృతి ఆరాధనా తత్వా భావ కవిత్వంలో నవ్యతని రేకెత్తించాయి. పక్షాశ్రయంగా సాగుతూవుండిన ప్రబంధ కవిత్వం ఆత్మాశ్రయం వైపు మళ్ళింది కేవలం వర్ణనలు వర్ణనల కోసమే పరిమిత మైన ప్రబంధ కవిత్వంలోని ప్రకృతికి, భావ కవుల ప్రకృతికి చాలా వ్యత్యాసం ఏర్పడింది. భావ కవులు ప్రకృతిని వున్నదున్నట్లుగా వర్ణించక; ప్రకృతి తమని ఆకర్షించేదిగాను, తమతో కలిసి ఆనందించేదిగానూ దుఃఖించేదిగాను చిత్రీకరించారు. ఇలాచేయటం వల్ల ప్రకృతి కవిత్వం ఆత్మాశ్రయతని నింపుకొంది.

భావ కవికి కాల్పనిక కవితా సంప్రదాయజ్ఞత వల్ల ప్రకృతిలో నూతనత్వం కనిపించింది. ప్రబంధాల్లోని చంద్ర ఉపాలంభనలు, మన్మధ ఉపాలంభనలు, మలయ మారుత ఉపాలంభనల నుంచి నవ్య కవి దృష్టి ఆత్మగత అంశాలవైపు మరలింది. ఋతు, శైల వర్ణనలకు స్వస్తి చెప్పటం జరిగింది. ప్రకృతి పరమ రామణీయకతకి పులకించి కోకిలయై పంచమ స్వరంతో ఆలాపించాడు భావకవి కవి హృదయం సెలయేటి గానమై పరుగులెత్తింది, పర్వతాల అంచున ఉదయి స్తున్న సూర్యుణ్ణి పలకరించింది. రాగరంజితమైన సూర్యాస్తమయాలైన్నో అతని హృదయం నిండా అణగిమణిగి ఉజ్జ్వల కాంతుల్ని వెదజల్లాయి. భావకవి ప్రకృతిని బాహ్య సౌందర్య దృష్టితో చూడలేదు. తనకంటే భిన్నమైన వ్యక్తుల మనో భావాల్ని ప్రకటించటం కోసం ప్రకృతిని వాడుకోలేదు. తన అంతరాత్మలోకి ప్రకృతిని ఆహ్వానించి అందులోని ఆనందాన్ని తనకోసం నింపు కోవటం వల్ల ఆత్మాశ్రయత ప్రకృతి కవితలో చోటు చేసుకొంది. ఈ అంశం కూడా నవ్య కవి త్వంలో ప్రాచీనస్థితి కంటే భిన్నమైందిగా కనిపించడానికి ఆత్మాశ్రయత్వమే దోహదం చేసింది.

ప్రకృతి విషయంలోనే కాక ప్రణయ విషయంలోనూ కాల్పనిక కవితా సంప్రదాయం భావ కవిత్వంలో ఆత్మాశ్రయ త్వాన్నే ప్రసరింప జేసింది. పాశ్చాత్య సాహిత్యంలో చాలా కాలంనుంచీ తాము ప్రేమించిన స్త్రీలను గూర్చి కవులు భావ గీతాల్ని అల్లేవారు. వారు తాము ప్రేమించిన ప్రేయసి దూరం కాగా ఆమెరూ పాన్ని గుణ గణాల్ని, సౌందర్యాన్నీ ఆరాధిస్తూ ముగ్ధ హృదయంతో కవితా గానం చేశారు. అటువంటి వాళ్ళలో డాంటీ, పెట్రార్క్, సిడ్నీ, షేక్ష్పియర్, షెల్లీ, కీట్స్, బైరన్, బ్రౌనింగ్, రొసెటీ మొదలైనవారు ప్రసిద్ధులు.[14] వీరంతా భగ్న

హృదయులే. వీరి రచనల్లో కీట్సు, షెల్లీ, బైరస్‌ల ప్రేమ గాథలు ప్రసిద్ధి పొందాయి. ఆంగ్ల కాల్పనిక కవిత్వంతో పరిచయం ఉన్న భావకవులు రొమాంటిక్ కవుల స్వచ్ఛంద ప్రణయం చేత ఆకర్షింప బడ్డారు. వీరిజీవితాల్లోనూ అలాంటి సంఘటనలు కొన్ని జరగటం చేతా, మరికొందరు ఈ లోకం లోనిస్త్రీ అపూర్వ సౌందర్యానికి ముగ్ధులై అటువంటి సుందర రాశిని ఒక చోట పోగుచేసు కొనో. దివ్య శోభితలైన ఊర్వశీ, శశికళా, సృష్టి కావించుకొనో వారిసంయోగం దుస్సాధ్యం కాగా వారికోసం విలపిస్తూ కవితలల్లారు. మరికొందరు నిజజీవితంలో తమకు తారస పడ్డస్త్రీలను ప్రేమించి వారి ఎడ బాటులో విలాప గీతాలు రచించారు.

కృష్ణశాస్త్రి ఊర్వశి, అడవి బాపిరాజు గారి శశికళ మొదట కోవకు చెందిన ప్రేయసులు. రెండవ కోవకు చెందిన వారిలో నాయని వత్సల, నండూరి ఎంకి ముఖ్యులు. మొదటి కోవకు చెందిన ప్రేయసుల్లో వారి దివ్య శక్తులు, అపు రూప సౌందర్యాలు వివరింప బడి వారికై కవులు పడిన ఆరాటం వివరితమైంది. రెండవ కోవకు చెందిన ప్రేయసుల విషయంలో వారు దగ్గరగా వున్నప్పటికీ సంఘం. విధి వారి కలయికకు అడ్డురాగా విలపించారు. మరి కొందరు భావకవులు పూర్వ జన్మ వాసనల్ని స్ఫురణకు తెచ్చుకొని రాబోయే జన్మల విషయంలో కల యిక కుదరబోదేమోనని కలత చెంది బాధ పడ్డారు. ఇలాంటి భావాలన్నీ ఆత్మా శ్రయంగా పాశ్చాత్య కవితా సంప్రదాయాన్ని కొంత వరకు ప్రకటించేవిగా వెలువడ్డాయి.

ఇంతే కాకుండా రాయప్రోలు కావ్యాలలో అమలిన శృంగార తత్వ ప్రతి పాదన కూడా కొంత వరకు పాశ్చాత్య 'ప్లాటొనిక్ లవ్' ప్రభావ ఫలితంగానే ప్రకటితమైంది. ఇలా ప్రణయ కవిత్వంలో పాశ్చాత్య కాల్పనిక కవితా ప్రభావం వల్ల వస్తృత్వం వొడచూపి ప్రాచీన కవిత్వంలో వస్త్వాశ్రయంగా కొనసాగిన ప్రణయాన్ని ఆత్మాశ్రయం వైపు మళ్ళించింది.

భావకవి ప్రకృతి, రమణీయకతనీ, ప్రణయాలనే కాక తన చుట్టూ ఉన్న వ్యక్తుల సుఖదుఃఖాలను కూడా పంచుకోవటం ప్రారంభించాడు. తనకు పూర్తిగా అందుబాటులో లేని ఏరాజా సుఖాల్నో కాక తనకు అందుబాటులో వున్న మానవ జీవితాల్ని, వారి ఎడబాటు తీవ్రతల్ని ప్రకటించడానికి వ్యక్తకవి కంకణం కట్టుకొన్నాడు. అంటే ఆత్మీయతా భావం లేని వ్యక్తులు కాక ఆత్మ బాంధవ్యాన్ని కలిగి

వున్న కుటుంబ సభ్యుల, బంధుమిత్రుల సహజీవనానికి అలవాటు పడి వారు మరణించగా వారి ఎడబాటుకు దుఃఖించారు. ఇదే తెలుగు కవిత్వంలో స్మృతి కవిత్వ శాఖగా వెలుగొందింది. పాశ్చాత్య కవితా సంప్రదాయం ఈ స్మృతి కవిత్వాన్ని కూడా కొంత వరకు ప్రభావితం చేసింది. పాశ్చాత్యుల ఆత్మాశ్రయ కవిత్వంలో ప్రధానమైంది ఎలిజీ. దీన్నే తెలుగులో శోక గీతమని, శోక కావ్యమని స్మృతి కవిత అని వ్యవహరిస్తున్నారు.

ప్రాచీన కవిత్వంలో వుండే మరణ సన్నివేశాలు పరాశ్రియమైనవిగా కొనసాగాయి. కౌరవుల మరణ సన్నివేశాలు, కౌరవ స్త్రీల వియోగ దుఃఖం, లోహిదాసుని మరణం, కాముని దహనం మొదలైన ఘట్టాలన్నీ వస్త్వాశ్రయ పద్ధతిలో ప్రదర్శితమయ్యాయి. కవి మానసిక అవస్థతో ఎలాంటి సంబంధం లేకుండా ఆయా పాత్రల వరకే పరిమితమై ప్రాచీన కావ్యాల్లో మరణ సన్నివేశాలు చిత్రించ బడ్డాయి. అందువల్ల అవి వస్త్వాశ్రయాలు. కథలోని పాత్రలకే ఆ వియోగ దుఃఖం పరిమితమైంది. కానీ ఆత్మాశ్రయ ప్రభావంతో నవ్య కవిత్వంలో వివరింప బడిన మరణ సన్నివేశాలు వీటికంటే భిన్నమైనవిగా వ్యక్తమయ్యాయి.

నవ్య కవిపోగొట్టుకొన్న విలువగల వ్యక్తుల ఔన్నత్యాలు, వారిశాశ్వత ఎడబాటుకు గాయ పడిన కవుల హృదయాలు, వారిలో పెల్లుబికి ప్రవహించే దుఃఖ సాగరాలు తీవ్ర ధోరణిలో వ్యక్తమై నవ్యతని ప్రదర్శించాయి. వీటిలో నవ్యకవి తనకూ గతించిన వ్యక్తికీ వున్న సంబంధాన్ని వివరించి అతని స్మృతులు నెమ రేస్తూ మన చేత కూడా ఆ బాధను అనుభవింప జేయడం కవి ఆత్మీయతా భావాన్ని ప్రదర్శించేదిగా వుంది.

కాల్పనిక కవితా సంప్రదయం పైన పేర్కొన్నట్లు ప్రకృతి, ప్రణయం, స్మృతి కవితా శాఖల్ని ప్రభావితం చేయటం వల్ల ప్రాచీన కవిత్వంలోని వస్త్వాశ్రయ ప్రాబల్యం తగ్గి నవ్య కవిత్వంలో ఆత్మాశ్రయత్వం నెలకొనింది.

ఈ ఆత్మాశ్రయత్వం వ్యక్తి స్వేచ్ఛ నిచ్చేదిగానూ, కవి మనో భావాల్ని నిరంకుశంగా వెలిబుచ్చేదిగానూ, కవి మానసికావస్థను చిత్రించేదిగానూ, కవి వ్యక్తిత్వాన్ని, ఔన్నత్యాన్ని వెల్లడి చేసేదిగానూ వుండి నవ్య కవిత్వంలో బహు భంగుల దర్శన మిస్తూ వుంది.

ప్రాచీన కవిత్వంలో వుండే ఆత్మాశ్రయత్వం అవ్యక్తిత్వంతో నిండి వుండగా, నవ్య కవిత్వంలోని ఆత్మాశ్రయత్వం సంపూర్ణమైన వ్యక్తిత్వాన్ని సంతరించుకొన్నదిగా వుంది. ప్రాచీన కవిత్వంలో ఆత్మాశ్రయత్వం వర్ణనా ప్రాబల్యంతోనూ, రస, అలంకార పరిపోషణతోనూ, పాత్ర చిత్రణతోనూ, కథా కథన దక్షతతోనూ, అణగారిందిగా కనిపిస్తుంది. ఆధునిక కవిత్వంలోని ఆత్మాశ్రయత్వం ఇలా అణగారినదిగా కాకకవిత్వ అంశాన్నింటిలోనూ తన వ్యక్తిత్వాన్నే అధికంగా ప్రసరింపజేసింది. ప్రతి సన్నివేశంలోనూ, ప్రతి సంఘటనలోనూ, ప్రతి విషయంలోనూ ఆత్మాశ్రయత్వమే పాదులు దన్నుకొంది

అంతేకాక భక్తి, స్మృతి కవితలకేపరిమితమైన ఆత్మాశ్రయత్వం ఆధునిక కవిత్వంలో ప్రకృతిని, ప్రణయాన్ని, ఆవహించి విస్తృత రూపం దాల్చింది; ప్రాచీన కవిత్వంలో కవికీ, కవి అనుభవానికీ, ఆలోచనలకీ, కవిత్వానికి, కవిత్వానికీ మధ్య ఉన్న అఘాతాన్ని వేరు చేసి కవికీ కవిత్వంలో ప్రతిబింబింపజేసింది. ఈ కారణంగా కవి రచనల్లో ఆ కాలం సాంఘిక, రాజకీయ, ఆర్థిక పరిస్థితులతో పాటు కవి మానసిక విలువలు, కవి అభిప్రాయాలు కవి ఆశయాలూ కవిత్వంలో ప్రవహించాయి, వీటితో పాటు నైతిక విలువలు కూడా సముద్ధరింప బడ్డాయి.

# ఉదాహృత సూచికలు


1. సత్యనారాయణ, విశ్వనాథ. లిరికల్ పోయిట్రీ, భారతి, అక్టోబరు, 1939. పు. 237.
2. Concise Dictionary of Literary Terms, P. 237.
3. words worth - I wondered lonely as a cloud.
4. కృష్ణశాస్త్రి, దేవులపల్లి, కృష్ణపక్షము, కృష్ణశాస్త్రి కృతులు, పు. 8.
5. Words Worth.
6. అప్పారావు, బసవరాజు, కోయిల బసవరాజు అప్పారావుగీతాలు పు. 103,
7. Words Worth, Ode.
8. అప్పారావు, బసవరాజు, కోకిల, బసవరాజు అప్పారావు గీతాలు, పు. 2
9. ,, ,, ,, పు. 2
10. Poe. To One in Paradise.
11. విశ్వేశ్వరరావు, మల్లవరపు. ప్రేమగానము, మధుకీల, పు. 19.
12. Byron, Don Juan.
13. కృష్ణశాస్త్రి. దేవులపల్లి, కృష్ణపక్షము, కృష్ణశాస్త్రి కృతులు. పు. 36.
14. నారాయణరెడ్డి, పి. ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయాలు, ప్రయోగములు. పు. 336.

## 5. భావ కవిత్వం — ఆత్మాశ్రయత్వం

వస్తువు, భావం, రచన వీటి మూటిల్లో భావానికి అత్యధిక ప్రాధాన్యం ఇచ్చే కవిత్వమే భావకవిత్వం అని ఇదివరకే వివరించటం జరిగింది భావ కవులు భౌతిక విషయాలకి కాక ఆత్మగత విషయాలకి, అంతః సౌందర్యానికి ప్రాధాన్యం ఇస్తూ కేవలం భావనా బలంతో కవిత్వం వ్రాశారు. అందువల్ల 'భావ కవిత్వపు ప్రధాన జీవ లక్షణం ఆత్మాశ్రయమే,' అయింది.

గురజాడ, రాయప్రోలు, కృష్ణశాస్త్రి, వేదుల, నాయని, నండూరి, బసవ రాజు, దువ్వూరి, విశ్వనాథ, వేంకట పార్వతీశ్వరులు పింగళి, కాటూరి, తల్లావజ్ఝల, బాపిరాజు వంటి నవ్యకవులు ఊహల ఉద్దీనానికి, అనుభవ మాధుర్యానికి పకు టం పెట్టి భావకవిత్వం వెలయించారు. భావకవులు కవిత్వం పలురకాలైన పోకడ లతో, పలు విధాలైన వస్తు నిర్వహణలతో భిన్న రూపాల్లో ప్రవహించింది. అయినా ఆ ప్రవాహమంతా ఒకే గమ్యాన్ని చేరుకొంది. అది వస్తు భావ నిర్వహ ణలో భావ బందురతనే గమ్యంగా ఎంచి తన కాంక్షను నెరవేర్చుకొంది.

వివిధ రకాలైన మనస్తత్వాలు, శైలీ విన్యాసాలు కలిగిన భావ కవులచేత నిర్వహింపబడి వారి వ్యక్తిత్వంతో ప్రత్యేకతను సంతరించుకొన్న భావకవిత్వం వివిధ శాఖలుగా అలరారింది. భావ కవిత్వంలోని శాఖల్ని డా॥ సి. నారాయణరెడ్డి ప్రణయ కవిత్వం, ప్రకృతి కవిత్వం, భక్తి కవిత్వం, దేశభక్తి కవిత్వం, సంఘ సంస్కరణ కవిత్వం, స్మృతి కావ్యాలు అని స్థూలంగా విభజించాడు.[2] వీటిలో సంఘ సంస్కరణ కవిత్వం మాత్రం ఎక్కువగా వస్త్వాశ్రయ పద్ధతిలో కొన సాగింది.

సంఘ సంస్కరణ కవిత్వం దేశీయమైన కులమత వర్ణ వ్యత్యాసాలను దృష్టిలో వుంచుకొని వాటిని నిరసించడానికి వ్యాప్తిలోకి వచ్చింది. ఈ సంఘ సంస్కరణ కవిత్వంపై ఆంగ్ల కాల్పనిక కవుల ప్రభావం అంతగాలేదు. గాంధీయ దృక్పథంతో, మానవతా వాదంతో అప్పటి సాంఘిక పరిస్థితుల్ని మెరుగు పరచ డానికి సంఘ సంస్కరణ కవిత్వం వ్యాప్తిలోకి వచ్చింది. ఆకారణంచేత కేవలం ప్రబోధ కవిత్వంగా భావ కవిత్వంలో సంఘసంస్కరణ కవిత్వం వెలువడింది.

అందువల్ల సంఘసంస్కరణ కవిత్వంలో ఆత్మాశ్రయ రీతికంటే భిన్నమైన వస్త్వాశ్రయరీతి ప్రతిబింబిస్తుంది.

సంఘ సంస్కరణ కవిత్వం ఆనాటి సామాజిక వ్యవస్థని, అంటరానితనాన్ని, బాల్యవివాహాల్ని దృష్టిలో వుంచుకొని వాటికి బలైపోతూవున్న వ్యక్తుల జీవితాల్ని వేలెత్తిచూపింది. అటువంటి స్థితి నుంచి సంఘాన్ని కాపాడటంకోసం సంఘసంస్కరణ కవిత్వం ఒక ఉద్యమంగా బయలుదేరిన కారణంచేత సంఘటనలకు, సన్నివేశాలకు అవకాశం కల్పిస్తూ ఇతివృత్త పూరితాలైన కృతులు వెలువడ్డాయి. అంతే కాకుండా కవి చెప్పే మాటల్లో కవి హృదయం కంటె సమిష్టిగతమైన సంఘ హృదయం ప్రతిధ్వనించింది. ఈ కారణాల ఫలితంగా సంఘ సంస్కరణ కవిత్వంలో భావ కవిత్వంలోని ఇతర శాఖల్లో వుండే ఆత్మాశ్రయత్వం కంటే వస్త్వాశ్రియమే చోటుచేసుకొంది.

ఈ ప్రకరణంలో భావ కవిత్వంలో ఆత్మాశ్రయత్వాన్ని కలిగివున్న ప్రకృతి కవిత్వం, ప్రణయ కవిత్వం, భక్తి కవిత్వం, దేశభక్తి కవిత్వం, స్మృతి కవిత్వాలను వివరించే ప్రయత్నం జరుగుతుంది.

ప్రకృతి - ఆత్మాశ్రయత్వం : భావకవులు తమ హృదయాలపై ప్రభావంచూపిన ప్రకృతి సౌందర్యానికి పులకించి ఆ పులకింతల తీవ్రతల్ని సుకుమారమైన పద జాలంతో కావ్యరూపంలో తీర్చిదిద్దారు. ఆ తీర్చిదిద్దటంలో ప్రకృతిసహజమైన రంగులు వెదజల్లబడ్డాయి. భావకవులు సుకుమార మనస్కులు. అందుచేత ప్రకృతి ప్రతి కదలికకి చలించటానికి అలవాటు పడ్డారు.

భావ కవిత్వంలో ప్రకృతి రామణీయకత ప్రణయమంత ప్రాచుర్యాన్ని కలిగి వుండేదిగా చిత్రింపబడింది. పాశ్చాత్య కాల్పనిక కవుల ప్రభావం వల్ల భావకవులు తమ దృష్టిని ప్రకృతిపై కేంద్రీకరించారు. నగర వర్ణనలు, శైలవర్ణనలు, ఋతు వర్ణనలు, వనవిహారం, జలకేళి, పుష్పాపచయం మొదలైన ప్రాబంధిక ప్రకృతి వర్ణనలకు స్వస్తిచెప్పి ప్రకృతి అంతర్దర్శనానికి ప్రాధాన్యం ఇచ్చారు. భావకవులు ప్రకృతిని స్వాభావికంగా వర్ణించటమే కాక తమ ఆత్మస్థితి కనుకూలంగా మలచుకొన్నారు. తమ సుఖదుఃఖాల్ని ప్రకృతిలో చూడ గలిగారు. ప్రకృతిని చెలిగా, నెచ్చలి కానిగా, మాతృమూర్తిగా, ఆరాధ్యదేవతగా, భగవంతుని స్వరూపంగా భావించి ప్రకృతికీ తమకూ విడరాని అనుబంధం వుందని

తలంచారు. ప్రకృతిలోని ప్రతి కదలికలోనూ ఆనందాన్నో, ఆవేశాన్నో, దుః ఖాన్నో అనుభవించారు. గడ్డిపూవు పూచినా గగన గంగ ఉవ్వెత్తున లేచినా తమ కోసమే అని భావించారు. ఇలా భావించడంవల్ల భావకవి రచనల్లో ప్రకృతి కవి ఆత్మీయతా ముద్రని నింపుకొంది. దీంతో ప్రకృతి కవిత్వంలో కవి వ్యక్తిత్వం ప్రతిబింబించి ఆత్మాశ్రయత్వంతో ప్రకృతి కవిత్వం జాల్వారింది

భావకవుల ప్రకృతిలో మూడు రకాలైన ఆత్మాశ్రియ ప్రవృత్తులు కనిపిస్తాయి. 1. ప్రకృతి రామణీయకతకి పులకించి భావ కవి తన్మయత్వాన్ని పొందటం 2. భావకవి నిజజీవితంలో జరిగే సంఘటనలకు బాధపడి ప్రకృతిని ఆశ్రయించి ఓదార్పు పొందటం 3. ప్రకృతికి సంబంధించిన బాధలు తనవిగా భావించి విల విల్లాడి పోవటం. ఈ మూడు ప్రవృత్తులు కవి వ్యక్తిత్వంతో ముడిపడి వుండి ప్రకృతి కవిత్వంలో ఆత్మాశ్రయత్వం వుండటానికి అవకాశం కల్పించాయి. ఈ మూడు అంశాల వల్ల ప్రకృతి కవిత్వంలో గూడు కట్టుకొన్న ఆత్మాశ్రయత్వాన్ని పరిశీలిద్దాం.

భావకవికి తాను నివసిస్తున్న భూమీదాన్ని కప్పిన నింగీ వింత వింతశోభల్ని సంతరించుకొని మురిపించాయి. భూమ్మీద గడ్డి పరక మొలకెత్తినా, మొగ్గ పుష్పించినా, కోయిల గొంతు సవరించినా ఆకాశంలో మబ్బుదొంతరలు కదిలాడినా, నెల వంక చల్లని వెన్నెలని వెదజల్లినా, నక్షత్రం మిను మినుకు మన్నా భావకవి హృదయం పులకించింది. ఆ పులకింతల్ని అణుచుకోలేక ఆనందోత్సాహాలతో పొంగిపోయి కవిత అల్లాడు. ఆ కవిత్వం హృదయాలను జుమ్మని ఒరసుకొంటూ ప్రవహించింది. తనకు అభిమతమైన ప్రకృతిని భావకవి దర్శించినపుడు తనకు ప్రియమైన భావంతో దానికి స్వాగతం పలికాడు. ఆ స్వాగతాన్ని అందుకొని కవిత్వంలోకి వరుగెత్తిన ప్రకృతి కవి ఆత్మగతమైందిగా, కవి వ్యక్తిత్వాన్ని సంత రించుకొన్నదిగా వెలువడి ఆత్మాశ్రయతని కలిగివుంది. భావకవి అనుభవంలోకి, అనుభూతిలోకి ప్రవహించిన నేలా-నింగీ, కొండా-కోనా, సంధ్యారాగం, చెట్టు-చేమ, సుమ సౌరభాలు, మలయ మారుతం, జాబిల్లి-పండు వెన్నెల, సాగర సంగీతం, కోయిలలు-వలపు కూజితాలు, తుమ్మెద ఝుంకారాలు, మయూరం-నాట్య విన్యాసం, వేసవీ వర్షం వంటి విషయాల్లో వుండే ఆనందంతో కూడుకొన్న ఆత్మాశ్రయత్వాన్ని ముందుగా పరిశీలించి తరువాత ప్రకృతిని ఆశ్రయించి ఓదార్పు

పొందిన భావకవి ఆత్మీయతని, ప్రకృతి బాధలకు భావకవి వెలిబుచ్చిన సాను భూతిని వివరిస్తాను.

నేలా - నింగీ : భావకవి సౌందర్యోపాసకుడూ, ప్రేమశీలీ కావటంచేత ప్రకృతి నంతా పరిశీలించడానికి స్వేచ్ఛా విహారం చేశాడు. ఆ స్వేచ్ఛా విహారంలో పచ్చిక బీళ్ళలో పరచుకొన్న మైదానాలు, పర్వతాల్ని మోస్తున్న భూమీ, సెలయేళ్ళని ఆహ్వానించే వాగులూ, సముద్రం, ఏపుగా పెరిగిన వృక్షాలు, పుష్పించిన మొక్కలు జంతుజాలం, పక్షులు-ఇవన్నీ వాటి రమణీయ సందేశాల్ని వినిపించాయి. ఆ సందేశాల్ని కవి తన మదిలో భద్రంగా దాచుకొని తనహృదయ పేటిక తాళపు చెవిని కవిత్వం ద్వారా మన కందించాడు. ఆ కవిత్వాన్ని అనుభవించినపుడు కవి హృదయంనుంచి వెలికురికిన ప్రకృతి రామణీయకత, అందులోని కవి అనుభవం మనకు దొరకుతాయి.

తాను నివసిస్తున్న భూమిని ప్రశంసిస్తూ 'పృథివీ ప్రశంస' కావించాడు భావ కవి.

'ఓ విశాలావనీ!
శోభాతి పావనీ!

ఆరంభ పుణ్యక్షణముల నీకుఁడు వినదగిన నాఁటి
నీయాది సౌభాగ్య మెటుల వెగ్గెనొ? భవదీయ శాటి
అకు పచ్చని యాకులో!
పండు వెల్తురు రేకులో!
నిన్ను ప్రశ్నింపగాఁజాల! నీనాఁటి ప్రొద్దుటి పూట
గంభీరమై ప్రవహించె నీదు సౌందర్యంపు పాట'!

అంటూ పారుతూ వున్నటువంటి కాల్వల దగ్గరగా వీస్తున్న గాలుల్ని వింటూ ప్రకృతి మాత ఉదాత్తమైన లలాటరేఖ పులకల్ని చూస్తూ, చాలా దూరంగా వున్న వెదుళ్ళు కంఠమెత్తి పాడగా తల్లి ఒడిలో అల్లరి చెయ్యకుండా వింటూ తన్మయత్వాన్ని పొందాడు ఆనందాతిశయంతో, తనకున్నటువంటి రత్న హారాలన్నింటినీ తీసుకొని 'జననీ నాకిమ్ము నీ మృత్తికా రేణుకము, శాద్వల శ్యామల వీధి వికసించు పచ్చ ప్రాగంణము.'4 అంటూ ప్రాధేయ పడ్డాడు, 'జననీ జన్మభూమిశ్చ' కావటంచేత

మాతృమూర్తి సమానంగా భావ కవి హృదయంలో ప్రకృతి మాత ఆదరణీయ మైంది.

భూమిపై విరబూసిన చేమంతుల సౌరభాలు, రత్న కంబళి లాగా రాణిస్తున్నటువంటి బీళ్ళలో విరిసిన పలురకాలైన పూల సోయగం, పంటల సౌభాగ్యం భావకవిని ఆకర్షించాయి. ఆ ఆకర్షణలో మునిగిపోయిన భావకవికి సృష్టి సర్వం సృష్టికర్త చిత్రించిన మనోజ్ఞమైన చిత్రంగా కనిపించింది. ఈ విషయాన్నే చాలా మనోజ్ఞంగా భావ కవి.

"అప్పుడప్పుడె విచ్చి యలరు చేమంతుల
కమ్మని నెత్తావి గడలు కొనగ,
రత్న కంబళమట్లు రాణించు బీళులఁ
బలు వన్నె పూవులు బలిసి విలియ,
వ్రాలఁ బండిన రాజనాల కేదారంబు
పంట లక్ష్మికి నాట పట్టు గాఁగ,
.... .... ....
ఈ నిమేష మందు నిలయెల్ల నందమై
స్వర్గ శిల్పి యిందర్ని శాల శక్తి
వ్రాసినట్టి చిత్రపటమున విలసిల్లె"5

అని ఒక రమణీయ దృశ్య సాక్షాత్కార పద్ధతి ద్వారా తన అనుభవాన్ని అందించాడు. భావకవి తనని ఆహ్లాద పరచిన ప్రకృతి రామణీయకతని చూస్తూ అలాగే వుండి పోదలచుకోలేదు. అందులో లీనం కావాలనుకొని తాపత్రయ పడ్డాడు. కాబట్టే ఆకులో ఆకులాగా పూవులో పూవులాగా వుండిపోవాలనుకొన్నాడు.

పృథివి మీది సౌందర్యానికే కాకుండా భావకవి వినీలాకాశంలో స్వేచ్ఛా విహంగాలతో విహరించి ఆనందించాడు. అతని విహారంలో, నింగిలోని మబ్బులు తారకలు, అతణ్ణి ఆకర్షించాయి. ఆకాశం నీలిమకి పూసిన వెలుగు పూలు అతనికి మిరుమిట్లు గొలిపే కాంతితో ప్రకాశించేవిగా అగుపించాయి. అటువంటి కాంతి వంతమైన నక్షత్రాల్ని చూసి -

"తలను పైకెత్తి కన్నురెప్పలను విప్పి
కమ బొమల నెత్తి ఫాలంబు గడియఁజేర్చి

ఘన తరాద్భుత దృష్టితోఁ గాంచుచున్న
నన్నుఁ గన్గొని నవ్వుచున్నావొ, కాక
నవ్వు చుండుటయే నీకు నైజ గుణమొ
ఆశలను నిండియున్న యాకాశమందు
మినుకు మినుకు మను కాంతితో మెఱయు చున్న
చిన్న నక్షత్రమా! నాకుఁజెప్పఁగదవె -'6

అంటూ నక్షత్రకాంతిని నవ్వులాటగా భావించి భావ కవి ఆ నవ్వుకు కారణం చెప్పమన్నాడు. సౌందర్య కాంక్షతో ప్రకృతిని చూడటమే కాక అందులోని తత్వాన్ని కూడా అవగతం చేసుకోవటం కోసం ప్రయత్నం చేశాడు. ప్రకృతి మాయలో పడి వళ్ళు తెలీకుండా కాలం గడిపే భావ కవి ప్రవృత్తిని జూసి నక్షత్రం నవ్వుకుంటూవుందని రహస్యం తెలిసిన వాడులాగా కవి తన అమాయకత్వానికి చిరునవ్వు నవ్వు కున్నాడు.

భావ కవిని ఈ సుందరమైన ప్రపంచంలో నేలా నింగీ వింత సోయగాలతో మైమరపించాయి. ఆకాశంలో నక్షత్రాలే కాకుండా మబ్బుగములు- నెలవంక,వెన్నెల ఇవన్నీ ఆయన మనసును కదిలించాయి. మేఘాల్ని గూర్చి వేషవివర్ణంలో నెలవంక వెన్నెలలనుగూర్చిజాబిల్లి-వందు వెన్నెల క్రిందా విపులంగా వివరిస్తాను. నేల సౌందర్యాన్ని చూసి సంతోషంతో ఉబ్బితబ్బిబ్బులైన భావకవి దృష్టి ఆకాశంవైపు మళ్ళింది. అందులోని సౌందర్యానికి ముగ్ధుడై మొండి పట్టుదలతో అక్కడే ఉండి పోవాలనుకొన్నాడు. ఎవరేమనుకున్నా ఆ హాయిని అహ్లాదాన్ని ఒక్కక్షణం అయినా జార విడుచుకోకుండా తన సొంతం చేసుకొని శాశ్వత ఆనందాన్ని అనుభవిస్తూ వుండి పోవాలనుకొన్నాడు. దివి కెగసిన భావ కవి -

'దిగి రాను దిగిరాను దివి నుండి భువికి
నవ్వి పోదురు గాక నా కేటి సిగ్గు?'7

అని ప్రశ్నిస్తూ మొయిలు దోనెల్లో ప్రయాణం చేస్తూఆకాశం అంతావిహరిస్తూ తారకామణుల్లోఒక తారకయై వెలుగొందాలకొనున్నాడు. ఇక్కడ భావ కవికి నేలపైనా నింగిపైనా వుండేమమకారం, సంతోషాన్ని అనుభవించడంలో వున్న సంతృప్తి వెల్లడి అవుతున్నాయి.

వెదజల్లబడే కావ్యరంగులు ఏ దేవ శిల్పి కుంచెనుంచి జాల్వారిన రంగులుగానో, ఏ దేవి గండరక్తులొలికినవిగానో అనిపించాయి. అందుకే భావకవి -

'పొంగారు సంజ మొయిలు
రంగారు కావి హొయలు
ఏ దేవ శిల్పి కుంచె చిల్కెనో
ఏ దేవి గండ రక్తు లొల్కెనో?' 12

అని పాడుకొన్నాడు ఆనందోత్సాహంతో.

తూరుపుకొండపై ఉదయించే సూర్యుడు ఆకర్షణని వెదజల్లుతూ వుండగా ఆ ఆకర్షణకి అనురక్తుడైన భావకవి తన ముద్దరాలితో సూర్యునికి అర్ఘ్య పాత్రని తీసుకొని స్వాగతం పలకమన్నాడు ఆత్మీయతా భావంతో. సూర్యుణ్ణి మిత్రునిగా, చెలికానిగా భావించి ఆత్మీయతని ప్రదర్శిస్తూ స్వాగతం పలకడం భావకవి ప్రేమ తత్వాన్ని వ్యక్తం చేస్తూ వుంది. ఈ క్రింది పంక్తుల్లో -

'అరుణుడుద యించు నదిగొ దోహనరమ్ము
మోహనమ్మయి వీతెంచు ముద్దరాల
రంగ వల్లిక నర్ఘ్య పాత్రమ్ముఁదాల్చి
సవితృనకు పచి యింపుమా స్వాగతమ్ము' 13

అని అంటూ సంధ్యారాగ రేఖల్ని తిలకించిన భావకవి హృదయం అపురూపమైన కల్పన కావించింది. ప్రకృతి సహజమైన సంధ్యా కాంతుల్లో పంట చేలు ఆరారుతూ వుండటాన్ని మనోజ్ఞంగా భావకవి హృదయానికి హత్తుకోనేలా వర్ణిస్తూ -

'సందె ముత్తైదువ సరిగ వలిపంబు
వరి వెన్ను పాపలు పట్టి లాగంగ,
వాత్సల్యమునఁ బైకి వంగెనో యనఁగ
చెంగావి నిగ్గులు చేలపై నలమె' 14

అంటూ కవి ఆత్మీయతా ముద్రతో ఒక సజీవమైన ప్రకృతి దృశ్యాన్ని చిత్రీకరించాడు లేలి సంధ్యా సమయంలో.

నవ నవ లాడుతూ వెలుగొందుతూన్న నవ సంధ్యని భావకవి అమితంగా ప్రేమించటం వల్ల వెల్లువలై జాల్వారుతున్న కాంతి పుంజాలు హృదయాందోళ

నాన్ని అణచి శాంతిని కలుగ జేసేవిగా, సంతోషాన్ని రేకెత్తించేవిగా అగు పించాయి. అందుకే -

"నా జీవన ప్రాంగణమ్మో
నవోదయ నాట్యశాల!
నవ హృదయ విహాయసమ్మో
నవ సంధ్యారాగ డోల!"15

అని తన జీవితాన్ని ఒక సుందరమైన సంధ్యతో పోల్చుకొంటున్నాడు ఆనందాతి శయంతో. ఆ సంధ్యని చిరస్థాయిగా నిలిచి పొమ్మంటూ ప్రాధేయపడ్డాడు.

ఇంతగా భావకవి ప్రకృతిని ప్రేమించాడు కాబట్టే భావకవి హృదయానికి ప్రకృతి అంత ఆహ్లాదాన్ని కలిగించింది. అతని కవిత్వంలో ఆత్మీయతని జాల్వార్చింది. ఉషస్సులోని తొలి వెలుగులతో, సాయం సంధ్యలోని లేత వెలుతురుతో తాను సంతరించుకొన్న కావి రంగుల వస్త్రాలతో ప్రకృతి భావకవి హృదయానికి ఉత్తే జాన్ని, ఉల్లాసాన్ని కలుగజేసింది.

తొలి మలి సంధ్యల సౌందర్యానికి భావకవి సంతోషపడుతూ ఆశ్చర్య చకితుడయ్యాడు. అటువంటి రమణీయమైన సంధ్యోషస్సులు తన కొరకేనా? ఇంకెవరి కొరకైనా నా అన్న అనుమానం రేకెత్తగా ఆ చక్కదనాల్ని నింపుకొన్న సంధ్యోషస్సుల్ని

'మెరిసే తారలు తిరిగే గ్రహములు
సంధ్యోషస్సుల చక్కందనములు
సస్య పయస్సులు సరసాంధస్సులు
ఈశ్వర దత్తము లెవ్వరికో!"16

అంటూ అనుమానాన్ని వ్యక్తం చేశాడు.

చెట్టూ - చేమ : భావకవి మనసుకు నచ్చింది కేవలం భూమీ, ఆకాశం, కొండ, కోన, సంధ్యోషస్సులే కాదు, పచ్చని పరువాన్ని పులుము కొన్న ప్రకృతికూడా. భూమిపైని పచ్చని గరిక నుంచి ఏపుగా పెరిగిన మహా వృక్షం వరకూ వున్న ప్రకృతి భావకవిని రంజింపజేసింది. గడ్డిపరక మోసులెత్తటం విస్మయంగా తోచింది. ద్రాక్ష లతలు పందిళ్ళను అల్లుకోవటం సంతోషాన్ని నింపింది.

దారి ప్రక్కగా మొలకెత్తివున్న గడ్డిని చూసిన భావకవి దాని క్రొత్త కాంతులు, మెత్తందనల హృదయాన్ని కదిలించగా -

"దారి కోవల క్రేవ దానరారు గరిక!
యెంత మెత్తం దన మిగురొత్త నీవు
మొన్నగాఁగురిసిన ముత్యాల జడికి
మురిపాల గుబురువై పెరుగు చున్నావె?"17

అవి ప్రశ్నా పూర్వకంగా పరామర్శించ కుండా వుండలేక పోయాడు.

కాల వశంలో మోడువారిన గున్నమావి చిగురించి పుష్పించటాన్ని చూసిన భావకవి మనసు అది ఇచ్చే తీయని వాసనలతోనూ, పండ్లలోని మాధుర్యం తోనూ తడిసింది. అలాంటి వాసనా భరితమైన హృదయాన్ని మామిడిచెట్టు అలరింప జేసింది. అతని మాటల సంపద దాని మోసులెత్తే చిగురాకుల్లో వున్నదంటూ -

"చూచు కొలంది వింత లగుచున్ మనమున్ గరగించి నన్నుఁ బ్రే
రేచఁదొడంగె నీదు నును రెమ్మల కై వడి మోసులెత్తు వా
చా చతురత్వ మంతయు రసాలను! నాపయిఁజూపు వుంచవే
నీ చివురాకు తళ్కులను, నీ పువు గుత్తుల కుల్కు నవ్వులన్"18

మామిడి కొమ్మల్ని, చివురించిన రెమ్మల్ని, పూల గుత్తుల పరిమళాన్ని కొనియాడాడు. అలా కొనియాడటంతో సంతృప్తుడు కాలేదు. ప్రకృతి సౌభాగ్యానంతా నింపుకొని వున్న ఆ మామిడి చెట్టును ఆ సౌంధర్య సౌభాగ్యాన్నంతా తన కివ్వమని కోరాడు. ఆకుల సందుల్లో నిండివున్న తళుకులు, మకరంద మాధుర్యం, మామిడి పండ్ల మిసిమి తనకు కావాలంటూ -

"తలిరాకు జొంపమ్ము తళుకు విగ్గులు
నాదు నేత్రి యుగమ్ము నింపనిమ్ము
పూదేనియల చొక్కపుందీపు రుచులు
వాగ్విలసనంబునకు లభింప నిమ్ము
తళుకు బంగరు చాయగల పండ్లమిసిమి
శరీరమ్మునకు నావరింప నిమ్ము
పూవు గుత్తుల కమ్మ తావులు నా

యూర్పు గాలితో నైక్యమ్ము గాంచనిమ్ము
ప్రకృతి సౌభాగ్య మంతయు రాశియైన
విధమునన్ దోచు చుంటివి, వెదకి వెదకి
యీ సరికి లభ్యమయ్యెను పానవాధి
దేవత యటంచు నిన్ను నర్థించు చుంటి"19

అని స్వార్థాన్ని ప్రకటించాడు. కవి ప్రకృతినంతా తనదిగా భావించటంతో దాని సౌందర్యం తనకు కావాలన్న కోరిక పొడ చూపింది. ఆ కోర్కెలో కవి వ్యక్తిత్వం, సౌందర్య కాంక్ష, ప్రకృతి ప్రియత్వం నిండి వుండి ఆత్మాశ్రయత్వాన్ని ప్రకటిస్తూవుంది.

కేవలం భావకవి చెట్టూ చేమల్ని చూపినప్పుడే కాకుండా వాటి సమూహాల్ని నింపుకొన్న తోటల్ని చూసినప్పుడు కూడా ఆనందాన్నే అనుభవించాడు. ఆ ఆనందాన్ని ఆత్మాశ్రయత్వంతోనే జాల్వార్చాడు. అందుకే -

'తోట నవ నవ లోన
వెలుగు నీడల పొత్తు
తెలిసి పాలింతు'20

అన్నాడు నవ నవలాడుతూన్న తోట ఏటిదరిలో వుండటంవల్ల పరమ రామణీయకంగా వుంటే భావకవి సంతోషాన్ని నింపుకొన్నాడు. ఆ సంతోషంలో హృద్యమైన భావం జాల్వారింది. ఆ భావాన్ని -

"ఏటి కడుపున దాగి
తోట నిదరోయింది
'ఆలనా' నా సొదకు
'పాలనా' యను కొంటి"21

అని రాగతనంతో భావనా మగ్నమైన హృదయాన్ని ఆవిష్కరించాడు.

సుమసౌరభాలు: భావ కవత్వంలో పూలకీ, వాటి పరిమళాలకూ నింగీ నేల కంటే, కొండా కోన కంటే, సంధ్యారాగం కంటే, చెట్టూచేమల కంటే అధిక ప్రాధాన్యంవుంది. వివిధమైన రంగులతో అలరారుతూ, వివిధ రకాలైన సువాసనల్ని, వెదజల్లుతూ గుబులు కల్గించే పరువాన్ని నింపుకొన్న పూల గుచ్ఛాలు

భావకవికి మనోరంజితా లయ్యాయి. వాటి సువాసనలు మత్తుని కలిగించాయి, వాటిని అంటి పెట్టుకొని ఝుమ్మని తిరిగే వలపు తేంట్లు వింత సోయగాల్ని పెద జల్లాయి పూలకున్న వ్యాప్తిని వివరిస్తూ భావకవి సమస్తసృష్టి పువుల్ని అందంగా తరుముకొనివుంది. మరి తుమ్మెద ఎందుకు పూలపాట పాడటం లేదో అంటూ ప్రశ్నిస్తున్నాడు అంత సౌందర్యాన్ని, సౌకుమార్యాన్ని కలిగిన పూలు తమ సుగంధ భరితమైన వాసనల్ని ఆకాశంలోనూ, భూమ్మీదనూ, గాలిలోనూ, చివరకు మానవ హృదయంలోనూ తళుకులు వెదజల్లుతూ ఎంతో మనోజ్ఞంగా వుండగా తేటి వలపు పాటను పాడక పోవటం విస్మయం కలిగించింది. ఆ విస్మయంతో భావకవి తుమ్మెద పూలపాట ఏల పాడదో అంటూ -

"ఆకసమ్మున పూవులే యందగించె.
వసుధ కడుపున పూవులే పవ్వళించె
అలయమ్మున పూవులే యాటలాడె.
ఏల పాడదు తుమ్మెద పూలపాట?

పవను కౌగిట పూవులే సవదరించె.
హృదయమందున పువ్వులే రేకులెత్తె,
తోట తోపల పువ్వులే తొలకరించె,
ఏల పాడదు తుమ్మెద పూలపాట?'22

అంటూ పూలపై తనకున్న మక్కువను. పూలకున్న విశ్వ వ్యాప్తిని కమ్మని మాటల్తో సూచించి తన ఆత్మీయతని ప్రదర్శించుకొన్నాడు.

పూలను పుష్పింప చేయటంలో పూలమొక్కలకు, తీవలకు అమితమైన ఆనందం అవి భావకవి భావన. కుసుమించటం కారణంగా చూతలతిక పులకించి పోతూవుంది. పుష్పించటం నెపంగా గొజ్జగి నవ్వుతూవుంది. పూలను సంతోషంతో విప్పారిన ముఖాల్లా భావించే భావకవి భావంలో వాటి సంతోషంతోపాటు ఆనందోత్సాహాలతో నిండిన కవి హృదయం ధ్వనిస్తూ వుంది. ఈ క్రింది పంక్తుల్లో.

"పులకించె జూచితే పుష్పచ్ఛలంబున
శోభాయమానమై చూత లలిక
హాసియించె జూచితే కుసుమ కైతవమున
జగ్గు విగ్గెవ గొజ్జంగి మోక"23

పారిజాతాలు, కనక రత్నాలు, చామంతులూ భూమిపై రాలుతూ, దండలై తేలుతూ, అందాలై విచ్చుకొంటూ వుండగా సౌందర్యాన్ని తిలకించిన భావకవికి 'పూవుల్లపాట' పాడాలనిపించింది. తాను గాకుండా ఇంకెవరైనా ఆ పాట పాడితే ఆ సుమ సౌరభాల్ని ఆఘ్రాణిస్తూ, పాట మాధుర్యానికి చొక్కిపోతూ వుండి పోవాలని భావకవి ఉబలాటం, ఆ ఉబలాటంతో -

"పాడవే పాడవే పూవుల్ల పాట
పందిళ్ళ పూసినా పారిజాతాలు
రాసులై మళ్ళలో రాలేటి చోట
కావెళ్ళ తెచ్చేటి కనక రత్నాలు
గాలిలో దండలై తేలేటి చోట
అచ్చు చామంతులు విచ్చేటి చోట
.... .... ...
పాడవే పాడవే బంగారు తల్లి
భూమిపై రాలేటీ పూవుల్లపాట"24

అంటూ తన్మయత్వంలోకి జారిపోయాడు భావకవి. తన్మయత్వంలోకి జారిపోయిన భావకవికి తన నెచ్చెలి గుర్తుకొచ్చింది. తనకు అత్యంత ప్రియమైన చెలికి ప్రేమ కానుకగా పుష్పాల్నే సమర్పించు కోవాలన్న కాంక్ష రేకెత్తింది. అందుకే తనకూ, ఆమెకూ ఇష్టమైన సంపంగెను, మల్లెను తీసుకవెళ్ళి తన ప్రేయసితో -

'ఇది సంపంగె పూవు
ఇది మల్లె పూవు
ఏది కావలెనే?
చెలియా!'25

అంటూ రెండింటినీ చూపించాడు. భావకవి లాంటిదే ఆయన చెలియకూడా. ఆమె దేనినీ వదులుకోదు. రెండూ కావాలంటుందేమో.

ప్రకృతిలోని రామణీయకతని, సమకూర్చుతూ పూలు వికసించటమే కాకుండా, వాటి సువాసనల్ని గాలిలో వ్యాపింపజేస్తూ వుండటంవల్ల భావకవి మనసు పులకించి ఆనందాన్నే నింపుకొంది. పూలగాలి పొలాలపై వీస్తూ భావకవిని

కదిలింపగా శరీరమంతా పులకించి వలపు మొలకెత్తింది. ఆ సంతోషంలో హృదయంలోని బాధని నివారింప చేసుకోడానికి కోయిల పాటని వింటూ సంతోషాన్ని నింపుకో మంటూ తన మిత్రుడైన కృషీవలుని కోరుతూ భావకవి -

'పూలగాలి పొలముపైని వీతెంచె,
వలపు మొలచి యొడలు పులకరింప,
మనసు కోతలెల్ల మానిపోఁ గోయిల
గూడి పాడు మొక్క కొ(ం)త్త పాట'26

అని అడిగాడు. ఇలా అడగటం భావకవి సహృదయతని, మిత్రుని యెడలగల అనురాగాన్ని, ప్రకృతి ప్రియత్వాన్ని వ్యక్తంచేస్తూ ఆత్మాశ్రయతని కలిగివుంది.

ఇటువంటి సౌకుమార్యాన్ని, సౌందర్యాన్ని, సువాసనల్ని పూలలో ఆస్వాదించిన భావకవికి తన సుకుమారమైన బ్రతుకు ఒక సుమ జన్మగా భావించింది. ఆ భావంతోనే భావకవి వాసనల్ని వెదజల్లే సోయగం, వీడిపోనటునంటి తీయని సౌఖ్యం క్షణికమైనాలేక నగమైనా సరే విచారించనంటూ -

'ఈసుమ జన్మ మెట్లో ఘటియిల్లెను నా
కొకనాటి పాటిదై, వాసనలీను సోయగము
వాయని తీయని పోడుముల్ క్షణంబో, సగమో
విచార పడబో, నయినన్ విడివడ్డ నాయెదన్
మోసులు వారు నూతన మనోరథ,
మామవి వేడి పొంగులన్!'27

అని సంతృప్త దయ్యాడు. ప్రకృతిలో తాదాత్మ్యం పొందే అంశం ఇక్కడ పువ్వుల పరంగా వ్యక్తమై కవి చిత్త వృత్తిని సూచిస్తూవుంది. ఇలాభావకవి సుమ సౌరభాల విషయంలో కూడా తన అభిరుచుల్ని ప్రకటించుకుంటూ సంతోషాన్ని వ్యక్తపరచి ఆత్మాశ్రయత్వాన్ని అభివ్యక్తం చేశాడు.

**మలయ మారుతం :** పూల సౌరభాల్ని చల్లదనాన్ని నింపుకొన్న భావకవి మనసుకు నెమ్మది కలుగజేస్తూ, శ్రమను పోగొట్టూ, వీచే పిల్ల తెమ్మెరలన్నా ఆసక్తే మలయాద్రి నుంచి చల్లదనాన్ని, తాను పయనించే ప్రాంతాల్లోని పూలసుగంధాన్ని మోసుకొచ్చే మలయ మారుతం కవికి ఎన్నో సువాసనల్ని, ఎంతో చల్లదనాన్ని

నింపింది. ఆ మధురమైన హాయిని అనుభవించిన భావకవి తన కవితల్లో మలయ మారుత ప్రసక్తి తీసుక రాకుండా వుండలేక పోయాడు. తన చెలితో మురళీ గానాన్నీ, చిన్ని కృష్ణుని సొబగునూ ప్రశంసిస్తూ భావకవి -

'మలయ పవనుకౌగిలిలోనె పులకరించి
హాయిగాఁ గంఠమెత్తు ప్రాయంపు వంశి
విశ్వ మోహను జిలిబిలి పెదవులంటి
యవశయై పోయి యేమి చేయంగ లేదు!'28

అని మలయ మారుతంలో సంతోషాన్ని అనుభవించి హాయిగా కంఠం ఎత్తే ప్రాయంలో వున్న వంశిని, దాని మాధుర్యాన్ని కొనియాడాడు ఆనందంతో.

ఎవరో తీయని పాట పాడగా భావకవి ఆ పాట మాధుర్యాన్ని అనుభవించి అందలి మాధుర్యానికి చిక్కిపోయి ఆ మాధుర్యాన్ని తనదిగా చేసుకొని మన ముందుంచుతూ -

"మంద మలయా నిలోర్మికా మాలికలను
లలిత సుకుమార మధుర బాల స్వరంబు
నెత్తి. పాడితి వేమేమొ హృదయ కమల
వికసనోద్బోధకంబగు వింత గీతి'29

అన్నాడు. ముందుగా వీస్తూ వున్న మలయ మారుతాల మాలికలను 'లలితమూ, సుకుమారమూ అయినటువంటి మధురమైన బాలస్వరంతో ఏవో పాటలు పాడగా హృదయ కమలం వికసించింది అనటం భావకవి పొందిన అనుభూతిని, ఆ అనుభూతిమాధుర్యాన్ని సూచిస్తూ వుంది మలయమారుత మనోజ్ఞత్వం, ఆహ్లాద కారిత్వం ప్రస్తావితమైంది.

భావ కవి మనసును పులకరింప చేసి ఆనందాన్ని అనుభవింప చేసింది కేవలం మలయ మారుతమే కాదు. అల్లనల్లన వీచే పిల్ల తెమ్మెరలు, చిరుగాలి కెరటాలు కూడా భావకవి మనసును గిలిగింతలు పెట్టాయి. మధుమాసం రావటాన్ని వివరిస్తూ భావ కవి -

'విరి సరుల తోడు వలరుఁదెమ్మెరలతోడ
.... .... ....
అల్లనల్లన మధుమాస మరుదుదెంచె'30

అంటూ పిల్ల తెమ్మెరల ప్రస్తావన తీసుక వచ్చాడు. చిగురు కొమ్మలతోనూ, కోకిలలతోనూ, కమ్మ పుష్పాళ్ళతోనూ, తుమ్మెదలతోనూ, పూల గుత్తులతోనూ, పిల్లగాలులతోనూ నిత్యోత్సవంగా వచ్చే మధుమాసంలో తన సంతోషాన్ని వింగడించి చూపాడు.

మలయ మారుతాన్ని, పిల్ల తెమ్మెరలనూ ప్రస్తావించి అందులోని మాధుర్యాన్ని కూడా కవి వివరించాడు. వాటిని అనుభవించి ఆ అనుభవాన్ని తనదిగా మనకు పంచటం భావ కవి హృదయాన్ని ఆవిష్కరిస్తూ వుంది. చల్లగా వీచె పిల్ల తెమ్మెర మలయ మారుతాల చల్లదనాన్ని అనుభవించిన భావ కవి -

'ఎంత చక్కని గాలి, యెంత చల్లని గాలి!
ఎంత కాలం బాయె ఈ సౌఖ్యమునుగాంచి!
మైమరచి పోవలయు మంద మారుతములో'

అవి తాను అనుభవించిన సుఖాన్ని వివరిస్తూ మైమరచి పోయాడు. ఆ మైమరపులో భావ కవి హృదయం వ్యక్తమౌతూ ఆత్మాశ్రయత్వాన్నే ప్రకటిస్తూ వుంది.

జాబిల్లి - పండు వెన్నెల : సుమ సౌరభాలూ, తుమ్మెద ఝుంకారాలు భావ కవి మనసును సంతోష పరచినంతగా జాబిల్లి, పండు వెన్నెల అందలి కోమలత్వం, ఆహ్లాద కారిత్వం కూడా ఆనందాన్ని కలిగించాయి. దూది పింజల్లాంటి మబ్బుల వెనక దాగుతూ దోబూచు లాడుతూ మత్తుగొల్పే తెల్లని వెన్నెలల్ని వెదజల్లే చంద్రుడు భావ కవికి మిత్రుడు. రాత్రి నీలాకాశంలోకి చూసే భావ కవి హృదయం చంద్రుణ్ణి చూడగా పున్నమి నాటి కడలి వలె పొంగులు వారింది. ఆమనిమత్తులో చైతన్య వంతమైన లోకం ఆనంద పరవశమై వుండగా పొడవాటిలొద్దుగ కొమ్మల్లో, ఉయ్యాలలూగుతున్న చంద్రుడు భావ కవి మనసులో ఉయ్యాల లూగాడు.

'పొడవాటి లొద్దుగ కొమ్మలనూఁగెడి
పున్నమ చందురుడుయ్యేలలు;
ఆమని మత్తునచైతన్య లోకము
ఆనంద పరవశమై సొగియు'[32]

అవడం భావ కవి సంతోష అతిశయాన్నే ప్రకటించింది. అటువంటి సంతోషంలో భావ కవికి నిద్దుర రాలేదు. ఆ నిదుర లేని తనంలో ఎవో అస్పష్ట భావాలు

మదిలో గుబులుకుంటూ ఉండగా వాటిని అణుచుకోజూచాడు. కానీ లాభం లేక పోయింది. వెన్నెలవి చూడగానే అవి మళ్ళీ పాటల ప్రవాహంలా వెల్లుబికి వస్తు న్నాయి నిశాలోకనంలో. తెల్లగా నెలవంక తేలిపోతూ వుంటే మదిలోని భావాలు పొంగులు వారగా -

'తెల్లగా నెలివంక తేలి పోతోంది -
చల్లగా నా ఊహ
మెల్లగా భావాల
నల్లి బిల్లిగ పాట
అల్లుతో వుంది!
.. .. ..
అస్పష్ట భావాలు
అణచు కొన్నా గాని
పండు వెన్నెల జూచి
పాడుతున్నాయి'33

అంటూ తన హృదయంలో వెన్నెలని చూసి అణగారి వుందని భావాల్ని మన ముందు వుంచు తున్నాడు. అలా ఉంచటంలో వెన్నెల కలిగించే చల్లదనం అందు లోని హాయిని అనుభవించే భావ కవి హృదయం మనకు వ్యక్తమవుతూవుంది.

పిండార బోసిన వెన్నెల్లో విహరించడ మంటే భావ కవికి ఎంతో ఇష్టం. అందునా వెన్నెట్లో పడవ పయనమంటే ఇక చెప్పనవసరం లేదు. నిండు పున్న మిలో పడవలో ప్రేయసితో ప్రయాణం చేస్తూ వుంటే ఇక ఆ ఆనందానికి అవధులుండవు. అందుకే భావ కవి ఆ అవధుల్లేని సంతోషాంబుధిలో తేలియా డుతూ తన ప్రేయసితో -

'వెన్నెల్లలంటే పాట
కెంత మన స్రవుతాదో!
పాట సాగే తలికి
పట్టన మే మౌతాదో!

ఆపలేని యెంకి ఈ పడప యిసురు
పాడ లేనే యెంకి పదములీ రొదలో¹34

అంటూ పయనం సాగించాడు.

భావ కవి తెలి మబ్బు తెర చాటులో దాగి వున్న చంద్రుణ్ణి చూసి ముచ్చట పడడం. వెన్నెలని ఆస్వాదించటంలోనే కాకుండా ఆ వెన్నెల్లో ఒక అంశమై వుండి పోవాలని కాంక్షించి ఆ కాంక్షలో ఆనందాన్నే నింపుకొన్నాడు. ఆకాశం నీలి సరస్సులో నిండు వెన్నెలల్ని కురిపిస్తూ రాజ హంసవలె విహరిస్తూ వుంటే భావ కవిమనసు ఊగిన లాడింది. తన సహజ ప్రవృత్తితో ఆకాశంలో చంద్రునికి, మబ్బుకీ ప్రణయ భావాన్ని అంటగట్ట ఆరాటపడ్డాడు. అందుకే కోయిల నేస్తంతో -

'వెన్నెలల చంద్రుడెల్లెడ విరియజల్లి
వలపు కలిమిని మోమెల్ల చెలువు గుల్క
మోహమున మొగిలు కన్నియ మోము ముద్దు
గొనెడు చందము గాంచుమా కోకిలమ్మ"35

అంటూ తన సంతోషాన్ని తనమిత్రుడైన కోయిలతో పంచుకొంటున్నాడు భావకవి. నిండు నిండుజాబిల్లినీ, పండు వెన్నెలనూ అనుభవించిన భావ కవి హృదయానందానికి హద్దుల్లేకుండా పోయాయి. అటువంటి అవధుల్లేని ఆనందాతిశయంతో వెలికి వచ్చే తనరచనలకూ. చంద్రునికీ -

'ఎద కలశంబులో సుధల
నించుకయించుక జాలువార్చి యం
బుదముల వెండి దారుల న
భోంతర సీమల జల్ల చల్లగా
కదులుచు దేలువో రజని కాంతుడ!
నాదు పుషిత భావన
పదములు గూడ నీసిత శుభస్మిత
శీకర సేచితమ్ము లే¹'36

అంటూ అభేదం కూడా చెప్పటం జరిగింది భావ కవిత్వంలో. ఇలా చెప్పటం వల్ల కవి, వ్యక్తిత్వం ప్రకృతి అంశాలతో వివరించటమే కాకుండా కవి రచనల తీయందనమూ, చల్లదనమూ, అందులోని ఆనందమూ వివరించే అవకాశం కలిగి ఆత్మాశ్రయత ప్రదర్శితమైంది.

సాగర సంగీతం: భూమిపై వర్షించే వర్షాన్నంతా నింపుకొని ప్రవహించే సెలయేళ్ళు భావకవిని పరవళ్ళు తొక్కించాయి. కొండల్లోంచి దుమికే సెలయేళ్ళలోని మధురనాదాలు భావకవి మదిని గిలిగింతలు పెట్టాయి. అటువంటి సెలయేళ్ళు బయళ్ళలో మందంగా పరుగులు తీసి తమ ప్రియుడైన సముద్రుణ్ణి చేరుకొని అతని బిగి కౌగిలిలో సుఖించాయి. అంతటి సుఖాన్ని అనుభవించిన సముద్రం ఆకాశానికి ఎగిసి పడింది. నీల వర్ణం కలిగి లోతైన, గంభీరమైన సముద్రం అప్పుడప్పుడూ ఆకాశానికి ఎగిసి పడుతూ మధురమైన శబ్దాల్ని చేసింది. ఆ అలల విన్యాసాల్ని, జల తరంగాల్ని, సాగర సంగీతాన్ని విన్న భావకవి మనసు కదలిలా ఉప్పొంగి ఆ పొంగులోంచి వెలువడిన కవిత రంగులు పులుముకొని మరీ వెలికురికింది. రాత్రి నిశ్శబ్దంగా వుండగా సముద్ర ఘోష ఆకాశం త్రోవల్లో శబ్దం చేస్తూ వుండగా కవి ఏకాంతంలో సముద్ర నినాదంలోని అర్థాన్ని మాత్రం ఆలకిస్తూ వుండిపోయాడు. నిశ్చలమైన రాత్రిలో సముద్రం అలజడి భావకవి ఒంటరితనానికి ఆకర్షణీయంగా కనిపించింది. అందుకే ఆ సవ్వడులను వింటూ రాత్రి కూడా నిదురపోక అట్లే సాగర సంగీతంతో కాలం గడపాలని ఆశించాడు. కాబట్టే -

> "నిశి నిశ్శబ్దిత మున్నె, వార్నిధి మహా
> నిధ్వానముల్ మాత్ర మా
> కసపుం ద్రోవల మ్రోత పెట్టెడిని
>
> .... .... ....
>
> నా యెద మాత్రమంబుది నినా
> దార్థమ్ము లాలించెడిన్"37 అన్నాడు.

భావకవి పరమాత్మ చింతనతో మునిగి మధుర భక్తితత్వాన్ని నింపుకొని తన విభుని కోసం నిరీక్షిస్తూ వుండగా గాంభీర్యాన్ని నింపుకొన్న సముద్రం ఆనందాన్నే పంచింది. తన మేనూ, తన కన్నూ గప్పి ఇంద్రజాలం చేసి కనుమరుగై

వెళ్ళిన ప్రియుడు తన కంట బడకుండా ఎలా దాక్కోగలడు అని ప్రశ్నిస్తూ సముద్ర గర్భంలో దాగియున్న దివ్య దీపికలు ఎన్నో దీవిస్తూ వుండగా అన్వేషణ సాగించాడు భావకవి. సముద్ర గంభీరతతో దాగియున్న దివ్యమైన దీపికా కాంతితో ఆనందదగా, అనురాగంతో తన నాధుని మధుర భక్తి తత్వంతో వెదుక్కోవటంలో కూడా సముద్రం ఆహ్లాదాన్నే నింపింది భావకవి మదిలో. ఈ విషయాన్నే -

"గంభీర సాగర - గర్భంబునందు
దివ్య దీపికలెన్నో - దీపించుచుండ
... .... ....
నా మేను పులకించి - నా కన్నుఁగప్పి
యిందర్జాలముచేసి - యేగిన విభుడు
నా కంటఁ బడకుండ - నను జూడ కుండ
గొంటియై యెందుదాఁ - గునోః చూతుగాక"38

అంటూ తన ఆత్మాశ్రయత్వాన్నే ప్రకటించుకొన్నాడు.

భావకవి సముద్రంలో పడే వాన చినుకుల్ని చూసినప్పుడు కూడా ఆనందాన్నే అనుభవించి తన ఆనందాన్ని ఆత్మీయతతో ప్రతిబింబించాడు. అమృత మధురాలైనటువంటి వర్షపు చినుకులు సముద్రంలో లేస్తూ పడుతూన్న కెరటాలకు వెక్కిరింపు కలిగిస్తూ వుండగా, సమస్త ప్రకృతి ఆనంద వాహినిపై తేలూతూ వుందని వర్షంలో సముద్రాన్ని చూసి కవిపొందిన అనుభూతి, అనుభవ మాధుర్యాన్ని మనకందిస్తూ -

'అమృత మధురమ్ములైన వర్షాంబు కణము
లబ్ధి విలయోర్మికల కుపహార మొసఁగి
కలికి మెరుపు రాగమ్ము క్రిమ్ము కొనఁగ
ప్రకృతి ఆనంద వాహినిపైనిఁ దేలు'39

అంటూ తన సంతోషాన్నే కాకుండా ప్రకృతి పొందిన సంతోషాన్నికూడా భావకవి పొందు పరచడం ఆత్మాశ్రయత్వాన్నే కలిగివుంది. ఇక్కడ భావకవి ప్రకటించిన ఆత్మాశ్రయత్వం తన విషయాల్నే గాక ఇతర విషయాల్ని చెప్పటంలో కూడా వ్యక్తం చేయటం గమనార్హం.

కోయిలలు - వలపు కూజితాలు : ప్రకృతి తన పరమ రామణీయకతతో భావకవిని వశం చేసుకొంది. అటువంటి పరమ రామణీయకమైన అంశాల్లో భావకవిని ఇంకా వశపరచుకొన్నవి కోకిలలూ వాటి వలపు కూజితాలు. కొమ్మల్లో కూర్చొని చిగురాకును తింటూ గొంతు వగరెక్కగా ఆ వగరు మాధుర్యంతో కోకిలలు వింత పాటల్ని పాడాయి ఆ పాటలు, వాటి తీయదనమూ భావకవిని అహ్లాద పరిచాయి. ఆ పులకింతలలో భావకవి కోకిల పాటల్లోని ఆనందాన్ని, ప్రణయం ఒలికే మధుర భావాల్ని అర్థం చేసుకొని ఉక్కిరి బిక్కిరయ్యాడు. ఆ ఆనందంతో భావకవి కోకిలను ఇంకా పాడమంటూ -

'పాడవే, కోకిలా,
పాడవే, యింపుగా
ప్రాణముల్ హాయిచే
పరవశమ్మొందగా
పాట పాడవె తీయగా,
కోకిలా! పాట పాడవె తీయగా!'40

అన్నాడు. కూ అంటే అనే స్వభావం గల కోయిల ఇంకా ఇంకా కూసింది. ఆ కూత మలయ మారుతంలోని మృదు మధురమైన వీచికల్లోని మధుర రాగాన్ని నింపు కొనేలా వుండాలని భావకవి ఆశ. ఈ ఆశలో భావకవి హృదయ సుకుమారం భావకవి ఆత్మీయతా వుంది ఆత్మాశ్రయత్వాన్ని కలిగివుంది. ఈ విషయాన్నే భావకవి హృద్యంగా -

'మలయ మారుత మృదు - మధుర వీచికల
నమ్మాత వల్లిక నాట్య - మాడు చునుండె
మలయ మారుత మృదు - మధుర రాగమున
బాడవే కోకిలా - పాడవే పదము!'41 అన్నాడు.

భావకవి ప్రణయ మొలికే కోకిల స్వరాన్ని వింటున్నప్పుడు చెలి ఎడబాటు స్ఫురణకు వచ్చింది. చెలి దూరంగా వుండగా తన సహవాసమూ తన సందడి ఎవ్వరో అనుకొంటూ వుండగా మళ్ళీ కొమ్మల్లో కోయిల నేనంటూ కూసింది. అది కుహూ కుహూ రావాలు చేస్తూవుంటే భావకవి ఆనందాన్నే అనుభవించాడు. ఆ అనుభవాన్ని -

కొమ్మలో కోయిలా, 'కో' యంటదే
రాగ తనమో యేమొ, బాగువోగెరుగదే,
కొమ్మలో కోయిలా, 'కో' యంటదే।

తరిమి తరమేశాను
తిరిగి 'కోకో' యంది
ఆడిందె ఆటగా
పాడిందె పాటగా' 42

అని తన సంతోషంతో మిళితం చేశాడు. చెలి చేరువలో లేకపోయినా కోయిల గీతంలో సంతోషాన్ని తాను ఆడిందె ఆటగా పాడిందె పాటగా నింపుకొన్నాడు. భావికవి కోయిల కలస్వరంలో అవ్యక్త మాధుర్యాల్ని చవిచూశాడు. కాబట్టి పొరలు కూడా విప్పుకోని మొగ్గలు పరిమళాల్ని వెదజల్లుతూ వుండగా బాల భాష ల్లాగా అవ్యక్తమైనటువంటి మాధురీ పారళ్య సంప్రీణనం కుమ్మరించేదిగా, వల పింప జేసేదిగా మైమపరపించేదిగా కోయిల గొంతు వినిపించింది. ఆనందాన్ని నింపింది. ఆ ఆనందాన్నే భావకవి మనతోటి పంచుకొంటూ -

'పొరలు పగులని మొగ్గలు పరిమళింప,
బాల భాషల పగిది నవ్యక్త మాధు
రీ ధురీణ సారళ్య సంప్రీణమ్ము
క్రుమ్మరించెడు నీగీతి కోకిలంబ' 43 అన్నాడు.

భావకవి ప్రకృతిలోని విషయాల్లో కోయిల కల కూచితంలో సైతం తన మానసిక అవస్థను బట్టి ఆనందాన్ని నింపుకొన్నాడు. భావకవికి తాను సంతోషంతో వుంటే అన్నీ సంతోషంగా వున్నాయనిపించాయి. అలాగే కోయిల వలపు కూజి తాలు కూడా. ఆ వలపు కూజితాల్లో భావకవి ప్రణయ భావం ప్రకటితమై ఆత్మా శ్రయత్వాన్నే నింపుకొని వుంది.

మయూరం - నాట్యవిన్యాసం : భావకవికి కాల్పనిక ప్రపంచంతో పాటు వాస్త విక ప్రపంచమూ సంతోషాన్ని నింపింది. ప్రకృతి కాంత పొత్తిళ్లలో అణగి మణగి వుండి ఆనందోత్సాహాలతో కూనే కోయిలలు, పురివిప్పి నాట్యాలాడి ముద్దులు కురిపించే నెమళ్ళు భావకవిని ఆకట్టుకొన్నాయి.

మేఘావృతమైన ఆకాశాన్ని చూసినపుడు, మేఘం శబ్దాలు చేస్తూ వున్నపుడు నెమళ్ళు ఆనందంతో నాట్యాలు చేస్తాయి. ఆ నాట్యాన్ని చూసిన కవి హృదయం స్పందించింది. ఆనందంతో ఆ స్పందననికూడా భావకవి కవిత్వంలో బిగించాడు. ఆ బిగింపులో భావకవి ఆత్మీయతాముద్ర ముద్రితమైంది. వర్షంలో పురి విప్పుకొని నాట్యం చేస్తున్న మయూరాలు భావకవికి -

"స్ఫీత శబల బర్హాపుల్ల
చేతసములు"44

గా కనిపించాయి. వాటి ఆనందంతో పాటు భావకవీ ఆనందాన్ని నింపుకొన్నాడు. వాటి నాట్యవిన్యాసాలలో ఎన్నో నృత్య భంగిమల్ని తిలకించి పులకించాడు.

వర్షాగమంలో భావకవి తనను గురించి గాక తనలా బాధపడే పక్షి మనసుని అర్థం చేసుకొని వాటికి తనలాగే ఆనందాన్ని నింపమనడంలో కూడా కవి ఆత్మీయతే ప్రతిబింబిస్తూ ఆత్మాశ్రయత్వాన్ని కలిగివుంది. ఆడవికోనల్లో వర్షం కోసం వేచి వున్నటువంటి నెమలి కన్నెల కడుపుకోతల్ని మాన్పి, వాటి దాహాన్ని తీర్చి వాటికి చల్లని వెన్నెలలు కురిపించామంటూ భావకవి -

"అడవి కోనలలోన నీకై
యెదరు వేచిన నెమలి కన్నెల
కడుపు కోతల మాన్పి, దాహము
లుడిపి పఱపుము చల్లవెన్నెలః"45

అంటూన్నాడు. ఇలా అనడం నిస్వార్థంతో కాదు, కొంత స్వార్థంతోనే. మయురాలు సంతోషంగా వుంటే తనూ సంతోషాన్ని నింపుకోవచ్చన్న భావంతో భావకవి ఇక్కడ తనమనోగత భావాల్ని వ్యక్తం చేయటం ఆత్మాశ్రయత్వంతోనే.

వర్షం - వసంతరాగం : భావకవి ప్రకృతిలోని మధురమైన విషయాల్ని వివరించటంతోనే ఎక్కువ కాలం గడిపాడు. తనకు నచ్చిన విషయాల్ని తనవైన భావాలతో ఆవిష్కరించాడు. ప్రకృతిలోని చెట్లు చేమలూ, పక్షులు, సముద్రం, ఆకాశం వీటన్నిటితోపాటు వాటిని అంటిపెట్టుకొన్న ఋతుచక్రం కూడా భావకవి రచనల్లో ఆంతరంగిక మిత్రత్వాన్ని ప్రకటించింది. ఋతువుల్నిబట్టే ప్రకృతి మారుతుంది కాబట్టి భావకవికి ప్రకృతిలో మార్పుల్ని తీసుకవచ్చే ఋతువులు కూడా ఆకర్షితాలయ్యాయి.

ఋతురాగంలోవున్న ఆరుఋతువుల్లోనూ వసంతమే భావకవిని ఎక్కువ ఆకర్షించింది. అందుకే ఆతని కవితా గానంతో వసంత ఋతువు, వర్షం అధికంగా కనిపిస్తాయి. వర్షం లేక పోతే వసంతం లేదు. కాబట్టే వర్షం, వసంతం భావకవి హృదయంలో గూడుకట్టుకొని వెల్లివిరిశాయి.

దట్టమైన మబ్బులతో నిండిన ఆకాశం అన్నా, ఆకాశంలో తళుక్కువ మెరిసే మెరుపన్నా, ఇంద్రధనుస్సన్నా, వర్షపు చినుకన్నా. భావకవికు ఇష్టం. జడిగా, కుండపోతగా వర్షం కురిస్తే మరీ సంబరపడిపోతాడు. సుకుమార హృదయం అమాయక ప్రవృత్తి భావ కవికి బాల్య చాపల్యాన్ని ప్రసాదించి, ఆ బాల్యచాపల్యంతో భావ కవి చిటపట కురిసే చినుకుల్లో, ఋసబుస పొంగే నురగల్లో, జలజలపారే వాగుల్లో ఉత్సాహంతో గంతులేశాడు. ఆనందాన్ని మనల్నీ పంచుకోమంటూ -

'రసిక హృదయము లోలలాడే
　　మసుపు దినములు వరలివచ్చెను,
మిసిమి మబ్బులు ప్రేలుమేలిమి
　　ముసుగుతోనాకసము విచ్చెను!
.... .... ... .... .... .... ....
ఉరుము లురిమెడి గర్జనమ్ముల
　　మెరుపు తీవలమేలవింపుము
మురిసియాడెడు వాద చినుకుల
　　సరసగానము లాలకింపు'46

అన్నాడు.

వసంతం వర్షం కన్నా భావకవిని అధికంగా ఆనందింపజేసింది, ఋతురాజమైన వసంతం వికసించిన పువ్వులతోనూ, కోయిలల పరువపు రాగాలతోనూ కన్నుల పండువుగా వుంటే భావ కవి సంతోషాతిశయాన్ని పొందాడు. సకల సౌభాగ్యాల్ని తీసుకవచ్చే వసంతానికి స్వాగతం పలుకుతూ -

'మోరడు మ్రాకులఁ జిగురాకు మొలవఁజేసి
మూక కోకిలఁగలకంఠముగ నొనర్చి

సుప్రసన్న ప్రభాత విస్ఫూర్తితోడ
సుమధుర విహంగ కలకూజితములతోడ
సురుచిరారామవరలతాతరులతోడ
సురభికోత్ఫుల్ల కుసుమమంజీరాలతోడ
సరసి జీమోద కాసార సమితితోడ
సలలితశ్యామశాద్యలస్థలులతోడ
సదమలాశాచిశావకాశములతోడ
సకలజీవోత్సవంబుగా స్వర్గమట్టు
అవనినలరించు నివ్వసంతాంకమున'47

మనసు ఊరికే వుంటుందా? అని ప్రశ్నిస్తున్నాడు భావకవి. మలయమారుతాలతో, పూల గుత్తులతో, జంజుమ్మంటూ విహారం సల్పే తేటి సమూహంతో, సుమధుర మనోజ్ఞమైన వసంతలోని తీయధనాన్ని భావకవి ఆస్వాదించి ఆ ఆస్వాదనామధుర్యాన్ని మనముందుంచాడు.

పుడమి యవ్వనంతో మురిసిపోయేట్లు నూతన కాశ్మీర రుచులు వెదజల్లగా కొమ్మకొమ్మనా, ఆకు ఆకునా, చివురు చివురునా వసంతం అందగిస్తూ వుంటే భావకవి హృదయమూ కుసుమించింది. ఆ కుసుమ పరాగాల్ని వెదజల్లుతూ భావకవి -

'తరుణ కుసుమ శిఖాసూత్రధారితగుచు
ముదురు లేతల భేదములొదవ నీక
నిఖిల తరుజగతికిని సింధించినావు
సహృదయరాగ రంజినమంటూ'48

వసంత వికాసాన్ని కొనియాడాడు.

భావకవి ప్రకృతిని చూసి సంతోషాన్నేగాదు ఆత్మాశ్రయధోరణిలో ప్రకటించింది తాను దుఃఖాన్ని అనుభవించినపుడు. ప్రకృతిలోకి పరుగెత్తి ఓదార్పు పొందినపుడు కూడా ఆత్మాశ్రయరీతినే ఆశ్రయించి తన భావాల్ని ప్రకటించాడు. అంతేకాదు ప్రకృతికి బాధకలిగినా తను బాధపడిపోతూ తన బాధను ఆత్మాశ్రయ ధోరణిలోనే వెల్లడించుకొన్నాడు వెర్రిగా.

ప్రేమ వైఫల్యం పొంది భగ్నహృదయంతో ఒంటరితనాన్ని అనుభవిస్తూ సతమతమవుతున్న భావకవి హృదయానికి ప్రకృతే ఆశ్రయమిచ్చేదిగా, ఓదార్చేదిగా కనిపించింది. అందువల్ల భావకవి బాధల్ని మరిచి ప్రకృతి సౌందర్యంలో లీనం కావాలనుకొని సంఘాన్ని బహిష్కరించి తన సుఖాన్ని చూసుకొన్నాడు. కష్టాల్లో వున్న భావకవి -

'మొక్కిన కొలందిఁ గాలితోఁద్రొక్కుచున్న
యీ కఠిన లోకమెల్ల బహిష్కృతమ్ము:
రండుచిమ్మటలార! ఈ రాత్రివేళ
వావలెనె పాడుకొను మీరె నాకు సఖులు'49

అంటూ తనలాగే ప్రకృతి రోదిస్తూందనుకొన్నాడు. అణగి మునిగి వుండే కొద్దీ ఇంకా అణగత్రొక్కాలని చూసే లోకాన్ని వెలివేసిన కవికి రాత్రివేళ చిమ్మటల పాటలు బాధాగ్రథిత స్వరాలయ్యాయి. ఆ స్వరాల్ని వినిపిస్తున్న చిమ్మటలు తన వంటివే అని వాటిని సఖులుగా భావించి బాధోపశమనాన్ని పొందాడు.

సంఘాన్ని వదిలివేసిన కవికి ప్రకృతి అంశాలు మిత్రతుల్యమయ్యాయి. బాధల్లో ముంచే ఈ లోకాన్ని మరచిపోవడానికి భావకవి ప్రకృతిలో లీనం కావాలనుకొన్నాడు. అందుకే -

'ఆకులో ఆకునై పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై నునులేత రెమ్మనై
ఈ యడవి దాగిపోనా?
ఎట్లైన
నిచటనే యాగిపోనా?
గలగలమని వీచు చిరుగాలిలో కెరటమై
జలజలని పారుసెలపాటలో తేటనై
ఈ యడవి దాగి పోనా?50

అంటూ అడివిలో ఆకలీ, దాహం, వంతా చింతా లేకుండా వుండిపోవాలని తాపత్రయపడ్డాడు. ఆ తాపత్రయంలో కవి మనోవృత్తి ప్రదర్శింప బడింది. సుకుమార హృదయం గలవాడైన భావకవి తన చుట్టూ బాధలుండటం గమనించి అవి

మానవ మాత్రులు తీర్చలేనివని గ్రహించాడు. అందుకే సౌందర్యాకాంక్షతో ప్రకృతివైపు మళ్ళాడు. ప్రకృతిలోని సౌందర్యానికి, కోమలతత్వానికి, ఓదార్పే గుణానికి సంతుష్టి చెంది అందులో మునిగిపోయి ప్రకృతిలో అంతర్లీనమై తన బాధలకు, తనని బాధపెట్టే లోకానికి దూరంగా వుండి సంతోషాన్ని అనుభవించా లనుకొన్న ఆత్మాగతభావాల్ని వెలిబుచ్చాడు.

దుఃఖ భారంతో అడవిలోకి వెళ్ళి దాక్కున్న భావకవికి ఊరట కలిగినా మళ్ళీ ప్రకృతి గతమైన అంశాలే భాధను కలిగించాయి. కొమ్మపైన కూర్చొన్న కోయిలలు వలపు జల్లుల్లో తడుస్తూ గొంతుకలు సవరించాయి. ఆ సవరింపుల్లో వాటి ప్రేమ భావాలు ప్రకటితమయ్యాయి. ప్రకృతి జన్యాలూ, పరమరమ్యాలూ అయిన భావాలతో కోకిలలు ప్రణయ మొల్కలా పలకరించుకొంటుంటే భావకవి మనసు కలుక్కుమంది. చీకూ చింతా లేని కోకిలలు వలపుకూజితాలు కవి మన సుని బాధించాయి. కానీ భావకవి తన ప్రేయసిని, తన ప్రేమకు అడ్డుపడ్డ సం ఘాన్ని విధిని మరచిపోవడం కోసం -

'పాడవే కోకిలా!
పాడవే యింపుగా!
ప్రాణముల్ హాయిచే
పరవశమ్మొందగా!'51

అంటూ కోయిలల గాన మాధుర్యంలోకి జారిపోయాడు. ఇక్కడకూడా కవిమాన సిక సంక్షోభమే వ్యక్తం చేయబడి తిరిగి ప్రకృతి గతమైన కోయిల స్వరంలోని గానమాధుర్యంతో ఊరటచేందటం వివరింపబడి ప్రకృతితోటి సంబంధంలో భావ కవి ఆత్మాశ్రియధోరణి ప్రకటితమయ్యింది

కొమ్మ చిగురించినా, పూలుపుష్పించినా, కోయిల గొంతుక సవరించుకొన్నా తనకోసమే అని భావించిన భావకవి వినీలాకాశంలో పాలపుంతని వెదజల్లుతూ విరబూసిన పున్నమి కూడా తనదే అనుకొన్నాడు. ఆ పున్నమి కవికోసం ఒక "కుమారిక" ను తెచ్చింది. మళ్ళీ ఆమెలేకుండా ఒక్కటే వచ్చింది పూర్ణిమ. అప్పుడు కవి పున్నమి వెలుతురును చూసి సంతోషించక వెర్రియై పున్నమితో తన భాదను ప్రకటించుకొన్నాడు. ఎడతెరిపిలేకుండా వెన్నెలను కురిపిస్తున్న పుష్య పూర్ణిమను చూస్తూ భావకవి -

"వచ్చుచు నుంతు ముందు
ననివార్య విధంబున పూర్ణిమానిశల్
ముచ్చటమీర లోకము ప్రమోదము నొందు
యథావిధంబుగన్. అచ్చపు మోదసారమను
నావెం గతించుట చేత చంద్రికల్ చిచ్చులమాక్కి
నాహృదయ సీమ దహియించుచునుండునే కదా!'52

అని బాధపడ్డాడు. వెన్నెల ఆహ్లాదకరమైందే అయినా ప్రేయసి వియోగంతో బాధ పడుతున్న కవికి ఆమె లేని ఒంటరితనం తనని పిండుతుండగా వెన్నెల వేడి తన హృదయ సీమల్ని దహిస్తున్నట్లనిపించింది. సృష్టి యావత్తు పుష్యపూర్ణిమ వెన్నెల వెల్లువలో మోద భోగ్యమై వుండగా భావకవి హృదయం మాత్రం దుఃఖాగ్నిలో కాలుతూ విమలపూర్ణిమ నాశ్రయించి కొంతకు కొంత ఊరటపొందింది. భావకవిత్వంలో స్వకీయమైన ప్రణయ భావాల్ని ప్రకటించుకోవటం వల్ల వస్తుగతంగా వ్యక్తమైన వెన్నెల వంటి ప్రకృతి అంశాలు కూడా కవి వ్యక్తిత్వంలో ఆత్మాశ్రయంగా ఊరటకలిగించేవిగా వెలువడ్డాయి.

దారుణమైన జీవితపు ఎడారిలో తీరని పిపాసతో దారీతెన్నూ లేక గాలి లాగా సంచరిస్తూ వున్న భావ కవికి లోకం ఓదార్పు కలిగించకపోగా ప్రకృతి కూడా అదేస్థితిలో కనిపించింది. అటువంటి స్థితిలో తాను ఆశ్రయించిన ప్రకృతి సయితం భయపెట్టగా ఏడుస్తూనే బ్రతుకు గడపాలని నిశ్చయించుకొన్నాడు భావకవి-

"ఏ కడల మిన్కుమను చుక్కయేనిలేని
యానభము క్రుంగి కూలిపోయెడి విధాన
కారుమబ్బులె కాదు, చీకటులెకాదు,
క్రమ్ముకొననిమ్ము, కరడుగట్టనిమ్ము"53

అని అంటూ తనకు హృదయం వుండేంతవరకు తాను ఆశ్రయించిన ప్రకృతి కూడా తనను చిన్నచూపు చూసినా భయపడకుండా దుఃఖభారంతో ఆత్మస్థైర్యంతో బ్రతుకు సాగించాలనుకొన్నాడు.

భావకవి ప్రకృతిని చూసి సంతోసాన్ని అనుభవించినపుడు. కవి మానసిక వ్యథకు గురైనపుడు, లోక నిరాశానిస్పృహల్ని వెదజల్లినపుడు, జీవితం

వ్యథాసంభరితమైనప్పుడు ప్రకృతిలోకి పరుగులెత్తడం, ఓదార్పు పొందటం లోని ఆత్మాశ్రయత్వాన్ని గురించి ఇంతవరకు చర్చించడం. ఇక ప్రకృతికి కష్టం కలిగినపుడు ఆ కష్టం తనదిగా భావించి బాధపడటం లోని ఆత్మాశ్రయత్వాన్ని వివరిస్తాను.

భావ కవి ప్రకృతి గత అంశాల్ని ప్రేమిస్తూ ప్రకృతికీ తనకూ విడదీయ లేని సంబంధాన్ని ఏర్పరచుకొన్నాడు. కాబట్టి ప్రకృతిగతమైన అంశాల్ని తల్లిగాను, ఇల్లాలిగానూ, స్నేహితునిగానూ, నెచ్చెలిగానూ, దైవంగానూ, భావించి ఆరాధించటా నికి అలవాటు పడ్డాడు. ఆ ఆరాధనాతత్వంలో మునిగిన భావకవికి తన చుట్టూవున్న, తనకు ఆత్మీయమైన ప్రకృతిలో చీమ చిటుక్కుమన్నా బాధామయంగా తోచింది. ప్రకృతికి ఏదైనా ఆపద సంభవిస్తే తనకు ఆపద కలిగినట్లు బాధపడ్డాడు. ఆ ఆప ద వల్ల ప్రకృతికి కలిగే బాధని తన బాధగా స్వీకరించి వదన పడ్డాడు.

కొమ్మల్లో లేత చిగురుల్ని మేస్తూ ఓగరూ పొగరూ నిండిన గొంతుకతో కూ యని కూసే కోకిలకు సంభవించబోయే ఆపదను ఊహించిన కవి బాధతో కోయిలను హెచ్చరిక చేశాడు. ఆ హెచ్చరికలో బాధామిశ్రితమైన కవి హృదయం కనిపిస్తూ వుండి, ఆత్మాశ్రయత్వాన్ని వ్యక్తం చేసింది. గానమాధుర్యాన్ని ఒలి కించే వారికి ప్రాణాలు సైతం లెక్కలేదేమో అన్న ద్యాసలో కోయిల మధుర గానం చేస్తూ వుందేమో అనుకొంటూ భావకవి -

'పెన్నకన్నను మృదువగు కొన్ననలను
మెక్కి కొమ్మని గున్నపై నెక్కి పంచ
మ స్వరంబున నవ్యక్తమధుర గాన
మును వానఁ్రెదు, కోకిలా! వెనుదిరిగి
చేరువనేయున్న హాని వీక్షింపవేమి?

........ ........ ........

గానలోలత్వమునఁ బ్రాణమైన విడువ
దలతువా యేమి? గాన ప్రియులకు దేశ
కాలములు లేనిమాట నిక్కమ్ము సేసి'54 అన్నాడు.

ఇలా అనటంలో కోకిల గాన మాధుర్యాన్ని కొనియాడటంతో బాటు దానికి సంభ వించబోయే ఆపదని కూడా వెల్లడిచేస్తూ తన బాధని ప్రకటించాడు. మాధుర్యం

ఒలికించే కోయిలకు కలిగే బాధని కవి తనదిగా గ్రహించి బాధపడ్డాడు. బోయ వాడు కోకిల వెనుక దాగి వింటిదెబ్బతో కోయిలను కూల్చదాలికి ప్రయత్నంచేస్తూ వుండగా కవి ఆ హానిని కోకిలకు తెలుపుతూ, తన భావాల్ని ఇక్కడ ఆత్మాశ్రయ ధోరణిలో ప్రకటించాడు.

ఇలాగే ప్రకృతి సహజమైన చంద్రగ్రహణాన్ని చూడబోతూ భావకవి చంద్రునికి జరగబోయే ఆపదని తలచుకొని చంద్రునికే హెచ్చరికచేస్తూ -

"మంచిరోజు కాదోయి, చందమామా
మంచిదారి కాదోయి చందమామా
ఇంద్రధనసు విమానాన
చందమామ యెచటికంత
తొందరగాఁ బొయ్యేవోయ్,
ముందుకీడు తెలియదేమొ?'55

అని ప్రశ్నించాడు. అంతటితో ఆగక చంద్రుని అమాయకుడైన భావకవి ఏమో అన్న భావంతో 'కవిలా గున్నావు' అంటూ ముందూ వెనకా ఆలోచించకుండా త్వరపడుతున్నావన్నాడు. చంద్రుని భావకవి తనతోనే పోల్చుకోవటంలో కొంత ఆత్మాశ్రయత్వమే ఉంది. ప్రకృతి సైతం చంద్రునికి కలగబోయే ఆపదకు మౌనం వహించిందని భావించిన భావకవి చందమామను అసలు రానేవద్దు అంటూ -

'రాబోకు రాబోకురా చందమామా!
రాహువు పొంచున్నాడురా తోవలోన!
ఆకొక్కటైనాను
అల్లాడకున్నాది
మబ్బుల్ల పైనేదో
మాయకప్పేసింది ॥రాబోకు॥

తెల్లవ్వి నీకాంతి
నల్లనయ్యేనురా!
చల్లవ్వి నీమోము
సన్నగిల్లేనురా! ॥రాబోకు॥

పరమ రాకాసిరా
పాపిష్టి రాహువు
మిత్త్రిలా నినుబట్టి
మింగబొయ్యేనురా! 56        ॥రాబోకు॥

అని అన్నాడు. ప్రకృతి సహజమైన భాధగొలిపే ప్రతి కదలికకు భావకవి చలించి పోవటం, బాధపడటం ఇక్కడ చెప్పటం జరిగింది. ఇటువంటి స్థితి కవి సుకుమార మనస్తత్వాన్ని, అమాయకత్వాన్ని ప్రకటిస్తూ ఆత్మాశ్రయత్వాన్ని కలిగివుంది.

భావకవి సుఖదుఃఖాత్మకమైన విషయాలకు మాత్రమే ప్రకృతిని ఆశ్రయించి ఆత్మాశ్రయ ధోరణుల్ని వ్యక్తం చెయ్యటమే కాకుండా పూర్వజన్మ వాసనల్ని, పరమాత్మ తత్త్వాన్ని ప్రకృతికి ఆపాదించటంలో కూడా ఆత్మాశ్రయత్వాన్నే ప్రకటించాడు.

'దారిక్రోవల క్షేమ దనరారు గటిక
యెంత పెత్తందనమెంతటి ప్రోది
యెంత క్రొత్తందనమిగురొత్త నీవు
మొన్నగాఁ గురిసిన ముత్యాల జడ్డికి
మురిపాల గుబురువై పెరుగుచున్నావె?
.... .... ... .... .... .... .... .... .... ....
.... .... .... .... .... .... .... .... .... ....
ఏను నీవై తివో యెవ్వరిక్కిఁదెలియు
ముందు గతించిన పుట్టువులందు
ఈవు నేనౌదునో యెవరెఱుంగుదురు
రాబోవు జన్మాలరాక పోకలకు" 57

అని గటిక మొలకెత్తటం చూసి సంతోష పడుతూ ముందు వెనుకటి జన్మల్లో ఇద్దరూ దైవ సృష్టిలో ఒకటే అవుతారమో అని భావించాడు. ఇక్కడ కవి ప్రకృతికి తనకు అభేదాన్ని ప్రకటించుకొంటున్నాడు. దైవ సృష్టిలోనే కాక భావకవి దృష్టిలో కూడా తనూ, గడ్డిపరకా ఒకే అంశాలు అన్న తాత్త్వికదృక్పథాన్ని ఆత్మాశ్రయ రీతిలో వెల్లడించుకొన్నాడు.

భావకవి దృష్టిలో ప్రకృతిగతమైన అంశాలకు తనకు ఎలా తేడా లేదో అలాగే ప్రకృతి అంశాలకు భగవంతునికీ కూడా తేడా లేదన్న భావమే పొడ చూపింది. సృష్టిలోని ప్రతి అణువులోనూ కాల్పనిక కవుల్లాగా భగవంతుని స్వరూపాన్ని దర్శించటం భావకవిత్వం అయింది. ఆ తత్వం కూడా ఆత్మాశ్రయంగానే వెలికి వచ్చింది.

'సుఖము ఫాలమునందు వ్రాసుకుని యెవరు
పుట్టిరో వారికి వసంతముసుమనోజ్ఞ
మైనగానిమ్ము 'నాకునీవన్న' మేను
జలధరించుము ఓయి ఆషాఢ జలద!
నిను మదీయ గిరాంవీధి విలిపి శైవ
సాంధ్య తాండవ నూపుర స్వనము లొలుక జేసితిని'[58]

అని ఆషాఢ మేఘాల్ని మనసులో ఉంచుకొని శివుని తాండవ నూపుర స్వనంగా దాని శబ్దాన్ని భావించాడు. ఇక్కడ ప్రకృతి గతమైన అంశాల్లోకి భావకవి అంతర్ముఖుడై పరమాత్మ తత్వాన్ని దర్శించి ఆ దర్శించిన సౌభాగ్యాన్ని ఆత్మాశ్రయ ధోరణిలో ప్రకటించటం ద్యోతకమౌతూవుంది

ప్రణయం - ఆత్మాశ్రయత్వం : భావకవిత్వం అంతా ముఖ్యంగా ప్రణయ భావనామయంగానే సాగింది. భావకవిత్వం అంటే ప్రణయ కవిత్వం అని అనిపించేలా భావి కవిత్వంలో ప్రణయం గూడుకట్టుకొంది. దేవతల శృంగారాంశాల్నీ, రాజుల ప్రణయ సంఘటనల్నీ, చారిత్రకవ్యక్తుల ప్రేమ కథల్నీ ఆలవాలంగా తీసుకొని అలరారిన ప్రాచీన కవిత్వమంతా వస్త్వాశ్రియంగానే వెలువడింది.

కాల్పనిక కవుల సంప్రదాయానుసారం వెలువడిన భావకవిత్వంలో ప్రణయం ఆత్మాశ్రియంగా సాగింది. పాశ్చాత్య కవుల ప్రేమతత్వం, ఊహాప్రేయసీ సృష్టి, పలాయనవాదం, విషాద మాధురి మొదలైన అంశాలు ప్రణయ కవిత్వంలో నూతనంగా పొడచూపాయి. అందువల్ల భావకవిత్వంలో ప్రణయం కొత్త పుంతలు తొక్కుతూ ఆత్మాశ్రియత్వంలో వెలువడింది.

అట్లని భావ కవిత్వంలోని ప్రణయమంతా ఆత్మాశ్రయ పద్ధతిలో కానసాగిందని చెప్పడానికి వీల్లేదు. ప్రాచీన కావ్య పద్ధతుల్ని అనుసరిస్తూ రాయపోలు,

అబ్బూరి, దువ్వూరి, వెంకట పార్వతీశ్వరుల వంటి భావకవులు ప్రణయ కవిత్వాన్ని వస్త్వాశ్రియ పద్ధతిలోనూ రచించారు. అందువల్ల భావకవిత్వంలో ప్రణయం కొంత వస్త్వాశ్రియంగానూ మరికొంత ఆత్మాశ్రయంగానూ కొనసాగినట్లు కని పిస్తుంది.

ముందుగా ప్రాచీన కవితా పద్ధతుల్ని ఆశ్రయించి వస్త్వాశ్రియంగా వెలు వడిన ప్రణయ కవిత్వాన్ని గూర్చి ప్రస్తావించి అటు తరువాత ఆత్మాశ్రయ పద్ధ తుల్లో వెలికుబికిన ప్రణయ కవిత్వాన్ని గూర్చి విపులీకరిస్తాను.

భావకవిత్వంలో వస్తువుకు ప్రాధాన్యత లేదు. అంత మాత్రాన భావకవిత్వం అంతా వస్తు రహితంకాదు. రాయప్రోలు వారి తృణకంకణంలో కవి అభిప్రా యాలే పాత్రల ముఖంగా వ్యక్తమయ్యాయి అందులో ఒక చిన్న కథ, రెండు పాత్రలున్నాయి. దాన్ని కేవలం ఆత్మాశ్రయకావ్యం అనడానికి వీల్లేదు. కాబట్టి భావకవిత్వంలో వస్త్వాశ్రియ రీతికి చెందిన కావ్యంగా దాన్ని పేర్కొనవచ్చు' అన్న నారాయణరెడ్డి అభిప్రాయం ప్రకారం రెండుమూడు పాత్రలుండి, ప్రణయేతి వృత్త ప్రధానమైన భావకవిత్వం వస్త్వాశ్రయ రీతిలో నడచిన కవిత్వం అని చెప్పవచ్చు.

ఇక్కడ ఇంకో విషయంకూడా గుర్తించాలి. తృణకంకణంలో కవి అభి ప్రాయాలే పాత్రల ముఖంగా బహిర్గతమయ్యాయి. అనటంచేత ఇక్కడ ఆత్మా శ్రయత్వం చోటుచేసుకొంది అని అనుకోడానికి అవకాశంలేదు. కారణం కవి స్వీయానుభూతులు కాక కవి అభిప్రాయాలు మాత్రమే ఇక్కడ పాత్రలముఖంగా చెప్పటం వల్ల వస్త్వాశ్రయ పద్ధతే ఇక్కడ కనిపిస్తుంది. కవి స్వీయానుభూతు లకు, అభిప్రాయాలకు చాలా వ్యత్యాసంవుంది. కవి అమలిన శృంగారాన్ని తన ప్రణయ కవిత్వంలో ఇవర పాత్రల ద్వారా వ్యక్తం చేయ్యటం తన అభిప్రాయాల్ని ప్రకటించుకోటం కోసమే. ప్రణయానికి, ప్రేమకు సంబంధించిన కవి అను భూతులు కవి అభిప్రాయాలకంటే భిన్నంగా వుండి ప్రకటితమైనపుడు ఆత్మాశ్రయ త్వాన్ని కలిగి వుంటాయి. అంటే కవి అభిప్రాయాలు వేరు. అనుభవాలు, అను భూతులు వేరు. కవి అనుభవాలు అనుభూతులు కూడా పాత్రల ముఖంగా కాక కవి తనకుతానే వెర్రిగా ప్రకటించుకొన్నప్పుడు అవి ఆత్మాశ్రియాలౌతాయి.

భావకవిత్వంలో ప్రణయేతి వృత్తాలు కలిగిన రచనల్లో రాయప్రోలు వారి 'తృణకంకణం' 'కష్టకమల' 'స్వప్నకుమారము', 'అబ్బూరి వారి మల్లికాంబ', వెంకటపార్వతీశ్వరుల 'జలమాలిక'. దువ్వూరి రామిరెడ్డి 'కడపటి వీడ్కోలు', కాళ్ళకూరి గోపాలరావు 'స్నానఘట్టము', విశ్వనాథ సత్యనారాయణ 'కిన్నెరసాని పాటలు', 'కోకిలమ్మ పెళ్ళి' వంటి రచనలు వస్త్వాశ్రియ ధోరణిలో నడిచాయి. ఇవన్నీ తృణకంకణంలోలాగే చిన్నచిన్న ఇతి వృత్తాలతోను, రెండుమూడు పాత్రల ప్రాముఖ్యంతోనూ వస్త్వాశ్రయంగా కొనసాగాయి.

తృణకంకణంలో ఒకనాటి ప్రేయసీ ప్రియులు తిరిగి కలుసుకొన్న తరువాత ప్రేయసికి వివాహమైన సంగతి ప్రియుడు తెలుసుకొని అప్పుడే రచించిన తృణకంకణాన్ని ఆమె చేతికి తొడిగి తమ స్నేహం కలయిక లేకుండానే అపూర్వమైందని చెప్పి 'సొదరీ' అని సంబోధించి వీడ్కోలు చెప్తాడు. ఆమెకూడా వలపు టుంగరాన్ని అతని వ్రేలికి తొడిగి తమ ప్రేమశాశ్వతమైందని, మరువరానిదని చెప్పివిడిపోతుంది. ఇక్కడ ప్రేయసీ ప్రియులు రెండు పాత్రలుగా, వారి పవిత్రమైన ప్రణయ వృత్తాంతమే ఇతి వృత్తంగా తీసుకొని రాయప్రోలు వస్త్వాశ్రయ కావ్యంగా దీనిని తీర్చిదిద్దారు

'కష్టకమల'లో కూడా రెండుమూడు పాత్రలతో చిన్న కథతో కావ్యం రూపు సంతరించుకొంది. కమల, పూర్ణ, కుమారులు అనువారి మధ్య ఇతివృత్తం పెంపొందింది. కమల, కుమారులు చిన్నప్పటినుంచీ స్నేహితులు. కుమారుడు విద్యాభ్యాసం కోసం పట్టణానికి వెళ్ళి కమలపై స్నేహభావాన్ని ప్రేమగా మార్చుకొని ఆమెకు ఉత్తరం వ్రాయగా ఆశ్చర్యపడుతుంది. ఉయ్యాల ఊగుతూ దైవవశాత్తు కమల మరణిస్తుంది. ఇక్కడ సోదర సోదరీ భావం వున్నచోట ప్రణయం పనికిరాదను విషయాన్ని చెప్పడానికి ఈ ఇతివృత్తాన్ని రాయప్రోలు వారు స్వీకరించారు. ఈ రచన వస్త్వాశ్రయంగానే కొనసాగినట్లు స్పష్టం.

'స్వప్నకుమారము' ప్రణయేతి వృత్త ప్రాధన్యమే అయినా ఇందులో స్వప్నవృత్తాంతము వివరింపబడి వస్త్వాశ్రియతని కలిగివుంది. ఒక యువకుడు రాత్రి స్వప్నంలో కనిపించిన సుందరిని చూసి మోహించి తన మోహాన్ని వ్యక్తం చేస్తాడు. ఆ సుందరి అతనికి మధుపాత్రి నందిస్తుంది. అయినా యువకుడు సంతృప్తి చెందడు. మళ్ళీ మోహభావాన్ని ప్రకటించగా సుందరి అతనికి పరిశుద్ధమైన ప్రేమ సిద్ధాంతాన్ని వివరిస్తుంది.

ఇలాగే అబ్బూరి వారి 'మల్లికాంబ'లో కూడా ఇతివృత్త నిర్వహణమేవుండి వస్త్వాశ్రియతే కన్పిస్తుంది. వివాహితయైన మల్లిక దగ్గర కమల తన ప్రియుని దగ్గర నుంచి వచ్చే ఉత్తరాలను దాస్తూ వుంటుంది. అవి మల్లిక భర్త కంట బడతాయి అతడు వాటిని తన భార్యకే వ్రాసినవని భ్రమించి ఆమె మరణానికి కారకుడౌతాడు తరువాత వాస్తవాన్నెరిగి బాధపడతాడు. ఇక్కడ కూడా మూడు పాత్రలతో, ఒక చిన్న కథతో ప్రణయ ప్రధానంగా కావ్యం తీర్చబడిద్దబడి వస్త్వాశ్రయతనే కలిగివుంది.

వెంకట పార్వతీశ్వరులు 'జలజమాలిక'లో సాహసియైన యువకునికి తమ కుమార్తెనిచ్చి వివాహం చేయకూడదని భావించి అన్నపూర్ణను ఆమె తల్లిదండ్రులు పేరొకరినికిచ్చి వివాహం చేయడానికి నిశ్చయం చేస్తారు. ఆ సంబంధం కుదరదు. తరువాత అన్నపూర్ణను ముందటి ప్రియుడైన చంద్రశేఖరునికి ఇవ్వడానికి ప్రయత్నించగా అతని తండ్రి యిష్టపడడు. చివరకు అన్నపూర్ణమరణిస్తుంది. ఇలా 'జలజమాలిక' కూడా కొన్ని పాత్రలతోచిన్న ఇతి వృత్తంతో ప్రేయసీప్రియుల వివాహ విషయం ప్రస్తావితమై వస్త్వాశ్రియంగానే కన్పిస్తుంది.

కాళ్ళకూరి గోపాలరావు 'స్నానఘట్టం' పీటికి భిన్నమైంది. 'సౌందరి' నాయికా సౌందర్యాన్ని 'దృష్టలు' సందర్శించటం వివరింపబడి, నాయికయైన 'సౌందరి'ని నాయకుడైన "దృష్టలు" చూడటం అన్యవాజ్యంతో ప్రణయభావాన్ని పరిపుష్టం చేస్తూవుంది.

విశ్వనాథ 'కిన్నెరసానిపాటలు' వస్త్వాశ్రియంగానే కొనసాగాయి. వీరి కిన్నెరసాని పాటల్లో నాయిక 'కిన్నెర'. ఒక నది. దాని దగ్గర వున్న కొండే నాయకుడు. ఇందలి ఇతివృత్తం వసుచరిత్రలోని శుక్తిమతి, కోలాహలుల ప్రణయ ఇతివృత్తాన్ని పోలి వస్త్వాశ్రయంగా కొనసాగింది. కిన్నెరకు అత్త పెట్టే ఇబ్బందులు కష్టంకాగా భర్తతో విన్నవించుకొంటుంది. భర్త అత్తను ఏమీ అనకపోగా కిన్నెర ఆవేశంతో అడవులవెంట పరుగులు తీసి అతని కౌగిట్లో ప్రవాహ రూపం దాలుస్తుంది. భర్త విలపించి విలపించి శిల అవుతాడు. ఈ విషయం ప్రతిపాదనల్తో "కిన్నెరసాని పాట"ల్లో వస్త్వాశ్రియమే చోటుచేసుకుంది. విశ్వనాథ 'కోకిలమ్మ పెళ్ళి' కూడా ఇలాగే వస్త్వాశ్రియత్వాన్నే కలిగివుంది. ఇందులో ప్రకృతిగతమైన అంశాలకి పెళ్ళి చేయటం నూతనత్వం. గానమాధుర్యాల్ని ఒలికించే

"కోకిలమ్మ"కు సువాసనల్ని వెదజల్లే "పూలరాజా"కు అతివంతా తోరణాలుకాగా వివాహం జరుగుతుంది. ఇక్కడకూడా ప్రణయభావమే ప్రతిపాదితమైన వస్త్వాశ్రియ రచనే కనిపిస్తుంది.

ఇలా స్వల్పమైన ఇతివృత్తంతో, పరిమితమైన పాత్రలతో, అమలిన శృంగారతత్వంతో ప్రేయసీ ప్రియుల ఎడబాటును చిత్రించటంతోపాటు కొన్ని సందర్భాల్లో వివాహ పర్యవసానంగా ప్రణయాన్ని వర్ణించటంతో ప్రణయ కవిత్వం ప్రాచీన కవిత్వ పోకడల్ని అంటిపెట్టుకొని వస్త్వాశ్రయంగా కొనసాగిందిగా కనిపిస్తుంది.

ఇకభావ భావకవిత్వంలో వస్త్వాశ్రియంగా కాకుండా కేవలం ఆత్మాశ్రియ ధోరణిలో కొనసాగిన ప్రణయ కవిత్వాన్ని గూర్చి వివరిస్తాను.

భావకవుల ప్రణయ కవిత్వం వస్త్వాశ్రయంగా కొనసాగినా అధికభాగం ఆత్మాశ్రియంగానే ప్రవహించింది. భావకవిత్వంలో ఆత్మాశ్రియంగా జాల్వారిన ప్రణయ కవిత్వాన్ని ఈ క్రింది అంశాలుగా వింగడించి పరిశీలించవచ్చు.

ప్రణయ తత్వం : భావకవుల ప్రణయ విషయంలో ఒక నూతనమైన పద్ధతిని ఆశ్రియించారు స్త్రీ పురుషుల మధ్య ప్రణయ భావం కంటే ఎలాంటి కామ వాంఛలు లేని స్నేహమే ముఖ్యమని భావించారు. ఈ విషయాన్ని దృష్టిలో వుంచుకొనే రాయప్రోలు ఆత్మాశ్రియ ధోరణిలో రచనలు చేయకపోయినా కాల్పనిక కవితా సంప్రదాయాన్ని కలిగి వున్న ప్రణయ కవిత్వాన్ని రచించి భావకవులకు మార్గదర్శకుడయ్యాడు. కృష్ణశాస్త్రి ప్రేయసీ వియోగంతో కంఠ దఘ్నంగా విలపించి, విలపించి ఆత్మాశ్రియ ధోరణిలో ప్రణయ కవిత్వాన్ని రచించి 'ఆత్మాశ్రయ ప్రేమకవితకు ఆద్యుడు'59 గా నిలిచాడు. కృష్ణశాస్త్రి తరువాత ఆత్మాశ్రయ పద్ధతిలో ప్రణయ కవిత్వాన్ని రచించినవారిలో బసవరాజు, వెంకట పార్వతీశ్వర కవులు, అబ్బూరి. నాయని, వేదుల, నండూరి, మల్లవరపు, విశ్వనాథ, పేర్కొనదగినవారు. వీరుకూడా కృష్ణశాస్త్రిలాగే ప్రేయసీ వియోగంతో కృంగిపోయి దుఃఖ భారంతో ప్రణయ గీతాల్ని ఆలపించారు.

ప్రేమతత్వాన్ని, సౌందర్య కాంక్షని, భక్తిభావాన్ని, దేశభక్తిని వింపుకొని రచనలు చేసిన భావకవి ప్రణయానికే అగ్రతాంబూలం ఇచ్చాడు. ప్రేమ ప్రణ

యం, ఇవి రెండే భావకవికి ముఖ్యం అనిపించాయి. అందువల్ల ప్రాచీన కవుల్లో సంభోగ శృంగారం కంటే సౌందర్యదృష్టిని, ఆత్మగుణ సౌందర్యాన్ని, ఉదాత్త ప్రణయాన్ని దృష్టిలో వుంచుకొని భావకవి ప్రణయ కవితలల్లాడు. అతని ప్రణయ కవిత్వంలో ప్రతి పాదితమైన ప్రణయ తత్వం విలక్షణంగా వుంది. కలయికని గాక ఎడబాటును కోరుకొనేదిగా, ఆ ఎడబాటులోని దుఃఖాన్నే ఆనందంగా స్వీకరించి అనుభవించేదిగా వుంది. అంతేగాక భావ కవులు ప్రణయం ఎందుకు? అని ప్రశ్నించుకొని తమ ప్రణయ తత్వాన్ని ప్రకృతి సహజమైన ప్రవృత్తిగా చిత్రీకరించారు.

జన్మసాఫల్యం పొందాలంటే భావకవి కాసింతైనా వలపు రుచి తెలుసుకోవాలన్నాడు సమస్త సుఖాల కంటే కాసింత వలపు కలిగి ఆ వలపు ఫలించక పోతే దుఃఖించడంలోనే సంతృప్తి, సంతోషం వుందని అభిప్రాయపడుతూ ఆ అభిప్రాయాన్ని -

'వలపెరుంగక బ్రతికి
కులికి మురిసే కంటే
వలచి విఫలమ్మొంది
విలపింప మేలురా!

చెలి వలపు లేదనీ
కలిమి కాల్చనే! వినుము,
వలపు తీగనె జీవ
ఫలము కాయునురా!

ప్రేమ కంటే ఎక్కు-
వే ముందిరా ఎల్ల
కావ్య పదవుల కన్న
ప్రేమయెక్కు-వరా!'60

అని అంటూ ప్రణయాన్నే జీవితంలో అన్నింటి కన్నా ముఖ్యమైందిగానూ, ఉత్తమమైందిగానూ మేలైరమైందిగానూ భావించాడు. ఈ భావనలో కవి ఆత్మగత భావాలే ఇతరులకోసం కాకుండా భావకవి తనకోసమే చెప్పుకున్నట్లు అత్మాశ్రయ ధోరణిని వెలిబుచ్చాడు. సామాజిక స్థితి గతుల్ని గూర్చి పట్టించుకోకుండా

భావకవి ప్రేమ కవిత్వం వైపు మొగ్గు చూపటానికి ప్రేమ అన్నింటి కన్నా గొప్పది అనే దృఢవిశ్వాసం కలిగే ఆత్మప్రబోధం కావించుకోవటం ఇక్కడ కనిపిస్తుంది.

భావకవి అటువంటి ప్రణయాల్ని, ప్రేమను గూర్చి చెప్తూ ప్రకృతిగత అంశాలెంత సహజమో మానవునిలో ప్రేమ భావం, ప్రణయభావాలు అంత సహజ మంటూ-

> 'సౌరభములేలచిమ్ము బుష్పవ్రజంబు?
> చంద్రికల నేల వెదజల్లు జందమామ:
> ఏలసలిలంబు పాఱు; గాడ్పేల విసరు?
> ఏల నా హృదయంబు ప్రేమించునిన్ను?'61

అని తన భావాన్ని ప్రకటించాడు. పూలెందుకు సువాసల్ని వెదజల్లుతాయో, చంద మామ వెన్నెలనెందుకు కురిపిస్తుందో, నీరెందుకు పారుతుందో, గాలెందుకు వీస్తుందో, అందుకే హృదయం కూడా ప్రేమిస్తుంది అన్న భావం భావకవి ప్రేమ దృక్పధాన్ని చాటుతూ ఆత్మాశ్రయత్వాన్ని కలిగివుంది.

ప్రకృతి సహజమైన ఈ ప్రేమ భావం భావ కవినే కాక ప్రపంచాన్నంతా ముంచి వేసేదిగా అనిపించింది. అందుకే ప్రేమలోనే ఈ లోకం పుట్టిందో, లేక ప్రేమే లోకంలో జన్మించిందేమో లేక ప్రేమే లోకమయ మయ్యిందేమో అని భావకవి అభిప్రాయ పడ్డాడు. తనూ, తనతోటి భావకవులూ ఇలా ప్రేమకు ప్రాధాన్యాన్ని ఇవ్వటాన్ని విశాల దృక్పథంతో పేర్కొన్నాడు. అందుకే ఆత్మా శ్రయ రీతిలోనే ప్రేమ తత్వాన్ని గూర్చి భావకవి-

> 'ఏమయిననేమి కొంచెమూహించి చూడ
> ప్రేమమయుడీశ్వరుడు, సృష్టి ప్రేమమయము
> ప్రేమ మయులెల్ల జీవులు ప్రేమ యొకటె
> పావనంబైనదని బోధపడుచునుండె'62

అని విశ్వ వ్యాప్తమైన అంశంగా ప్రేమని, ప్రేమ తత్వాన్ని తన అనుభవం ద్వారా పేర్కొన్నాడు.

ఇంతేకాదు చెట్టు మొగ్గ తొడగటం, మొగ్గవికసించటం పూలు సౌరభాన్ని వెదజల్లటం వలపు గుబులొ్లా్ననటం-ఇవన్నీకూడా ప్రేమకొలు కేలని కంఠోక్తిగా చాటాడు. భావకవి ప్రేమ విషయంలో ఎటువంటి అభిప్రాయాన్ని వెలిబుచ్చాడో ప్రణయం విషయంలో కూడా అదే అభిప్రాయాన్ని ప్రకటించాడు. భావ కవి దృష్టిలో ప్రేమ, ప్రణయం ఒకే అంశాలుగా భాసించాయి. భావ కవుల ప్రణయం అమలిన మైందీ, పవిత్రమైందీ కాబట్టి ప్రేమకు, ప్రణయానికి భేదం లేకుండా పోయింది వాళ్ళ దృష్టిలో. అందుకే జగమంతా ప్రేమమయంగానూ, లోకమంతా ప్రణయ మయ మైందిగానూ అగుపించింది అలా అని పించటంలో భావ కవి.—

'బ్రిణయమే లోకమై - పర గిన చోటఁ
బ్రిణయ శకుంతదం - పతులమై మనము
ప్రణయలీలామృత - రస తరంగ ములఁ
బ్రిణయ దోలా పరం - పరల మధ్యమునఁ
ప్రణయాన దోగుచుఁ - బ్రిణయ గీతములఁ
బ్రిణయంబు పల్లవిం - పఁగఁబాడుకొనుచుఁ
బ్రిణయ రూపానంద - భాగ్యంబుఁగాంచి
ప్రిణయ శాసనమునఁ - బ్రిణయ రాజ్యంబు
పాలింతమి కరమ్ము'63

అంటూ భావ కవి ప్రణయ మాధుర్యంలో తేలి యాడుతూ ప్రణయ రాజ్య పరి పాలన కావించాలనుకోవటం భావ కవి ప్రణయ తత్వాన్ని వ్యక్త పరుస్తూ ఆత్మా శ్రియతని కలిగించిగా వుంది.

ప్రేయసీ సాక్షాత్కారం : భావ కవుల ప్రణయానికి ఆలంబన మైన ప్రేయసీ సృష్టి కొంత వాస్తవికతని, మరికొంత-అవాస్తవికతని సంతరించుకొని జరిగింది. హృదయేశ్వరిలోని తల్లా వజ్ఝల నాయిక, సౌభద్రివి ప్రణయయాత్రలోని నాయని వత్సల వాస్తవాన్ని నింపుకొన్న కవికి పరిచయమున్న నాయికలు. కృష్ణశాస్త్రి ఊర్వశి. అడవిబాపి రాజు శశికళ, లౌకిక వాసనల కతీతమైన ఊహా ప్రేయసులు, విశ్వనాథ కిన్నెర, నండూరి ఎంకి కవుల వైయక్తిక జీవితంలో ఏ మాత్రం సంబంధ వున్నవారు కారు.64 ఇటువంటి నాయికలను భావ కవులు తమకోసం సృష్టించుకొని వారితో తమ వలపును ప్రకటించారు.

ఇలా భావ కవులు తాము నిత్యమూ చూస్తూ పరిచయం కలిగిన తరుణులనో, లేక ఇహ లోక సౌందర్యాన్నంతా ప్రోగు చేసి ఒక సుందరాకృతిగా నిర్మించుకొన్న అపురూప సౌందర్య రాసులనో, లేక ఊహాధిక్యంతో, ప్రాచీన తత్వంతో మనో ఫలకంపై చిత్రించుకొన్న దివ్యాంగనలనో ప్రేయసులుగా భావించటంతో వారు అనేక రూపాలుగా భావ కవులకు దర్శన మిచ్చారు. ఆయా కవి సుకుమార మనస్తత్వాన్ని బట్టీ, ఆయా కవి కోరుకొనే సౌందర్యాన్ని బట్టి భావ కవుల ప్రేయసి వారి అభిరుచులకు అనుగుణంగా సాక్షాత్కరించింది. భావ కవులు తాము దర్శించిన ప్రేయసీ సౌందర్యాన్ని, ఆమె గుణగణాల్ని వర్ణించటంలో ఆత్మాశ్రయత్వమే పాదులు దన్నుకొంది.

భావ కవుల్లో ప్రేమ కవిత్వానికి పకుటం పెట్టిన కృష్ణశాస్త్రి ప్రేయసి అలౌకిక గంధాన్ని పులుముకొన్న ఊర్వశి, ఆమె రూపు రేఖల్ని హావ భావాలను కవి మనోహరంగా భావించాడు, ఆ భావాన్నే మన ముందుంచాడు. ఆమె 'ప్రాణము నకును, ప్రాణమౌ ప్రాణకాంత'65 గా కవికి కనిపించింది. అంతేకాదు భావకవికి ఎన్నో ప్రకృతి అంశాలుగా ఆమె దర్శన మిచ్చింది. కృష్ణ శాస్త్రి తాను భావించి సాక్షాత్కరింప చేసుకొన్న ఊర్వశిని-

'నీవు తొలి పొద్దు నును మంచు తీవ సొనవు
నీవు వర్షా శరత్తుల నిబిడి సంగ
మమున బొదమిన సంధ్యాకుమారి, నీవు
తిమిర నిశ్వాసముల మాసి కుములు శర్వ
రీవియోగ కపోల పాళి కవు నీవె.
నీవె నిట్టూర్పు. నీవె కన్నీరు, విశ్వ
వేదనా మూర్త్య భాగమీవె నిజమ్ము
నేగ శమ్మార పాడు కొనిన యఖాత
శోక గీతమ్ములందీవె శోక గీతివి!
ఊర్వశీ! ప్రేయసీ!'66

అని ఆత్మీయతా ముద్రతో ప్రకటించాడు. కృష్ణశాస్త్రి ఊర్వశి ప్రకృతి అంశాలతో భాసించింది, అంతేకాక కవి వేదనలోనూ, నిట్టూర్పులోనూ, కన్నీరులోనూ, శోక గీతంలోనూ ఆమె కనిపించింది. ఇలా తన పైన, తనకు నచ్చిన విషయాలతో కృష్ణశాస్త్రి తన ప్రేయసిని ఊహ చేయటం ఆత్మాశ్రయత్వమే.

నండూరికి అతని ప్రేయసి ఐన ఎంకి పల్లెటూరి పడుచు పిల్లలా సాక్షాత్కరించింది. ఆమె అమాయకురాలు పూర్వజన్మ వాసనలు ఆమెకేమి తెలియవు. రాబోయే జన్మలో ఎలావుంటామో అంటే ప్రియుని మాటలకు బెంబేలు పడిపోతుంది. నండూరి ఎంకి స్వచ్ఛమైన ప్రేమను మూట గట్టుకొని అడవి మల్లెలా పరిమళాల్ని వెద జల్లేదిగా కనిపించింది అంతే కాదు నండూరి వారి అభిరుచులకు, అభిప్రాయాలకు అనుగుణంగా రూపు సంతరించుకొని —

'మెళ్ళో పూసల పేరు
తల్లో పూవుల సేరు
కళ్ళెత్తితే సాలు
కనకాభి సేకాలు!'67

చేసేదిగా కనిపించి అటువంటి ఎంకి వంటి పిల్ల లేదోయి అని అనిపించేలా సాక్షాత్కరించింది. ఇంకా ఎంకి సౌందర్యం పల్లీయుల అందాన్నే సంతరించుకొని-

సెక్కిటి సిన్నీ మచ్చ
సెపితే సాలదు లచ్చ!
వొక్కనవ్వే యేలు

వొచ్చర వొయిదూరాలు'68 గా రామోరింటికైనా రంగు తెచ్చే పిల్లగా, నండూరి గుండెను నమిలి మింగిన పిల్లగా కనిపించింది. ఈ ఎంకి సాక్షాత్కారంలో పల్లె పడతి రూప సౌందర్యం నండూరి వారికి నచ్చిన రీతిలో చిత్రితమై కవి వ్యక్తిగత అభిరుచిని చాటిచెప్పుతూ ఆత్మాశ్రయత్వాన్ని కలిగివుంది.

నాయకునికి ప్రేయసి69 'త్రిభువనమ్ములలో రసోద్దీపనమ్ము వెల్లి విరియించు ప్రణయ రూపిణి' గానూ, 'అమృతమునకు మాధుర్యమ్ము లలమించు కలశ వారాశి గానూ,70 'స్వర్గ భావమ్మునందు విస్ఫారి దివ్య శోభలడరించు నిర్మల జ్యోతి'71 గానూ సాక్షాత్కరించింది.

మల్ల వరపు ప్రేయసీ సాక్షాత్కారంలో కూడా కవి మనోగత భావాలే చెప్పబడి ఆత్మాశ్రయతని కలిగి వున్నాయి. ఆయన ప్రేయసి మంచు కన్నీటి తామర వదనంతో ప్రియ సఖిగా,72 'దుస్స్వప్న శోకలోక రాజ్ఞిగా'73 'అమాయిక

బాలగా,74 మధుర గాన జీవి'75 సాక్షాత్కరించింది. అంతే కాదు 'తారాకోప లాంగి'76 గానూ, 'తేజోస్నిగ్ధదేహ'77గానూ సాక్షాత్కరించి —

'భువనాలందలి సుందరోజ్వల శ్రీలూ
కవనంలో కలగీతమంజు భావాలూ
నవమందాకిని శీత వాత పోతాలు'78

తళుక్కుమని స్ఫురింపజేసింది ఆమె ఒక దివ్యాంగనగా చిత్రించబడింది.

ఇలా భావ కవికి నచ్చిన విషయాలతో తన ప్రేయసిని భావించి అభి వర్ణించటం వల్ల ప్రేయసీ సాక్షాత్కారంలో భావ కవులు ఆత్మాశ్రయత్వాన్నే ఆశ్రయించిన రచనలను వెలువరించారు.

సంయోగ సుఖం : ప్రకృతి గతమైన అంశాలెంత సహజమో ప్రేమ కూడా అంతా సహజం అనుకొన్న భావ కవులు తమ ప్రేయసులతో కలసి సుఖిం చాలని ఆరాటపడ్డారు. స్వచ్ఛందంగా తాము ప్రేమించే ప్రేయసుల కోసం, వారి సమాగమం కోసం ఉవ్విళ్ళూరారు. భావ కవీ అతని ప్రేయసీ కలిసి 'పువ్వులో తావిలా, తావిలో తలపులా', 'కోకిలా గొంతులా, గొంతులో కోర్కెలా,'79 వెన్నెలా వెన్నెలా వెన్నలో వెలుగులా", "వింగిలో నీడలా నీడలో నిదరలా"79 వుండిపోవాలని, కలిసి సుఖించాలని కోరుకొన్నారు. ఇలా కోరుకోవటమే కాదు, తమ కోరికలన్నీ మరచి ఒకరి కోసం ఇంకొకరు జన్మాల జన్మల యాత్ర సాగించాలని ఉబలాట పడ్డారు. ఇలా ఉబలాట పడ్డంలో భావ కవి ప్రణయంపై, ప్రేయసిపై వుండే మక్కువ వ్యక్తమౌతూ వుంది. భావ కవి హృదయాన్ని పట్టి ఇస్తూ వుంది చూడండి.—

"కోరికల నెల్ల మరచి నాకొరకు నీవు
నీ కొరకు నేను, తొలి వేగు బోకరాలు
పూలజతవోలె, ఈ సుధాపూరమందు
తేలిపోదము, జన్మవిన్మాలయాత్ర"80

భావ కవీ తన ప్రేయసీ కలిసి సంయోగ సుఖాన్ని పొందుతున్నపుడు అమితమైన ఆనందాన్ని అనుభవించినట్లు భావ కవి అభిప్రాయపడుతూ —

'కలువ రేకులనీకన్నుగవ గరగంగ,
శతరుణు చేత మిందు కళాతరళము,
చలువనెలవగు నీ యురశ్శయ్యనొరగి,
ఈ యువకుమారు తాపమ్ము లిగురు నమ్మ'81

అని అంటూ 'ఈనవొదిత కాలతీరాన మనకు నమరె....సుఖము'82 అన్నాడు. అంతే కాకుండా తలపులు, తడబాటులు లేకుండా తన నేలుకోమని ప్రేయసిని అభ్యర్థించటం కవి ఆత్మభావాన్నే ప్రకటించేదిగా వుంది. ఈ భావాలను భావకవి చాలా చక్కగా ఆత్మాశ్రయరీతిలో-

'ఆలసింపకు ప్రియతమా! అలరనీయు
మీ శిరీష నేశల యౌవనాశయమ్ము
.... .... .... .... .... .... .... .... ....
తలపులిక నేల సంశయతాసితములు?
తడబడి నికేల జంచలాతింక చింత?
శ్రీ చరణ పూజనాయత్తశీలు నితని
నీ శుభముహూర్తమున నేలుకో శుభాంగి'83

అని కోరుకొన్నాడు.

తాను ప్రేమించే ప్రేయసిని తనతోకూడా రమ్మంటూ ప్రకృతిలోని రమణీయమైన ప్రదేశాలకు వెళ్ళి సుఖించాలనుకొన్నాడు. ప్రేమ పూరితమైన హృదయంతో తన చెలితో ఎటు చూసినా ఎవరూ లేని ప్రదేశాల్లో మలి సంధ్యలో తిరిగి వచ్చిన గోవులకు పాలు పితికే దాకా సుఖించాలనుకొన్నాడు. లేత మనసుల్ని తడిచేసే చెట్ల మాటున కొమ్మలు ఆకుల్లాగా పీపు పీపు అన్చి మాటాపలుకూ లేకుండా కూర్చోవాలనుకొన్నాడు. అందుకే తన ప్రేయసితో-

"ప్రేయసి లేచిరమ్ము చివురించిన మావుల క్రింద
శీతలచ్ఛాయలలోన మౌవన నవవసంత
శుభోదయమయ్యె, నవ్వుచున్ చేయికిఁజేయుఁజేర్చి
పెలుచింతనలన్ మఱపించు రాగమ్ములే దీయుచు
వాసనల్పరిమళించెడు చోటులయందు బోవగన్"84

అని ఆరాటం చెందాడు. ఇతని ఆరాటంలో ప్రేయసీ సందర్శనం, ప్రేయసీ సామీప్యంలో పొందే ఆనందం వుండి ఆ భావకవి ఆత్మీయతని నింపుకొంది. అంతేకాదు కవికి నచ్చిన సన్నివేశాలుగా చిత్రించిన చెట్లూ, శీతలచ్ఛాయ, యౌవన నవవసంత శుభోదయం, పెరచింతనలు మరచి పోవటం, చేయికిచేయి చేర్చి వాసనలు పరిమళించే చోట్లలో విహరించటం కనిపిస్తూవుండి ఆత్మాశ్రయ త్వాన్ని నింపుకొన్నాయి.

భావకవికి ప్రపంచంలోని అన్ని విషయాలకంటే ప్రేమ ప్రేయసి ప్రధా నం అయ్యాయి. అందువల్లే తన ప్రేయసితో కలిసి తిరగటం, మాట్లాడుతూ వుండిపోవడం, ఒకర్నొకరు చూసుకుంటూ వుండటం వంటి విషయాలే మాధుర్య మనిపించాయి. అంతకు మించిన ఇహలోక సౌఖ్యం లేదని అభిప్రాయపడ్డాడు. ఈ అభిప్రాయాన్నే భావకవి అనేక సందర్భాలల్లో ఆత్మాశ్రియంగా ప్రకటించు కొన్నాడు.

ప్రేయసి సామీప్యాన్నే దివ్య భాగ్యంగా భావకవి భావించడం అతనికి లౌకిక విషయాలతో మరేమీ పని లేదనే చాటి చెప్తున్నాయి. తన సమీపంలోవున్న ప్రేయసితో భావ కవి తన ధృఢవిశ్వాసాన్ని ఆత్మగుణాన్ని వివరిస్తూ హేమ మణిరత్నగణాలు, ముత్తైపు సరులూ, సార్వభౌమ భోగములూ ఎందుకు అని ప్రశ్నించాడు. తను ఏ ప్రేయసినైతే సర్వంగా భావించాడో, ఏ ప్రేయసినైతే మనసారా ప్రేమించాడో ఆమెతో కలిసి వలపు బాటల్లో తుళ్ళింతలు ఒలికేరోజా నెలల తరగల నురుగుల అంచుల్ని చూస్తూ ప్రీతితో 'సవిమల ప్రేమ సామ్రాజ్య పట్టభద్ర భాగ్య' 85 మును పొంది సుఖించాలని మాత్రమే ఆశించాడు. ఇలా ప్రేయసి సమీపంలో ఉండి పోవటం అక్కడే సుఖాల్ని అనుభవించటం భావకవి మనోభావాన్ని ప్రకటించేదిగా ఆత్మాశ్రయత్వాన్నే కలిగి వుంది.

తన వెంతనే వున్న ప్రేయసితో అచ్చటా ముచ్చటా తీర్చుకోవటం కోసం ఆరాట పడిన సందర్భాల్లో కూడా భావ కవి ఆత్మాశ్రయంగానే భావ ప్రక టన చేశాడు. ఎంకి ఎవరని లోకమెప్పుడైనా కదిపితే వెలుగు నీడల వైపు వేలు చూపించాలనుకున్న భావకవి ఆమె తోటి సుఖాల్ని అనుభవించాడు. ప్రేయసి ఒడిలో ఆనందంతో పొక్కిపోతూ, ఆమె ఊసుల్నే నెమరు వేస్తూ సంతోష సాగరంలో ఓలలాడాడు. ఆ ఓలలాడటంలోని ఆనందాన్ని, అనుభవాన్ని భావకవి మనకందిస్తూ -

'యెన్నాని సెప్పేది యెంకి ముచ్చట్లు!
యేటి సెప్పేది నా యెంకి ముచ్చట్లు

దొడ్డిదోవ కెల్లె తొంగి సూడంగానే
తోట కాడే వుందు త్వరగొస్త నంటాది

..... ..... ..... ..... ..... .....

కోడిగూసేసరికి కొంపకెల్లాలి నీ
కోసరమె సెపుతాను కోపమొద్దంటాది'86

అంటూ భావకవి ప్రేయసీ సంయోగంలోని మాధుర్యాన్ని వివరించాడు. ఇలా భావ కవితనకు సాక్షాత్కరించి సమీపంలో వుండి పోయిన ప్రేయసితో అనుభ వించిన సుఖాన్ని పొందిన ఆనందాన్ని వివరించటంలో తన ఉత్సాహ పూరిత మైన హృదయాన్ని ఆవిష్కరించారు.

వియోగ దుఃఖం : భావకవి తనకు నచ్చిన, తనకు ప్రత్యక్షమైన ప్రేయసితో ఎల్ల కాలమూ సుఖించలేదు. జీవితమంతా ఆమె మధురమైన మాటలతోనూ, సుందరమైన ప్రవృత్తితోనూ, ప్రవర్తనలతోనూ గడచి పోతుందని ఆశపడ్డాడు. కానీ కాలప్రవాహం వారి మధ్య ఒక అడ్డు తెరను నిలపింది. ఆ అడ్డుతెర సంఘమే అయింది. విధి నిర్వహణ కూడా ఆ సుఖాన్ని క్షణకాలం వరకే వుంచింది. ఈ విషయాన్నే భావకవి చక్కని ఆత్మాశ్రయ రీతిలో -

'అతి మనోహరమూర్తివై మధ్యవీధి
దోచినంత నీకై చేయిచాచుటేల?
శ్రావణ శ్యామల క్రూర జలదపటల
మాయమైతే సౌధామినీ, మమతేగాలిపి'87

అని నివేదించుకొన్నాడు.

తాను ఏ ప్రేయసినైతే సర్వస్వంగా భావించాడో, ఏ ప్రేయసి ఆజన్మాంతం తనకు తోడునీడగా వుంటుందని అనుకొన్నాడో, అలాంటి ప్రేయసి తనను ఎడ బాయటంతో భావకవి హృదయం ముక్కలైంది. ప్రేయసీ వియోగంలో భావకవి ఎనలేని దుఃఖాన్ని అనుభవించాడు. ఇటువంటి స్థితికి భావ కవి తట్టుకోలేక విల

విల్లాడాడు, ఈవిలాసమే భావకవి ప్రణయ కవిత్వంలో అధికంగా చోటుచేసుకొని ఆత్మాశ్రయ మార్గాన్నే ప్రవహించింది. ప్రేయసీ వియోగంలోని బాధని ఆత్మగతంగా వెల్లడించుకొన్నాడు. క్షణిక కాలం మాత్రమే కనిపించి మాధుర్యాన్ని నింపిన ప్రేయసి మాయం కాగా తన ప్రేయసికోసం భావకవి –

> 'ప్రేయసీ ప్రేయసీ ప్రియుడనే ప్రేయసీ
> వేయి కన్నులు దాల్చి వెదకుచున్నానే'88

అంటూ అన్వేషణ ప్రారంభించాడు. ఆ అన్వేషణ వల్ల లాభం లేక పోయింది. దుఃఖమే మిగిలింది. అప్పటి భావ కవి స్థితి హృదయ విదారకమైంది. ఆమె లేదని, రాదని దృఢంగా విశ్వసించిన భావ కవికి ఆ ఆలోచనే భరించరానిదైంది. అట్టి స్థితిలో కవిలోకం వైపు చూశాడు. లోకం నుంచి కవికి ఆదరణ లభించక పోవటమే కాక, వెర్రివానిగా జమకట్ట బడ్డాడు. అప్పుడు భావకవి తన బాధా తీవ్రతని చెలికే నివేదించుకొనడం కోసం అంతర్ముఖత్వంతో ఆత్మాశ్రయ పద్ధతిని అవలంబించాడు.

> "నీకను చూపు చీకటుల నీడల
> నాయెద నిల్వ లేదు, పే
> రాకలిగొన్న నా బ్రతుకు నందు
> త్వదీయ మనోజ్ఞ హాసరే
> ఖా కమనీయ కాంతిసుధ
> కాల్వలు కట్టగ లేదు, కాని యే
> మో కలగున్ మనమ్ము
> వలపుందమకమ్మున విన్దలంచినన్।"89

అని అంటూ తన ప్రేయసి కనుచూపు చీకట్లు తనపై ప్రసరించక పోయినా, తన ఆకలిగొన్న బ్రతుకులో ఆమె హాసరేఖ ప్రసరించకపోయినా వలపు తమకంలో ఆమెను తలచుకొంటేచాలు అనిర్వచనీయమైన అనుభవాన్ని పొందుతున్నానంటూ సంతోషించడానికి ప్రయత్నించాడు. కానీ ఈ సంతోషాన్ని కూడా భావకవి పొందలేక పోయాడు. ప్రేయసి ఎడబాటు తీవ్రతలో, ప్రేయసి దూరంగా కాగా భావకవికి తన బ్రతుకంతా దుఃఖ సాగరంలో మునిగిపోయిందిగా

అని పించింది. ఇలా అని పించటాన్ని కూడా భావ కవి ఆత్మాశ్రయరీతిలోనే చెప్పాడు. ప్రేయసి వియోగ దుఃఖంలో కృంగి పోతున్న భావ కవికి దిశలు పుల కించగా నిదుర రాకపోగా, పొదల మాటున దాగి వున్నట్లు ప్రేయసి 'హృదయ దళనదారుణములైన నగ్న గీతమ్ములు'90 పాడగా—

'నా విరహ గంధ గీతి కన్వయము జెప్ప
శిరసు లెత్తుచు నున్నవి చిగురు పొదలు
నవ్వు చున్నవి కడల నందపు సందె
కావిరంగుల రంగైన మోవి విరిచె'91

అంటూ ప్రకృతి సైతం తనతో పాటుబాధపడుతూ వుందని అభిప్రాయపడ్డాడు ఈఅభిప్రాయం కవి హృదయాన్ని వెల్లడిస్తూ ఉంది. ఆత్మాశ్రియతనే కలిగి వుంది

భావ కవి విరహ వ్యధతో భాధపడటమే కాకుండా మింటికీ మంటికీ ఏక ధాటిగా విలపించాడు. వెక్కి వెక్కి ఏడ్చాడు. ఎడబాటు తనకే కాకుండా ప్రేయసికి కూడా భాధనే కలిగిస్తూందని అనుకొన్నాడు. అందుకే —

'ఒక్కటొక్కటె కన్నీటి చుక్కలొలుక
నేడ్వలేక యేడ్వలేక యేడ్చుచుంటి,
నెచ్చెలీ, యేనెఱుంగుదు, నీవు గూడ
నొక్కమాఱు గాటంపు నిట్టూర్పు విడుతు
తెలియరాని తెలుపలేని తీక్ష్ణతాప
మెదియొ లోలోన నిన్ను వేగించునేమొ!'92

అంటూ ఎడతెగ నటువంటి తన జీవిత యాత్రను ఇలా సాగించలేక, ఏడ్వలేక, ఏడుస్తూ బ్రతకలేక కృశించి పోతున్నానని బాధ పడ్డాడు. ఇలా ప్రేయసీ ఎడ బాటుతో బాధ పడుతున్న కవికి జీవితం చీకటి మయంగా తోచింది. ఆ చీకటి లోనే దాగిపోవాలని భావకవి తాపత్రియపడటం అతని మానసిక స్థితిని చిత్తప్ర వృత్తిని వ్యక్తం చేస్తూ వుంది ఆత్మాశ్రయంగా కొనసాగింది. చీకటి బ్రతుకైన తన స్థితిని తెల్పుతూ భావకవి -

'రేయి కడుపున చీకటి ఛాయవోలె
తమసు పెడద దివాంధ గతము విధాన,

ఘోర రావాన్ వలవంత రేకరీతి

నా విషాదమ్ములో దాఁగినాఁడ నేనె,'93

అంటూ తన విషాదంలో తానే దాగి పోయాడు; వియోగ దుఃఖంతో బాధపడు తున్న భావకవి తన విషాదంలో తాను దాక్కోవటమే కాకుండా తన మరణ శయ్యను తానే పరచుకోజూశాడు. దీనికంతా కారణం భరించరాని ప్రేయసీ వియోగ. భార మేవదలి పోనటువంటి తనఅవసానవాంఛ మరణమేకాగా భావ కవి.

'ఏను మరణించు చున్నాను;........

.... .... ....

నా మరణశయ్య పఱచుకొన్నాను నేనె;

నేనె నాకు వీడ్కోలును విన్పించినాను;

నేనె నా పయి వాలినా, నేనె జాలి

నెద నెదగదించినాను, రోదించినాను'94

అంటూ శోకాతిశయ హృదయ భారంతో మరణ సన్నద్ధుడయ్యాడు. ఇలా తన దుఃఖాన్ని, దుఃఖ తీవ్రతని. మరణావస్థని భావ కవి వ్యక్తం చెయ్యటం వల్ల వియోగ దుఃఖంలో ఆత్మాశ్రయత్వమే అంచులు తీరి కన్నీటి రూపంలో ప్రవ హించింది.

విషాధ మాధుర్యం : వియోగ దుఃఖాన్ని అనుభవించిన భావ కవి హృదయం కరుడు గట్టింది.ఆ కరుడు గట్టిన హృదయానికి విషాదమే మాధుర్యాల్ని ఒలికించే దిగా అగుపించింది. తినగ తినగ వేము తియ్యగా వున్నట్లే భావ కవికి ఆవేదనే మధురమనిపించింది, అందుకే వియోగ దుఃఖంలో మునిగి తేలుతూ వుండి పోయిన భావ కవి విషాదంలోనే సుఖాల్ని అనుభవించడానికి ఉద్యుక్తుడయ్యాడు.

భరింపరాని వియోగ దుఃఖంలో బాధ పడిన భావ కవిస్థితి పలాయనం వైపు. మరణం వైపు మొగ్గు చూపింది. అందుకే దుఃఖమయమైన వాస్తవ జగత్తు నుంచి దూరతీరాలకు, రహస్తీరాలకు ఎగిరిపోవాలని సంకల్పించుకొన్నాడు. అందుకే చంద్రునితోను, సంధ్యాసమీరంతోనూ తన నెచ్చటికైనా ఎత్తుకొని పొమ్మన్నాడు. కానీ ఇవేవీ అతని కోర్కెను నెరవేర్చ లేక పోయ్యాయి. అందువల్ల చివరి ప్రయత్నంగా మరణించడానికి కూడా సంసిద్ధుడయ్యాడు. ఇది కూడా నెరవేరలేదు.

అటువంటి స్థితిలోనే మనో నిబ్బరంతో కష్టాల్ని ఎదుర్కొంటూ దుఃఖాన్ని ఆశ్ర యించి బ్రతుకు గడపాలని నిశ్చయించుకొన్నాడు. ఇటువంటి స్థితిలో దుఃఖాన్ని, విషాదాన్ని ఆనందంతో స్వీకరించటం, మాధుర్యంగా భావించటం కంటే గత్యం తరం లేకపోయింది. అందుకే -

'నాకు నిశ్వాస తాళ వృంతాలు కలవు,
నాకుఁగన్నీటి సరుల దొంతరలు కలవు,
నా కమూల్య మపూర్వ మానంద మొసఁగు
నిరుపమ నితాంత దుఃఖంపు నిధులు కలవు -
ఎవ్వరని యెంతురో నన్ను? -'95

అంటూ తనకున్నటు వంటి సంపద యేంటో వివరించి సగర్వంగా చెప్పుకొన్నాడు. 'నిశ్వాస తాళవృంతాలు,' "కన్నీటి సరుల దొంతరలు," 'దుఃఖంపు నిధులు' తన కున్నటువంటి సౌభాగ్యాలుగా పేర్కొనటంతో భావ కవి వియోగ దుఃఖం వల్ల ప్రాప్తించిన విషాదమే సంపదగా భావించినట్లు తెలుస్తూవుంది. అంతే కాకుండా అతని ఆత్మస్థైర్యాన్ని కూడా ప్రతిబింబిస్తూవుండి ఆత్మాశ్రయత్వాన్నే కలిగివుంది. ఇటువంటి ఆత్మస్థైర్యమే కవికి ఏడుస్తూ కూడా బ్రతుకీడ్చ గలగడానికి చేయూత నిచ్చింది. అందుకే ఆకాశం క్రుంగి కూలి పోయే విధంగా చీకట్లు ముసిరినా, కరడు గట్టినా సరే వలపు తీపి ఎరుగనటువంటి లోకం రాతి గుండెతో నిప్పులు కురిపించినా సరే

'హృదయమున్నంత వరకు నా ప్రేమ కాంక్ష
బ్రతికి యున్నంత వరకే బ్రతుకుచుందు"95

అని నిబ్బరంగా జీవించ దలిచాడు. ఇలాంటి గుండెనిబ్బరంతో తనను తానే సం బోధించుకొంటూ చీకుచింతల మానుమంటూ-

"వెక్కియేడ్తు వదేల?
ధిక్కరింపుము శోక
కర్కశా వేదనల
వో కవీ! ఓకవీ!"97

అని ఓదార్చు కొన్నాడు. ఇలాంటి ఓదార్పు కవి ఇతరుల కోసం కాక ప్రేయసీ వియోగంతోనూ, విరహ తాపంతోనూ, లోకం చూపే అనాదరంతోనూ బాధ పడుతూన్న తనకోసం చెప్పుకోరట. ఆత్మాశ్రయత్వాన్ని ఆశ్రయించి వెలికుబికిందిగా జాల్వారింది. ఇటువంటి స్థితిలో భావ కవి తనకుతానే అమృత మొలికించే ప్రయత్నం చేస్తూ విషాదాన్ని మాధుర్యంగా మలచుకొని ఆనందాన్ని వింపుకో జూచాడు. కాబట్టే-

> 'ఆశలన్నియు భగ్నంబులగు కాలంది
> నలువ నొక కోదనపు నడి నన్నైన
> జీవనము స్వప్న శూన్యమై పోవు కాలది
> జాడ విడబోత నొక పుబ్బునీడకైన
> ప్రేమ దాహాన నెడద తపించు కాలది
> అమృత మొలకింతా స్మిత నయనాంచలముల'98

అంటూ తన భావాల్ని ఆవిష్కరించాడు. ఇటువంటి స్థితి భావ కవికి కలగటం వల్ల సంతోషాంబుధిలో మునిగి పోయినట్లు సంతృప్తి చెందాడు.

తాత్త్విక గమ్యం: తనదంటూ ఒక లోకాన్నీ, తనకంటూ ఒకప్రేయసినీ సృష్టించుకొని, ఆ ప్రేయసినే సాక్షాత్కరించుకొని ఆమె సంయోగంలోనూ, ఆమె వియోగంలోనూ సంతోషించి సుఖించిన భావకవికి ప్రణయ విషయంలో ఉదాత్తత ఏర్పడింది. రాయగా రాయగా మెరుగులు తేరుతుందన్నట్లు భావ కవి హృదయం ఆలోచనలు మెరుగులు తేరాయి. ఎన్నో కష్ట విష్టురాలకి గుర్రై బాధని అనుభవించిన భావ కవికి విషాదంమాధుర్యం అనిపించింది. అంతే కాదు తనను ఎడబాసిన ప్రేయసి వియోగాన్ని వియోగంగా భావించక ప్రేయసి తనతోనే ఉందనే నమ్మకం ఏర్పడింది. చుట్టూ వున్న ప్రకృతిలో ఆమె రూపం ప్రతిఫలించి. అటువంటి ప్రతిఫలం భావ కవిని ఇహలోకాల్ని దాటి తాత్త్విక సీమల్లోకి తీసుకెళ్ళింది. తన ప్రేయసి ప్రకృతిలో భాసిస్తూ, సృష్టి కర్తయైన భగవంతుని అంశాల్లో దర్శన మిచ్చింది. ఇలా అనిపించటంతో భావ కవి ప్రణయం తాత్త్విక గమ్యాన్ని చేరుకొంది. ఇటువంటి స్థితిని కూడా భావ కవి ఆత్మాశ్రయంగానే వ్యక్తం చేశాడు. ప్రేయసీ వియోగాన్ని, విషాధ మాధుర్యాన్ని అనుభవించిన భావ కవి.

'వాలుసీ కనురెప్పల జాలి చూపు
ల్లల్ల దిగ జాటి దిగ జాటి అమరనాథ
కంఠ మాలా సుమ దళాలు గాగ, గగన
వాహినీ నీరజాళినీ పక్షసీల
నాట్యములుగ, తారా తోరణములు గాగ
....   ....   ....'99

'కలుగునా నాకు నీ వియోగమ్ము సకియ'99 అంటూ పరమాత్మ చింతన వైపు మొగ్గు చూపాడు. ప్రేయసీ కను రెప్పల జాలి చూపులు మెల్ల మెల్లగ దిగజారి అమర నాథుని కంఠమాలలో వ్రేలాడే సుమదళాలయ్యాయి అనటం ప్రేయసి ద్వారా పారమార్థిక చింతనని అలవర్చుకోవటాన్ని వ్యక్తం చేస్తూ వుంది. కవి భావాన్ని ప్రకటిస్తూ వుంది.

ఇటువంటి దృష్టి అలవరచుకొన్న భావ కవికి తన ప్రేయసి ప్రేయసిగా కాక దివ్యత్వాన్ని సంతరించుకొన్న దేవతగా అనిపించింది. అటువంటి దేవి కోసం తన జీవన్ముక్తి కోసం భావ కవి ఆరాట పడిపోతూ-

'మరణ దేవతవో, సుధా మధుర విధుర
జీవి శాంతివో, ప్రేమైక జీవ కళవో
విలయ సౌందర్య ధాత్రివో. విశ్వగాన
మోహినివో, యిహ దుఃఖ తమోని యతివో
ఎవతవైన సరే....   ....   ....
....   ....   ....ప్రేమప్రసన్న
మైన యద్వంద్వ కాంతి సీమాంతరమున
శాశ్వత సుషుప్తి ముంచి ప్రశాంతు జేయ
ప్రేయసీ! ప్రేయసీ! దయసేయు మిపుడె'100

అంటూ ఇహలోక సంబంధమైన సంతృప్తి కోసం, ప్రేయసి పొందుకోసం కాక జీవన్ముక్తి కోసం ఉబలాట పడటం భావకవి మానసిక పరివర్తనని, మోక్షసాధనకై అభిలాషని వ్యక్తంచేస్తూ ఆత్మాశ్రయత్వాన్నే కలిగివుంది. తాత్వికగమ్యాన్ని చేరుకోవటంకోసమే భావకవి చేసిన ప్రయత్నమే బలీయమైందై చివరకు తన్నొకస్త్రీగా భావించుకొని తనప్రాణ నాయకుడైన భగవంతునితో ఐక్యం కావటం కోసం

ఆనాటి పనటంగా రూపొందించి. ఈ విషయాన్ని భక్తి-ఆత్మాశ్రయం అనే అంశం క్రింద తరువాత వివరిస్తాను.

ఈ అధ్యాయంలో ఇంత వరకు భావ కవిత్వంలో ప్రధానమైన ప్రకృతి కవిత్వంలోనూ, ప్రణయ కవిత్వంలోనూ విభిన్న రీతుల్లో దర్శనమిచ్చే ఆత్మాశ్ర యత్వాన్ని గూర్చి చర్చించటం జరిగింది. అంతే కాకుండా ప్రకృతి ప్రణయంలో అణుమాత్రంగా చోటుచేసుకొన్న వస్తు ప్రాధాన్యమైన భావ కవిత్వాన్ని కూడా స్పృశించటం జరిగింది.

ఇక ఈ అధ్యాయంలో భావ కవిత్వ శాఖలైన భక్తి, దేశభక్తి స్మృతి కవి త్వంలో చోటుచేసుకొన్న ఆత్మాశ్రయత్వాన్నిగూర్చి తెలుసుకొనే ప్రయత్నం చేద్దాం.

భక్తి-ఆత్మాశ్రయత్వం : ప్రాచీన కాలంనుంచీ భక్తి తత్వం కావ్యాల్లో వెల్ల డౌతూనే వుంది. ప్రాచీన కాలంలో వచ్చిన భక్తి తత్వం కొంత ఆత్మాశ్రయతని ప్రదర్శించినా పురాణాల్లోనూ; మాహాత్మ్య కావ్యాల్లోనూ భక్తి వస్త్వాశ్రయంగానే కొనసాగింది. ప్రాచీన కవిత్వంలో శివకవులు భక్తితత్వాన్ని ప్రతిపాదించే కావ్యాలు పెక్కు రచించారు. అవన్నీ వస్త్వాశ్రయంగానే వెలిశాయి. తరువాత వచ్చిన భక్తి కావ్యాలన్నీ వస్త్వాధిక్యతనే కలిగివున్నాయి. ఆధునిక కాలంలో వెలువడిన భక్తి కవిత్వం దీనికి భిన్నంగా ఆత్మాశ్రయ పద్ధతిని సంతరించుకొంది.

ప్రాచీన కవులు భక్తిమార్గంలో నవ విధాలైన భక్తి తత్వాన్ని ప్రతిపాదించ టంకోసం అనేక మంది భక్తుల కథల్ని, భగవంతుని మహిమల్ని కొనియాడుతూ, క్షేత్ర మాహాత్మ్యాన్ని, స్థలమాహాత్మ్యాల్ని, తీర్థ మాహాత్మ్యాల్ని వివరించారు. దాంతో కేవలం కవుల వైయక్తిక భక్తి భావానికంటే భక్తి పూరిత హృదయుల కథలు భగవంతుని లీలలు, కావ్యాల్లో ఇతివృత్తాలయ్యాయి. ఆధునిక కాలంలో ఈ పద్ధ తిలో మార్పు వచ్చింది.

కష్టనిష్ఠూరాలకి గురైన ఆధునిక కవి తన బోధల్ని, భగవంతునితో నేరుగా నివేదించుకొనే పద్ధతి అలవాటు పడ్డాడు, శతక కవులు, సంకీర్తనాచార్యులు భక్తి విషయంలో ఈ పద్ధతినే ఆశ్రయించారు, ఈ విషయాన్ని ఇదివరకే వివరించాను ఈ స్థితిలో నవ్య కవి తన దోషాల్ని తానే స్వయంగా ఎత్తిచూపుకొంటూ భగవం తుని కరుణా కటాక్షం కోసం తహతహలాడాడు. ఆ తహతహతో ఆత్మ ప్రక్షాళ నం చేసుకొంటూ భగవంతుని గుణగణాల్ని ఔదార్యాన్ని కొనియాడుతూ భగవంతు

నిపై తనకున్న భక్తిభావాల్ని ప్రదర్శించుకొన్నాడు. ఇలా చేయటం వల్ల వస్త్వా శ్రియ పద్ధతిలో కొనసాగుతూ వుంటిన భక్తి భావ ప్రకటన ఆత్మాశ్రయత్వాన్ని సంతరించుకొంది.

ఆధునిక కవిత్వంలో ఆత్మాశ్రయ పద్ధతిలో కొనసాగిన భక్తి భావకవుల్లో రెండు పాయలై ప్రవహించింది. ఒకటి శివతరమైన భక్త్యావేశం కాగా, మరొకటి విష్ణు సంబంధమైన భక్తి తత్వంతో కూడుకొన్నవి. శివపరమైన భక్త్యావేశంలో భావ కవులు శివుని నాట్యాన్ని, ఆయన వ్యక్తిత్వాన్ని కీర్తిస్తూ భవ బంధాలనుంచి ముక్తిని ప్రసాదించమని ఆత్మార్పణ కావించుకొన్నారు. విష్ణు సంబంధమైన భక్తి తత్వంలో అలాగాక తమ్మొక గోపికగానో, ప్రేయసిగానో భావించుకొంటూ భగ వంతుని ప్రణయ నాయకునిగా భావించి కరుణతో తమని స్వీకరింపమని మధుర భక్తిని వెల్లడి చేసుకొన్నారు తమ తమ తప్పిదాల్ని భగవంతునికి నివేదిస్తూ పాప పంకిలం నుంచి తమని రక్షింపమని భగవంతుణ్ణి దీనాతి దీనంగా కన్నీరు మున్నీరు కాగా ప్రార్థించారు. దాంతో ముందటి సాంప్రదాయక భక్తిలోని ఆరా ధనా తత్వానికి తోడుగా ఆత్మార్పణా తత్వం వెల్లడై భావ కవుల భక్తి కవిత్వంలో ఆత్మాశ్రయతత్వం పొంగులు వారింది.

అట్లని భావ కవుల భక్తి తత్వం అంతా ఆత్మాశ్రయరీతిలోనే కొనసాగిం దనడానికి వీలు లేదు. అధికంగా ఆత్మాశ్రయతని నింపుకొని ప్రవహించింది. ముందు భావ కవుల కలంనుంచి జాల్వారిన భక్తి తత్వంలోని వస్త్వాశ్రయతని రేఖామాత్రంగా పరిశీలించి ఆపైన ఆత్మాశ్రయత్వంతో పెల్లుబికిన భక్తి తత్వాన్ని గూర్చి ఆలోచిద్దాం.

భయంకరాకారుడై తాండవం చేస్తున్న శివుణ్ణి ఆయన రూపాన్ని కొంత మంది, భావ కవులు భక్తితో కీర్తించారు. ఆ శివభక్త్యుపాసనలో హృదయాంత ర్గతమైన దివ్య శక్తిని కాక శివుని బాహ్యాకారాన్ని, నాట్యవిన్యాసాల్ని కొని[illegible] దారు. ఇటువంటి సందర్భాల్లో భావ కవుల శివసంబంధమైన భక్తి భగవ[illegible] రూపురేఖా విలాసాలు, మహిమలు కొనియాడడంతో వస్త్వాశ్రయంగా కొ[illegible] గింది. ఇలాగే తన వ్యక్తిత్వాన్ని విస్మరించి, గోపాలుని గోపికా దృష్టితో[illegible] ప్రేయసీ దృష్టితోనూ కాకుండా సామాన్య భక్తుని దృష్టితో దర్శించిన న[illegible] ల్లోని వైష్ణవ భక్తి కూడా వస్త్వాశ్రయంగానే కొనసాగింది. శ్రీకృష్ణుని

లీలల్ని అవతారఘట్టాల్ని స్మరించి భావ కవుల భక్తి మార్గంలో వస్త్వాధిక్యమే వుంది.

'చంద్రిమకుటము
జటాజూటము
సాంద్ర నీలపు జదలపాపట
నురిగి పోతున్నాయ్‌!
చక్కని మువ్వన్నె చర్మము
అక్కళించిన పొట్టపైని
అంటి యుండీ అంట కున్నాదోయ్‌'101

అని 'శివరాత్రి ప్రభ'ను భక్త్యావేశంతో గానం చేసిన భావకవి భగవత్సంబంధమైన ఆత్మీయతా ముద్రికు నోచుకొన్న భక్తి తత్వాంశంకంటే భగవంతుని వస్తువులను గూర్చి ప్రశంస చేస్తూ వస్త్వాశ్రియత్వంతో కూడుకొన్న భక్తినీ ప్రదర్శించాడు. చంద్రిమకుటం, జటాజూటం, మువ్వన్నెచర్మం, ఇవన్నీ శివుడు ధరించే ఆభరణాలు వస్త్రాలూనూ, వీటిని కొనియాడటంతో భగవద్వస్తు సంబంధమైన భక్తితత్వాన్ని ప్రదర్శించిన వాడయ్యాడు భావకవి ఇందులో వస్త్వాశ్రియమే ధ్వనిస్తూఉంది.

'ఏమని పాడితివో
గోపాల కృష్ణా
ఏమని పాడితివో
భామలు పదియారు వేలు
పరవశలై సొక్కి సోల

బృందావనమా
నందమయముగా

యమునా నదిలో
నమృతము పొంగగ

.... .... .... .... ....

ఏమని పాడితివో

యట్టి సుఖజీవితాలంబమైనయట్టి
యైన సంతుష్టి నిరంతంబు నాశ్రయింతు"104

నని సమస్త జగానికీ చిదానందాన్ని ప్రసాదించే చిత్తవృత్తిని అవలంభించాడు. ఇక్కడ భగవంతుని స్వరూపం పైన కాక భగవదంశపై నిరంతర చింతన కలిగి వుండే తత్వంతో పాటు కవి చిత్తవృత్తి ప్రదర్శితమై ఆత్మాశ్రయత్వం కనిపిస్తూ వుంది.

ఇటువంటి నిరంతర చింతనలో మునిగిపోయిన భక్తుడైన భావ కవికి భగవంతుని రూపం సుందరమైందిగానూ, భగవంతుని పేరు వీనులకు విందుగానూ భగవంతుని జాడలు సౌఖ్యమైనవిగానూ, భగవంతుని లీలలుతనువు పులకరింప చేసేవిగానూ అనిపించాయి. నిరంతర చింతనా మగ్నమైన భావకవి పరమాత్మ చింతనలో ఆనందాన్ని అనుభవించాడు. తన వంతలన్నీ మరిచిపోయాడు. భగవంతుని ఆరాధనలో పారవశ్యం పొందాడు. ఈ విషయాన్నే చక్కని ఆత్మాశ్రయ ధోరణిలో భావకవికి ప్రకటించుకొన్నాడు. తను నిరంతరం చింతన చేసే భగవత్స్వరూపాన్ని తన కళ్ళ ముందే తేజరిల్లుతూ వుండమంటూ-

"ప్రణయ పూర్ణ హృదయుడవై
భాసమాన దేహుండవై
దేవ! నా కనులయెదుట
తేజరిల్లు యెప్పటిట్లు"105

అనిప్రాదేయ పడ్డాడు. ఈ ప్రాధేయతలో భావకవి అకుంఠితమై భక్తితత్వం, పరమాత్మ సన్నిధిలోనే కాలం గడప నిశ్చయించుకోవడం వెల్లడై ఆత్మాశ్రయత్వమే ప్రతిబింబితమైంది.

భావకవి భగవతుంని గూర్చిన నిరంతర చింతననేగాక నిత్యసేవనికూడా జరపాలని ఆరాట పడ్డాడు. భగవంతునికి చేసుకొనే మనవిలో తాను ఇహలోక జీవితంలో బంధీకృతుడయ్యాడని కాళ్ళు చేతులకు, సంకెళ్ళున్నాయని గ్రహించామని-

"నీపాదాలకు నిత్య సేవనే
నెట్లు చేతునో సెలవిమ్మా?

సీనామాంకిత దివ్య గీతములు

ఎట్లు పాడుదును సెలవిమ్మా'106

అంటూ నిరంతర భగవత్ చింతనా మగ్నుడు కావడానికి ప్రయత్నం చేస్తున్నాడు. ఇక్కడకూడా భగవంతుని గూర్చిభక్తుడు చేయదలచుకున్న నిత్యసేవ, భగవంతుని పేర అంకితమైన దివ్యగీతాల గానం చెయ్యడము కవివ్యక్తిగతమైన అంశాలై ఆత్మాశ్రయత్వాన్నే కలిగి వున్నాయి.

శివ భక్తి పారవశ్యం : భావ కవిత్వంలో భక్తి తత్వం రెండు పాయలై ప్రవహించిందని ఇదివరకే పేర్కొన్నాను. భారతీయ మత దృక్పథాన్ని అనుసరించే భావ కవిత్వంలో శివభక్తి పారవశ్యం. వైష్ణవ భక్తి తత్వం ఫలప్రదంగా వర్ధిల్లాయి. ఈ రెండు రకాలైన భక్తి తత్వాల్లో భావ కవిత్వం కొంత వస్త్వాశ్రయంతో పాటు ఆత్మాశ్రయత్వాన్ని కలిగి వుంది.

భగవంతుడొక్కడే అయినా ఆదివ్య స్వరూపుని తమకు ఇష్టమైన ఆకారాలతో భావించుకొని ధ్యానించి తన్మయత్వం చెందారు భావకవులు. అటు వంటి స్వరూపాలలో శివుడు, విష్ణువు ప్రాతినిధ్యం వహించారు, శివుని రూప విలాసాలతో పాటు శివతత్వాన్నే కొనియాడుతూ భావకవులు ఆత్మప్రక్షాళనం కావించుకొని భక్తి పారవశ్యం పొందారు. ఈ స్థితి చక్కని ఆత్మ వ్యక్తీకరణతో పొంగులు వారి ప్రవహించింది, అందువల్ల శివభక్తి పారవశ్యంలో ఆత్మాశ్రయత్వం పాదులుదన్నుకొంది.

ముల్లోకాలు భరింపరాని ఆనందంతో మునిగి వుండగా ప్రతి దినసాంతంలోనూ నిత్య నూతన తాండవ నృత్యకేళి అవధరించే నటరాజును మదిని తలచుకొంటూ భావకవి పారవశ్యాన్ని పొందాడు, ఆపారవశ్యంతో శివునిలో కూడా కలసి పాడి ఆడాలంటూ అభిలషించాడు. ఆ అభిలాష వెఱ్ఱిగా తోచింది. లజ్జ విడిచి శివునిపై భక్తి దాహంతో-

'ఆటతోపాటతో నేర్చినట్లు దేవ
ఏనుకూడ నీవలె నటియింపనిమ్ము
ఎడతెగని యాత్రనెట్లు సాగింపు వలుకు;
ఎట్లానీ దర్శనమ్ము సాధింపువలుకు;'107

అంటూ ప్రాధేయపడ్డాడు. ఇలా భక్తుడు భగవంతుని లీలకు ముగ్ధుడై తన మనో భావాల్ని ప్రకటించుకోవటం ఆత్మాశ్రయత్వాన్ని కలిగివుంది. ఇక్కడ భగవంతునితో సామీప్యాన్ని, సామ్యాన్ని పొందాలన్న భక్తుని హృదయం వ్యక్తమై తన జీవిత యాత్రని భగవంతునిలా ఆటలతోనూ, పాటలతోనూ గడపాలనుకోవటం భావకవి శివభక్తి పారవశ్యాన్ని వ్యక్తం చేస్తూవుంది.

శివభక్తి పారవశ్యాన్ని పొందడమే గాక భావకవి తనను కరుణించి పాలించమంటూ శివుణ్ణి వేడుకోవడం కూడా జరిగింది. ఈ వేడికోలుకూడా ఆత్మ వ్యక్తీకరణతో ఆత్మాశ్రయత్వాన్నే నింపుకొంది. భావకవి శివభక్తి పారవశ్యంతో-

"చుక్కలు తిరిగే హిమాద్రిపై ఆ
వాసము చేసే గౌరీశా
విన్నావయ్యా నామనవొక్కటి
విన్నవించనా గౌరీశా।" 108

అంటూ ప్రారంభించి తన మనవిని శివునికి విన్నవించుకో మొదలెట్టాడు. శివుని శిరసు పూవుగా వున్నటువంటి ఆకాశగంగాజలం, చెమ్మచేత తడిసినట్టి పుణ్యభూమిలో పుట్టి, శివుని పాదాలనెడ ఎర్రనైన కమల మరందాన్ని తనివి తీరాతాగానంటూ శివునికి తనకూవున్న సంబంధాన్ని వ్యక్తం చేసుకొన్నాడు. అంతే కాకుండా సృష్టి మరుగులో తళతళ మెరిసే కాంతుల్ని చూస్తూ కాలాన్నీ, చిక్కుల్నీ దాటి కదిలే దివ్య తేజస్సును దర్శించానని పేర్కొన్నాడు. అటు తరువాత-

"యక్షులు పాడే హిమాద్రి మీద
కొలువుండే ఓ గౌరీశా
విన్నావయ్యా నా మనవిప్పుడు
పాలించెదవా గౌరీశా।" 109

అంటూభగవంతునిపాద సేవలోనూ. దివ్యగీతాలాపనములోనూ కాలం గడపడానికి మార్గం ఏదో తెలుపమంటూ వేడుకొన్నాడు. ఇలా భగవంతుని భక్తుడు శివభక్తి పారవశ్యంతో సేవించాలనుకోవడంలో కవి దృఢసంకల్పం. అకుంఠిత దీక్ష, ఆత్మార్పణా తత్వం, ఆరాధనాతత్వం చోటు చేసుకొని ఆత్మీయతా ముద్రను సంతరించుకొంది.

విష్ణుప్రీతి - మధుర భక్తి : శివసంబంధమైన భక్తి విషయంలోనే గాకా భావ కవులు వైష్ణవ భక్తి విషయంలోనూ ఆత్మాశ్రయ ధోరణినే ప్రదర్శించారు. విష్ణు సంబంధమైన కథలు, భక్తుల చరిత్రల విషయం మినహాయించి విష్ణుప్రీతితో శ్రీకృష్ణునిపై గల తమ భావాన్ని ప్రదర్శించటంలో భావకవులు ఆత్మాశ్రయత్వాన్నే ప్రకటించారు. భావ కవి విష్ణువుపై గల ప్రీతితో-

'ఒంటిగా నుయ్యాలలూగితివా
నాముద్దు కృష్ణా!
జంటగా నను పిల్వదగదోయీ!'110

అంటూ భగవంతునితో కలిసి ఉయ్యాల లూగాలని సంబర పడ్డాడు. ఇక్కడ విష్ణువుకు సంబంధించిన బాల్య లీలల్ని స్మృతికి తెచ్చుకొంటూ అంతకంటె మహా ప్రళయంలో వటపత్రంపై తేలియాడిన విష్ణువుకు జంటగా తను వుండి వుంటే బాగుండేదేమో అనుకొంటూ భావకవి తన విష్ణు భక్తిని ప్రదర్శించుకొన్నాడు.

భావకవి దృష్టిలో భగవంతుడు శృంగార నాయకుడు ఆ నాయకుని ముందు తను ప్రేయసిగా నిలుచుని హృదయ నాథునికి కానుకలు, కట్నాలు సమర్పించు కొంటూ చివరకు సర్వస్వమూ అర్పించుకోవాలని కోరుకొన్నాడు. అంతేకాదు భావకవి తనను తాను గోపికగనో, రాధికగనో భావించుకొని తన ప్రాణ నాథుడైన శ్రీకృష్ణుని వెదకడం, కానరాకపోగా కృష్ణవియోగంలో దహించుకొనిపోతూ వియోగ స్థితిలో తన బాధల్ని, మధుర వేదనాశీలాలైన అంశాల్ని గానం చేశాడు.

భగవంతుని పురుషుడుగా భావించి తన్నొక స్త్రీగా భావించుకొంటూ భావ కవి భగవంతుకై చేసిన అన్వేషణలో ఆత్మార్పణా తత్వమూ, ఆరాధనాతత్వమూ చోటు చేసుకొని ఆత్మాశ్రయంగా వెలికురికింది. ఇటువంటి స్థితే మధుర భక్తిగా ప్రకటితమయ్యింది. ఇలాంటితత్వమే ప్రాచీన కవిత్వంలో పదకవిత్వంలోనూ వుందన్న విషయం, ఇదివరకే ప్రస్తావించాడు. ఆధునిక కవిత్వంలో మధుర భక్తితో కూడుకొన్న ఆత్మాశ్రయరీతి వెంకట పార్వతీశ్వరుల "ఏకాంత సేవ" లో అధికంగా దర్శనమిస్తూ వుంది.

భావ కవికి ప్రేయసి తత్వంతో పరమాత్మ స్వరూపుడైన నాయకుని కల వాలని ఆరాటం. కానీ సిగ్గు అడ్డొచ్చింది. అటువంటిస్థితిలో-

'అన్యం బెరుగని యసహాయనౌట
మనసు నిల్పగ లేనిమానిసి నౌటఁ
ప్రేమ దాపగ లేని ప్రేయసి నౌట
నెదురునున్నట్టి ప్రాణేశునిన్నుఁ
గౌగిలింతమటన్న కౌతుహలమున
దరిచేరవచ్చుటే తప్పుగా దలచి
దీనురాలిని నన్ను దిగనాడి చనుట
ప్రియముగా దోచెనే ప్రేమ స్వరూప'111

అని ప్రేమ స్వరూపుడైన హృదయనాథుని ప్రశ్నించాడు. ఇక్కడ ప్రేయసీ ప్రియులమధ్య ప్రణయ భావంలాగే భక్తుడు, భగవంతుని మధ్య భక్తి భావం ఆత్మ గతంగా బహిర్గతమైంది. ప్రియుని కౌగిలించుకోవాలన్న ముగ్ధ హృదయంతో ప్రేయసి పడే ఆరాటం, ఆ ఆరాటంలో ప్రదర్శితమైన సిగ్గు కవి వ్యక్తిత్వాన్ని భక్తి తత్వంతో ప్రదర్శిస్తూ ఆత్మాశ్రయత్వాన్ని కలిగిస్తుంది.

పరమాత్మనే ప్రియునిగా భావించి సర్వమూ అర్పించి బ్రతుకుసాగిస్తున్న భావకవిని భగవంతుడు స్వీకరించకపోగా, చివర విరహాగ్ని ఎదలో రగుల్కొంది అతని మృదు హృదయం దహించిపోయింది. అయినా తనంతకుతాను భగవంతునికి సమర్పించుకొన్న ప్రేమ పూరిత హృదయాన్ని వెనుదీసుకోకుండా.

'నాదు జీవితకావ్యమేనాడు నీకు
నంకితముజేసి కొంటి నాయంత నేను
నాటిప్రేమాక్షరములు కన్నీటఁ గడిగి
చెరపివేయ నాతరమౌనె జీవితేశ!"112

అని అంటూ తన దృఢమైన భక్తి తత్వాన్ని ఆత్మాశ్రయ ధోరణిలోనే ప్రకటించుకొన్నాడు. తాను అమితంగా ప్రేమించే భగవంతుని ఎట్లా భావించాలో తెలుసుకోలేక వంగివంగి శిరమువాల్చి ఆయన పాదాల చెంత కృంగి పోయాడు.

ఇటువంటి స్థితిలో కూడా భావ కవికి తన పాపాలూ, దోషాలూ కనిపించాయి. పాపముతో నిండినహృదయంతో భగవంతుని తాకితే తన హృదయం ముక్కలౌతుందని భయపడ్డాడు. అందుకే.

"అనలేను అనలేను
అధరామృతమును నాథా!
ప్రాణదానమిచ్చి తాపబాధల పోగొట్టనీదు
ప్రణయామృతమానలేని భాగ్య హీనురాలదేవ!
నిలువలేను, నిలువలేను
నిన్ను గౌగిలింప లేను
ప్రేమ పవిత్ర మ్మగు నీ హృదయమ్మును దాకినంత
పాపమునిండిన నాయెద ప్రయ్యతాను గాదె నాథా!"113

అంటూ వ్యాకుల మనస్కుడై వాపోయాడు. భావకవి మధుర భక్తి తత్వంతో పారవశ్యంచెందుతూ ఒక్కొసారి తన తప్పిదాన్ని గుర్తించినా ఒక్కొసారి దాన్ని సమర్థించుకోజూచాడు. ప్రణయనాధునిపై వలపుగొని ఆ వల్లవంతలో సోలిపోవడమే భక్తుని అభీష్టం. అందుకే—

'కన్నార నాథుని గాంచకయున్న
క్షణమైన గడుపంగ జాలని నేను
శ్రితజనావనుకొల్వు - సేవింప కున్న
నిమిషమైన నిల్వ - నేరని నేను'114

'ప్రేమ గీతాలలో ప్రియుని పేరెత్తి
గద్గద సత్వమును గాంచుటకంటె
విశ్వధరుండైన - విజ్ఞానమయుని
దేల గన్నులలోన దేల్చుట కంటె
దాసిచేసినయట్టి తప్పేల గలదో?
అనతిమ్మని స్వామి - నడుగుదుగాని"115

అని ప్రణయైక నాథుడైన భగవంతుని అన్ని విషయాలు అడిగి తెలుసుకోవాలను కొన్నాడు. ఇలా భావకవి భగవంతుని ప్రణయ దృష్టితో చూడటంవల్ల ప్రేయసీ ప్రియుల మధ్య వుండే ప్రేమ భావ వ్యక్తీకరణములాగే ఆత్మాశ్రయం జాలువారింది.

భక్తి పూరిత హృదయంతో భగవంతుని ఆశ్రయించిన ప్రేమ భక్తుడు భగవత్స్వరూపంలోనే కాకుండా ఆయన వస్తువులమీద కూడా మక్కువ పెరిగింది

అలా మక్కువని పెంచుకొన్నవాటిలో వేణువు ప్రధానమైంది. ప్రియుడైన భగవంతుడు వేణువు ఊదితే చాలు ఆ వేణుగాన మాధుర్యాన్ని భరించలేని తత్వం ఏర్పడింది. ఆ తత్వంతో నెచ్చెలికాడైన భగవంతుని-

'మోహియింప కోయ్ మురళి
మోహియింప కోయ్ కృష్ణ
తీయ తేనియ బరువు
మోయలేదీ బ్రతుకు
....
మోహియింప కోయ్మురళి
మోహియింప కోయ్ కృష్ణ"116

అని ప్రాధేయ పడ్డాడు. ఆ గాన మాధుర్యం అటువంటిది. ఎక్కడ వున్నా పట్టి పిలుస్తుంది, పరవశింపజేస్తుంది ఆ పిలుపులో, పారవశ్యంలో జన్మజన్మాంతర వాసనలు పొడ సూపుతాయి. భగవంతునికీ, భక్తునికీ మధ్యవున్న బంధాన్ని గుర్తుకుతెస్తుంది. అప్పటి భగవంతుని ఆ పిలుపుకు భక్తుడు తాళలేక పోతాడు. ఈ స్థితే ఇక్కడ కనిపిస్తూవుంది, బావకవి భక్తి భావాన్ని ప్రదర్శిస్తూ ఆత్మాశ్రయత్వాన్ని వింపుకొని వుంది.

భగవంతునికేగాక భగవత్సంబంధమైన వేణుగానానికి కూడా ముగ్ధుడై తన్మయత్వం పొంది భావకవి ఆదివ్య అనుభూతులలో తానొక్కడే కాకుండా సమస్త సృష్టే పులకించి పోతూవుందని భావించాడు. ఆ అనుభూతి తాలూకు మాధుర్యం తన జన్మసాఫల్యం పొందినదనుకొన్నాడు. అందుకే-

'హృదయములు ప్రేమచే నేకమైన
లీల, శృతిలోన వేణువు లీనమయ్యె,
విశ్వమెల్లను నిండిన ప్రేమరాగ
మటు, నీరాగమెల్లర నావహించె.
ఒక్క వరి కోకిలమ్మటు, లొక్కసారి
గరుడ గంధర్వ కిన్నరీగాన ఫణితి
.... .... .... .... .... .... ....
.... నీపాట మమునూపె నౌర కృష్ణ'117

అంటూ తనొక్కడేకాక సమస్త సృష్టి ఆవేణుగాన మాధుర్యంలో సొక్కి సోలిందని భావించాడు. ఇలా భావించటంలో భావకవి వేణుగానంతో తానొక్కడే పారవశ్యం చెందటం అటుంచి ఇతర ప్రాణుల సమస్త సృష్టి పారవశ్యాన్ని కూడా తనకాపాదించుకొని చెప్పటంవల్ల ఆత్మాశ్రయత్వమే తొంగి చూస్తూ వుంది.

భగవదైక్య ఆరాటం : భగవంతుని ప్రణయ భావంతో సేవించినప్పటికీ భక్తుని ఆరాటం చల్లారలేదు భక్తి పారవశ్యంలో భగవంతుని కొలిచి నప్పటికీభక్తుని మనసు ఊరట చెందలేదు. చివరకు భగవంతునిలో ఐక్యంకావాలని భక్తుడు తాపత్రయ పడ్డాడు పరమాత్మతో జీవాత్మ ఏకం కావటంతోటే తనబాధలు తన కష్టాలు తనదుఃఖమూ పరిసమాప్త మౌతుందని భక్తుడైన భావకవి భావించాడు. ఇలా భావించటం వల్ల భగవంతునితో ఐక్యంకావటం కోసం అనేక ప్రయత్నాలు చేశాడు ఈ ప్రయత్నాల్నివ్యక్తం చేయటంలో కూడా భావకవి భక్తి ఆత్మాశ్రియంగానే వెలువడింది.

భగవంతునిచేరుకొని ఆయనలో లీనం కావాలన్నఆరాటం భావకవి హృదయంలో పొడచూపగా అధికమైన ఉత్కంఠ అతని మనసులో రాపాడింది. మబ్బుతో కూడిన చీకట్లు క్రిమ్ముకొనక మునుపే అనుపమానమైన ప్రణయాతిధేయంతో పారదెరచిన తన హృదయ కవాటంలోకి భగవంతుని ఆహ్వానించాడు. భావకవి. ఈ ఆహ్వానంలో భగవంతునిలో ఐక్యం కావాలన్న ఉత్కంఠఅధికంగా కనిపిస్తుంది. హృదయ పీఠంలోని పుష్పాలువాడి పోతూ వుండగా, హారతికునుకుతూ వుండగా ఒంటరిగా బాధల్ని ఎలా ఓర్చుకోగలనంటూ భావకవి భగవంతునితో –

> 'ఏమి దోషంబు దలచి నన్నీవియోగ
> శోకమున ముంచి బాధింప జూచెదీవు?
> చెప్పరాదొకో, ఇటకురానొప్పలేని
> వెదికి కొనివత్తు నేనె నీపదము జేర'[118]

అన్నాడు. ఇక్కడ కూడా భగవంతునితో భక్తుడు ఐక్యం కావాలనే తాపత్రయం భావకవి ఆత్మగతమైందిగా వుండి ఆత్మాశ్రయతనే కలిగివుంది.

సౌందర్య రసైక జీవియైన భావకవి భగవంతుని సన్నిధానంలో తప్ప ఇంకెక్కడ క్షణమైనా నిలువలేననుకొన్నాడు. భగవదైక్యమే కాకున్నా ఆయన పాదాల మంజీర నిస్వనాలైనా తన జీవిత శూన్యమార్గంలో మ్రోగితే చాలను కొన్నాడు. ఈవిషయాన్ని కూడా భావ కవి ఆత్మాశ్రయ రీతిలోనే వెలిబుచ్చాడు.

'ఏవిధాన సౌందర్యం పైక జీవి
నిలుప నేరుతు నిట నొక్క నిముసమేని
మామకీన జీవితశూన్యమార్గముల త్వ
దీయ పాదమంజీర ముల్ మ్రోయకున్న"119.

భావకవి భగవంతునితో ఐక్యం కావాలనే తాపత్రయంతో, పాటే భగవం తునితో కూడా కలిపి శృతి కలిపి పాడనిశ్చయించుకోవటం లోకూడా ఆత్మాశ్రయ త్వమే వుంది బాగా శుష్కించిన తన గళంలో భగవంతుని కరుణారసామృత శ్రీవిభవాన్ని నింపి మధురింపుమని భగవంతుని వేడుకోవటంలో భక్తి పూరిత మైన తత్వమే వుండి భగవంతుని సాన్నిధ్యాన్ని పొందడంలోనిపరితప్త హృద యాన్ని బయలు పరుస్తూ వుంది. ఈ భావాన్ని భావకవి రమణీయంగా -

'ఏ విధినైన పాడుమనియే వచియింతువని యేని
ప్రేమమై నీవే రచించి నాకు కరుణించిన
నీ ప్రణయార్ద్ర గీతికల్ గావున
నావిశుష్కిత గళమ్మున నీ కరుణారసామృత
శ్రీ విభవమ్ము నింపి మధురింపుము
నేశ్రుతిఁగల్పి పాడెదన్'120

అంటూ చక్కని ఆత్మాశ్రయ రీతిలోనే వ్యక్తం చేశాడు.

భావకవి తన్నొక పూజాకుసుమంగా భావించుకొంటూ భగవంతుని పాదాల చెంత చేరాలనే తాపత్రయాన్ని కూడా వక్తీకరించాడు. ఇలా వ్యక్తం చెయ్యటం కూడా ఆత్మాశ్రయ రీతినే వింపుకొంది. విచ్చినటువంటి రేకులు వాడిపోతాయో, తొడిమ వీడి ధూళిలో, పడుతుందో తేనెల సొనలు తీరిపోతాయో, ఏమో అని భగవంతుణ్ణి తనను స్వీకరించమంటూ

'కోసుకొనుము యీకోమల కుసుమము
కోరి విరిసె నీకోసమే స్వామీ!
తేనెల సొనలు తీరక మునుపే
తీయని వలపులు పోయక మునుపే
కోసుకొనుము యీ కోమల కుసుమము
కోరి విరిసె నీకోసమే స్వామీ"121

అని విన్నవించుకొన్నాడు. ఈ విన్నపంలో భగవదైక్య ఆరాటంతో కూడుకొన్న భావకవి హృదయమే వ్యక్తమౌతూవుంది. ఆత్మాశ్రయతని నింపుకొంది.

ఇలా భావకవిత్వంలో భక్తి విషయంలోకూడా ఆత్మాశ్రయతే బలీయంగా దర్శనమిస్తూవుంది. ఇలా భావకవిత్వంలో భక్తి విషయంలో ఆత్మాశ్రయత్వం బలీయంగా వుండటానికి కవిమానసిక ప్రవృత్తే కారణం. కవి ప్రణయ భావంతో ఆరాధనాభావంతో. ఆత్మార్పణా తత్వంతో భగవంతుని ప్రేమించటం వల్ల భక్తి వ్యక్తి గతమైన అంశంగానే వెలవడింది.

దేశభక్తి - ఆత్మాశ్రయత్వం : భావ కవిత్వం కాలం నాటికి (1930-1940) భారతదేశం పారతంత్ర్యంతో సతమతమౌతూ వుండేది. పాశ్చాత్యుల పరిపాలనలో భారతదేశ ప్రజలు చాలా ఇబ్బందులకు గురయ్యారు. అటువంటి పరిస్థితుల్లో భావ కవులు దేశ ఔన్నత్యాన్ని చాటిచెపుతూ, దానికి పట్టిన దుస్థితిని ప్రకటిస్తూ ప్రజల్లో స్వాతంత్ర్య కాంక్షను రేకెత్తించడానికి రచనలు చేశారు.

పారతంత్ర్యంలో మగ్గిపోయిన ప్రజల్లో దేశంపై ప్రీతి, గౌరవం బల పడ్డాయి. ఆ కారణంతోనే తాము ఏమి పోగొట్టు కొన్నారో తెలుసుకోగలిగారు. కష్టాలూ ఇబ్బందులకు గురికావటం మూలకంగా వారి గుండెలను ఒరసుకొంటూ దేశభక్తి కవిత్వం ప్రవహించింది. నలిగిన హృదయాలను ఒరసుకొంటూ ప్రవ హించిన దేశభక్తి కవిత్వం కూడా ప్రకృతి, ప్రణయం, భక్తి మొదలైన అంశాల్లో లాగే కవి ఆత్మీయతాముద్రను నింపుకొని వెలువడింది.

చిలకమర్తి, రాయప్రోలు గురజాడ, వేదుల, కాటూరి, దువ్వూరి, తుమ్మల, జాషువా, గరిమెళ్ళసత్యనారాయణ, వేటూరి శివరామశాస్త్రి, చెన్నాప్రగడ భానుమూర్తి, మంగిపూడి వెంకటశర్మ, ముట్నూరి వెంకటసుబ్బారాయుడు. బలిజేపల్లి లక్ష్మీ కాంత కవి మొదలైన ఆధునిక కవులు దేశభక్తి కవిత్వాన్ని రచించారు. వాళ్ళంతా దేశాన్ని దైవంగా. జాతీయతనే మతంగా మార్చుకొన్న ఆదర్శ జీవులు, తమ సర్వ స్వాన్ని దేశం కోశం, జాతికోసం అర్పించి రచనలు చేశారు. తల్లిని, చెల్లిని, భార్యనూ ఎలా ప్రేమించారో అలాగే దేశాన్ని ప్రేమించారు.

> 'శ్రీలు పొంగిన జీవగడ్డయి
> పాలు పారిన భాగ్య సీమయి
> వ్రాలినది ఈ భరత ఖండము
> భక్తి పాడర తమ్ముడా'[122]

అంటూ దేశ సౌభాగ్యాన్ని గానం చేశారు భావకవులు. అంతేకాకుండా -

> 'ఏదేశ మేగినా, ఎందు కాలిడినా
> ఏ పీఠమెక్కినా, ఎవ్వరేమనిన
> పొగడరా నీతల్లి భూమి భారతిని
> నిలుపరా నీ జాతి నిండు గౌరవము'[123]

అంటూ దేశసౌభాగ్యంతో పాటు, జాతినీ, దాని ఔన్నత్యాన్నీ గర్వంగా చెప్పు కొంటూ జాతీయ సమైక్యతని నోరారా కీర్తించాడు 'జననీ జన్మభూమిశ్చ స్వర్గా దపి గరీయసి" అన్న ప్రాచీనసూక్తిని అనుసరిస్తూ జాతీయతా భావంనుంచి పుట్టిన దేశ భక్తి ఆధునికాంధ్ర కవిత్వంలో రెండుపాయలుగా ప్రవహించింది. ఇందులో ఒకటి భారత జాతీయతని నింపుకొన్నది కాగా వేరొకటి ఆంధ్రాభిమా వాన్ని నింపుకొన్నది అయింది. ఈ రెండుకోవలకు చెందిన దేశభక్తి కొంత వస్త్వా శ్రయంగానూ, మరికొంత ఆత్మాశ్రయంగానూ వెలువడింది.

ప్రకృతి కవిత్వంలోనూ, ప్రణయ కవిత్వంలోనూ, భక్తి కవిత్వంలోనూ, ఇదివరకే వివరించినట్లూ కొంత వస్త్వాశ్రియం వున్నట్లే దేశభక్తి కవిత్వంలో కూడా వస్త్వాశ్రియం వుంది. భారత జాతీయతని, ఆంధ్రాభిమానాన్ని ప్రకటించిన కొందరు కవులు పురాణ ప్రసిద్ధం అయిన ఇతివృత్తాల్నో, చారిత్రిక ఇతివృత్తాల్నో ఆధారంగా తీసుకొని దేశభక్తిని ప్రబోధించే గేయాలు రచించారు. ఇటువంటి రచనలు వస్త్వాశ్రయ రీతిలో కొనసాగాయి. దువ్వూరి రామిరెడ్డి, కరుణశ్రీ, తుమ్మల సీతారామమూర్తి,మొదలైన వారు భారత జాతీయతని వస్త్వాశ్రయరీతిలో ప్రదర్శించారు[124]. విశ్వనాథవారి 'ఆంధ్రప్రశస్తి' ఆంధ్రాభిమానాన్ని ప్రకటిస్తూ వస్త్వాశ్రయ పద్ధతిలో కొనసాగిన రచన[125].

రాణా ప్రతాపసింహ చరిత్ర, శివభారతం వంటి రచనలు భావ కవిత్వకాలం నాటికి మునుపే భారతజాతీయతని నింపుకొని వెలువడ్డాయి. భావ కవిత్వకాలంలో కొన్ని ఖండకావ్యాలు, మరికొన్ని ఖండికలు వస్త్వాశ్రయ రీతిలో భారత జాతీయతని ప్రకటిస్తూ వెలువడ్డాయి దువ్వూరిరామిరెడ్డి 'ద్రౌపదీ సందేశము' కరుణశ్రీ 'ధను ర్భంగము' పెనుమర్తి వెంకటరత్నం 'దీపావళినాడు' వంటి ఖండ కావ్యాల్లో పౌరాణిక, చారిత్రిక, వస్తువులను స్వీకరించి భారతజాతీయతను ప్రబోధించారు. ఇటువంటి రచనలు ఈ కాలంలో చాలా వెలువడ్డాయి. ఇలాగే ఆంధ్ర దేశాభి

మానాన్ని రేకెత్తించే గేయాలు వస్త్వాశ్రయరీతిలో వెలిబుచికాయి. కొడాలి 'హంపీక్షేత్రము' జి జె. సోమయాజీ 'రామచంద్రుని హంపీయాత్ర" ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, 'దక్షారామము'. శ్రీనివాస సోదరుల "ఓరుగల్లుకోట" పుట్టపర్తి నారాయణచార్యుల "పెనుగొండలక్ష్మి' వంటి రచనలు ఆంధ్ర. దేశాభిమానాన్ని చాటుతూ వస్త్వాశ్రయంగా కొనసాగిన రచనలని చెప్పవచ్చు.

పూర్వ వైభవాన్ని చాటి చెప్పే దేశాభిమాన రచనలుకూడా ఆకాలం నాటి రాజధానుల, నగరాల, ప్రభువుల వివరాలను వెల్లడిచేసేవిగా వుంటూ వస్త్వాశ్రయంగానే కొనసాగాయి. అంతేకాకుండా ప్రబోధగేయాలు కూడా వస్త్వాశ్రయత నే కలిగి వున్నాయి దేశభక్తి ప్రజల్లో రేకెత్తించటం కోసం భావకవులు వారి సమకాలిక కవుల దేశభక్తి ప్రబోధగేయాన్ని రచించారు. ఇవి కవి వ్యక్తిగత భావాలను చూపకుండా దేశంకోసం ప్రజలు చేయవలసిన త్యాగాలకు తిరుగుబాట్లకు సంబంధించిన వివరాలతో కొనసాగాయి. ఇటువంటి రచనలుకూడా వస్త్వాశ్రయత కలిగి వున్నాయి. దీనికి భిన్నంగా భారత దేశాభిమాన కవిత్వంలోనూ, ఆంధ్ర దేశాభిమాన కవిత్వంలోనూ ఆత్మాశ్రయత్వం వుంది.

భారత దేశాభిమానం : కొంతమంది భావకవులు, వారి సమకాలికులు రచించిన దేశభక్తి కవిత్వంలో వారి హృదయంనుండి పెల్లుబికిన ఆత్మాభిమానం అధికంగా వుండి ఆత్మీయతని నింపుకొంది. కొంత మంది కవులు దేశాన్ని శరీరంకంటే, ప్రాణం కంటే అధికంగా ప్రేమించారు. ఆ ప్రేమతీవ్రతతో తమ దేశంపైగల గౌరవ భావాన్ని. భక్తి భావాన్నీ ప్రకటించుకొన్నారు. మంగిపూడి వెంకటశర్మ భావకవిత్వంలోని ఆత్మాశ్రయ రీతిచేత ప్రభావితుడై -

"నా మాతృదేశమా, నా ప్రాణ ప్రదమా
నానాకలోకమా, నా తపఃఫలము
నాప్రాణములకన్న, నామేనికన్న
నతి గాఢముగ నిన్ను నాత్మ ప్రేమింతు"[126]

అని భారత దేశంపై తనకున్న అభిమానాన్ని అనురాగ పూరిత హృదయంతో వ్యక్తం చేశాడు. తనకు ప్రాణప్రదమైన మాతృదేశాన్ని అతిగాఢంగా ప్రేమిస్తాను అని అనడం. కవిఆత్మాశ్రయతకు నిదర్శనం. భావకవులు మాతృదేశ సౌభాగ్యం కోసం, జాతిసౌభాగ్యం కోసం, ప్రాణాల్ని సైతం అర్పించాలని భావించారు. భావ కవితా సంప్రదాయాల్ని అలవరుచుకొన్న అయ్యపు వెంకట కృష్ణయ్య-

'నాజాతి కోసమై
నా హక్కు కోసమై
ప్రాణాన్ని తృణముగా పణముపెట్టేస్తాను
కుటిల రాజ్యాంగాన్ని కూల్చి వేస్తాను
సామ్రాజ్యవాదాన్ని పదమం చేస్తాను'127

అంటూ స్వదేశం పైనా స్వజాతిపైనా తనకున్న మక్కువకొద్దీ ప్రాణానికి నష్టం కలిగినా లెక్క చేయక పోరాడ సాహసించాడు. ఈ సాహసంలో ఆత్మాభిమానం, దేశభక్తి పెనగొన్న కవి హృదయం బహిర్గతమౌతూవుంది: ఆత్మాశ్రయతనే కలిగి వుంది.

పారతంత్ర్యం నుంచి దేశమాతను విముక్తి చేసుకోవటం కోసం భావ కవి జనయిత్రిపై ప్రేమతోనూ, గౌరవంతోనూ కాకుండా భక్తి భావంతో పూజింప దొడగాడు. ఆ పూజాద్రవ్యాలు. వెలలేనివి. ప్రాణాన్నీ, . ధనాన్నీ, మానాన్నీ, పూజా పుష్పాలుగా అర్పించాడు ఆరాధనా తత్వంతో. భారతజాతికి భారతమాతపై వున్న భక్తి భావం చాలాగొప్పది అని చాటి చెప్పటానికి ఆత్మాశ్రయ రీతిలో కవి-

'కోటి గొంతులు పారతంత్ర్యో
చ్చాట జయగీతముల పాడుచు
నాపెదము నీ కేతనము నా
నా దిగంతములన్
ప్రాణధమానముల పూజా
ప్రసవములుగా నీ మహోజ్జ్వల
పాద పీఠిక నుంతుమమ్మ'' 128

అన్నాడు. భావకవి ఇక్కడ భారత జాతి సర్వస్వాన్నీ తానుగా భావించి దేశభక్తి నంతా తనదిగా అనుభవించి ఆత్మాశ్రయ రీతిలోనే ప్రకటించాడు.

సహజమైన దేశభక్తి తత్వంతో కాటూరి మాతృస్తవం చేస్తూ పారతం త్ర్యంలో మగ్గిపోతున్న దేశ మాతకు సకల సంపదలు సమకూరి అదృష్టం కలి సొచ్చి పారతంత్ర్యం తొలగిపోవాలని కాంక్షిస్తూ-

'....భారత మాతను యనవ రతము
తలచి, ఋణమును దీర్పగా తరలి రండు
జనని, దుఃఖమ్ము మాన్పని జన్మమేల?'129

అంటూ దేశభక్తి పూరిత హృదయంతో దేశమాతతనయుల్ని మేల్కొల్పుతున్నాడు.

ఇలాంటి భావంతోనే దేశభక్తి నిండిన హృదయంతో ఇంకో కవి భారత మాత వైభవాన్ని, సరిహద్దు ప్రాంతాల్ని కొనియాడుతూ -

'.... ....నిను జూచి బిచ్చంబు బెట్టుమనుచు
అన్ని దిక్కులు యాచించు చున్నవమ్మ
ఐకమత్యంబు గల్గి నిన్ననుభవించు
కొఱత పూరింపవే మాకు భరత మాతా'130

అంటూ చక్కని ఆత్మాశ్రయతని జాల్వార్చాడు. భారత జాతి కంతటికీ ఏకైక ప్రతినిధిగా తన్ను భావించుకొని ఈ కవి తమలో కొరవడిన ఐకమత్యాన్ని ప్రసాదించమని భారత మాతను వేడుకొన్నాడు. ఈ వేడికోలులో కవిఆత్మీయత ప్రతిబింబిస్తూవుంది.

దేశ సౌభాగ్యాన్ని కొనియాడుతూ ఇంకొక భావకవి-

'పుడమి చేతియకు గొప్పున మల్లెపూదండ
పొలుపు గల మాజన్మ భూమి భారత ధాత్రి
ఎంత చక్కని తల్లివే! రాణివే! ఎల్లభూములకు, నీవు.

ముక్కారు పంటచేలు మితిలేని
రొక్కములు మూల్గునిధులు
చక్కనగ, పూదోటలు-మాతల్లి సౌభాగ్యవతివినీవు
దిక్కులన్నీ వెదకినా నీవంటి దేశమేదీ పుడమిపై'131

అని తన మనోభావాన్ని ప్రకటించాడు. ఇక్కడా కవి ఆత్మీయతే వెల్లడై ఆత్మాశ్రయంగానే ఈ కవిత వెలికురికిందిగా అగుపిస్తుంది.

సౌభాగ్యాన్ని నింపుకొన్న భారత మాతని భావకవి చక్కని ఆత్మాశ్రయ రీతిలో ఒకే ఒక్క కోరిక కోరుకున్నాడు, ఆశోకిక తల్లినితనయుడు బువ్వకోసం ప్రతిమాలు తున్నట్లుంది చూడండి.

'ఆరని మంటగా బ్రతుకు నందు రగుల్కొనుచున్నదొక్కటే
కోరిక, నీ కృపావనికి కోకిలనై కొనియాడుకొందు మం
దార సుమారుణ ద్యుతి వితానముగొల్పెడి నీ మనోహరా
కారముతో మధూదయ వికాసము నింపుము తల్లి! నాయెదనే' 132

ఆంధ్రి దేశాభిమానం : భావ కవి భారతదేశాన్ని, భారతదేశ సౌభాగ్యాన్ని కొనియాడడంతో పాటే తనకు అతిసన్నిహితమైన తెలుగు నేలను కూడా భక్తి తత్వంతో కొనియాడాడు. ఒకప్పటి తెలుగుదేశం వైభవాన్ని తలపోసి తలపోసి కుమిలిపోయాడు సుకుమార మనస్కుడైన భావకవి. గతించిన తెలుగుదేశ సంపదల్ని ప్రశంసిస్తూ, ఆనాటి తెలుగు వీరుల శౌర్య పరాక్రమాల్ని స్మరిస్తూ అప్పట్లో తాను జన్మించనందుకు చింతించాడు. ఈ చింతలో బాధగ్రథితమైన ఆకలి హృదయం, కవి ఆవేదనా ప్రస్ఫుట మయ్యాయి.—

'పాటలీ పుత్రమ్ము కోటకొమ్ముల మీఁదఁ
తెలుగుఁజెండా నర్తించునాఁడు
ఢిల్లీకు నెదచెండిన తెల్గువిలుకాండ్రు
నవలక్షలోరుగల్ గవియునాడు
రాచూరు కదనమందే చితశ్శితశమంచుఁ
తెలుగు జోదుల కత్తి తిరుగునాడు
అరచోళపాండ్యసీమలఁ దెల్గు సరదార్ల
పసుపు సూయాణమై ప్రాకునాఁడు

చూచి సంతోష భారంబు మోచి శిరము
నూఁచు భాగ్యంబునకు నింత నోఁచలేక
యేల పుట్టితిని పూడిసీ యేటి బ్రతుకు
కటికటి దాటి పోయే బంగారు యుగము' 133

అంటూ భావకవి గతకాలంలోని వైభవాన్ని తలపోసుకొంటూ అంతర్ముఖుడై తాను పోగొట్టుకొన్నవి ఏమిటో తెలుసుకొని, ఆ సుఖసంతోషాలకు తాను నోచుకోలేక పోవడంతో తన పుట్టుక కూడా వృథా అయింది అంటూ తన్ను తాను అసహ్యించుకొన్నారు.

తెలుగునాట జాల్వారిన మాధుర్యమే తన నోట తీయని మాటలు పలికిస్తు న్నాయని భావకవి అటువంటి తెలుగు తల్లిని కొల్చిన తన కన్నులు ఆణిముత్యా లౌతాయని భావించుకొంటూ —

> 'తెనుగు తల్లీ నీకు జోహారు
> దేశమాతా నీకు జేజేలు
> నినుజూచి నినుబాడి నిను గొల్చువేళ నా
> కనులాణిముత్యాల గనులుగా నగునహో
> తెనుగు తల్లీ నీకు జోహారు
> దేశమాతా నీకు జేజేలు
> నీపాలు జుంటి తేనియ తేటలో నోస్త
> నీపకస్తూరిసమానుఘారసపూరమో యోట
> నాపల్కులీ తీయనకు నోంచి విశ్వ
> వాణీప్రపంచ ప్రశంసాపూరితములాయె'134

అని పేర్కొన్నాడు. ఈ గానంలో కూడా మిక్కుటమైన ఆంధ్రాభిమానమే ఆత్మా శ్రయరీతిలో వెల్లడయింది. తెలుగు తల్లి తీయందనాలు కేవలం కవి పలుకుల మాధుర్యం వరకే కాకుండా ప్రపంచం అంతటా ప్రశంసకు నోచుకొన్నాయని కవి పొంగారిన హృదయంతో సొక్కిపోయాడు. అంతటి మాధుర్యం తెలుగు భాషలో వుంది కాబట్టే తెలుగు కవితకు అతులిత మాధురీ మహిమ చేకూరిందని భావించాడు.

'కృతజ్ఞతాబద్ధమైన డెందముతో, భక్తిసంపన్నమైన కైమోడ్పుతో.... నాంధ్ర భారతా చరణపీఠికపై నొక పూజాపుష్పము'135 సమర్పించుకొంటూ భావ కవి సాధించిన తపస్సిద్ధితో -

> 'తెలుగుందేవతలెల్ల వచ్చి నిడు ప్రోల్ దీర్ఘమ్ముగా మాతెనా
> తెలుగుం గొల్వున కాటపట్టయిన యీ దేశమ్ములో సాధ్వియో
> తలి జన్మించిన గడ్డలో జయజయధ్వానమ్ములం గంటినా
> తొలి నోముల్ ఫలియించె నేడు పితృపాదుల్ పెంచుధర్మంబులున్'136

అంటూ హృదయం నుండి పొంగి పొరలి జాల్వారిన రసోద్రిక్త భావనాశిల్పావి ష్కరముందుంచాడు.

ఆంధ్రమాత కంఠ సీమలో కాంతిప్రతంగా ఉద్దీపించే కృష్ణ, గౌతమి, తుంగభద్రలను వాటిపై వున్న మక్కువను ప్రదర్శిస్తూ రాయప్రోలు-

'తేటల్ దేరెడు కాంతిపూరములనుద్దీపించు ముత్యాల ము
ప్పేటల్ వోలె ద్వితీయకంఠమున శోభింపుల్ నిగారించు, చే
నాటన్ జీవన శోషణల్ గనిన కృష్ణాగౌతమీ భద్రలన్
గాటంపుందమిఁదార్పువారమిదె కాంక్షాక్షీరమాంధ్రవసీ'[137]

అన్నాడు. ఈ పద్యంలో కూడా భావకవి హృదయం ఆంధ్రమాతపై గల అభిమానం వెల్లడవుతూవుంది. ఆత్మాశ్రయత్వమే ద్విగుణీకృతమయ్యింది.

భారతదేశంపైనా, తెలుగు నేలపైనా తమకున్న అభిమానంకొద్దీ గానం చేసిన భావకవుల రచనల్లో ఆత్మాశ్రయం ఇలా ప్రతిబింబిస్తూ వుంది. దేశనాయకులు మరణించినప్పుడు వారి వియోగంతో కుమిలి కన్నీరుకార్చిన కవుల రచనల్లో కూడా ఆత్మాశ్రయత్వమే పాదుకొన్నది. ఈ విషయం స్మృతికవిత క్రిందికి వస్తుంది కాబట్టి దాని ప్రస్తావన స్మృతి ఆత్మాశ్రయత్వం అనే శీర్షిక క్రింద పరిశీలిద్దాం.

**స్మృతి-ఆత్మాశ్రయత్వం :** భావకవిత్వంలో స్మృతికవిత్వం పాశ్చాత్య సాహిత్య ప్రభావాల్ని పులుముకొంది. దీన్నే ఆంగ్లంలో 'ఎలిజీ' అని వ్యవహరిస్తున్నారు. ఎవరైనా దగ్గరి బంధువులో, ఆత్మీయులో శాశ్వతంగా ఎడబాసినపుడు కవి వారి ఎడబాటుతో పొందిన బాధని కవితారూపంలో వెల్లడించుకొంటే అది స్మృతి కవితగా పేర్కొనబడుతూ వుంది.

ఈ స్మృతి కవితా లక్షణాలు ప్రాచీన కవిత్వంలో వున్నప్పటికీ అంత స్పష్టంగా అవి స్మృతి గీతాలుగా రూపు సంతరించుకోలేదు. శ్రీనాథుడు, పెద్దన వంటి కవులు చెప్పిన చాటువుల్లో ఈ స్మృతి కవితా లక్షణాలు కనిపిస్తున్నాయి. స్మృతి కవిత భావకవిత్వ కాలం నాటికి ఒక కవితా శాఖగా పరిపుష్టమైంది.

బాగా కలిసిమెలిసి, కష్టసుఖాల్ని అనుభవించిన భార్యో, భర్తో, పుత్రుడో, పుత్రికో, బంధువులో, మిత్రులో లేక గౌరవ ప్రపత్తులు సంపాదించుకొన్న దేశనాయకుడో మరణించినపుడు వారిని అధికంగా ప్రేమించేవారికి గౌరవించేవారికి భరింపరాని దుఃఖం కట్టలు తెంచుక ప్రవహిస్తుంది. ఆ బాధలో మునిగిని వారి

కలుపులతో కావ్య రచనకు పూనుకొన్న కవుల రచనల్లో వారిరువురి మధ్య బలీయంగా వున్న ప్రేమ కారణంగా ఆత్మీయతా ముద్రతో ఆ రచన జాల్వారుతుంది. క్షణికమైన ప్రేయసీ వియోగానికే తల్లడిల్లిపోయిన భావకవుల హృదయం వారి బంధుమిత్రుల్ని కోల్పోయినపుడు బాధతో మూల్గింది. అటువంటి స్థితిలో ఆత్మ ప్రకటన చేసుకొంటూ భావకవులు తమ బాధనంతా కవిత్వంగా మలిచారు. ఇలా వెలువడిన స్మృతి కవిత్వంలో ప్రకృతి, ప్రణయం, భక్తి, దేశభక్తి కవిత్వంలో లాగే ఆత్మాశ్రయత్వం గూడుకట్టుకొంది.

స్మృతి కవిత్వం అంతా ఆత్మాశ్రయత్వాన్నే నూటికి నూరుపాళ్ళు నింపుకొని ప్రవహించింది. ప్రకృతిని వస్త్వాశ్రయ పద్ధతిలో అన్యాపదేశంగా చిత్రించవచ్చు. ప్రణయాన్ని కూడా వస్తుగతంగా ప్రకటించవచ్చు. భక్తిని, దేశభక్తిని అల్లే వెల్లడిచేయవచ్చు. కానీ తన సొంత బంధువులో, మిత్రులో ఎడబాసినపుడు కలిగే దుఃఖాన్ని, ఆవేదనని వస్త్వాశ్రయంగా వ్యక్తం చేయడానికి వీలుండదు. ఆప్తుల ఎడబాటు గుండెకోత. ఆ గుండెకోతని ప్రణాళికా బద్ధంగా వ్యక్తం చేయడానికి వీలుండదు ఒకవేళ అలా వ్యక్తంచేసినా ఆభాస అవుతుంది. అందువల్ల స్మృతి కవిత్వం భావకవిత్వశాఖల్లో స్వచ్ఛందమైన ఆత్మాశ్రయతకుదాహరణగా నిలుస్తుంది

తల్లిగానీ, తండ్రిగానీ, భార్యగానీ, భర్తగానీ, బిడ్డగానీ, మిత్రుడుగానీ, తనకు ప్రీతిపాత్రుడైన ప్రియతమ దేశనాయకుడుగానీ మరణించినపుడు ఆమరణ వార్త బాధపెట్టేది కవి హృదయాన్ని. మరణవార్తాశరాఘాతానికి కవిగుండె గాయమవుతుంది. ఆ గాయం నుంచి బాధారుధిరం ప్రవహిస్తుంది. అటువంటి బాధా గ్రథిత హృదయం నుంచి వెలువడటంచేత స్మృతి కవిత్వంలో ఆత్మాశ్రయత్వమే అధికంగా వుంటుంది. ఇక్కడ కల్పనకుగానీ, ఊహాధిక్యతకుగానీ, వర్ణనలకుగానీ తావుండదు. ఎడబాసిన వ్యక్తి ఔన్నత్యాన్నో, అతని హృదయాన్నో కొనియాడేదిగా వుండి స్మృతి బాధామిళితమై వుంటుంది. అంతేకాకుండా మరణించిన వ్యక్తి లేకపోవటంవల్ల కవి జీవితంలో ఏర్పడిన లోటు, పేరుకపోయిన చీకటి స్మృతి కవితలో ప్రకటింపబడుతుంది. అందువల్లే స్మృతి కవిత ఆత్మాశ్రయంగానే వెలువడింది.

భావకవుల్లో రాయప్రోలు, నాయని, బసవరాజు, దువ్వూరి అబ్బూరి, తల్లావజ్ఝల, విశ్వనాథ వంటివారు బంధు మిత్రుల శాశ్వతఎడబాటు తీవ్రతతో కుమిలి

పోయి తమ బాధని స్మృతి గీతాలుగా ఆత్మాశ్రయ ధోరణిలో వెలిబుచ్చారు. 'నాయని మాతృగీతాలు', 'విషాద మోహనం', విశ్వనాథ 'వరలక్ష్మీత్రిశతి' 'భావకవితాయుగంలో వచ్చిన స్మృతి కావ్యాలు వీరి స్మృతి కవిత్వంలో ఆవేదన ఆకాశాన్నంటింది. దువ్వూరి 'భగ్నహృదయం' కూడా చక్కని స్మృతి కావ్యమే. కావ్యాలే కాకుండా ఈ కోవకు చెందిన ఖండికలు కూడా పెక్కు వెలిశాయి. ఇవన్నీ దాదాపు ఆత్మాశ్రయ రచనలే.

స్మృతి కవిత్వాన్ని, సతీస్మృతి, సుతాదికస్మృతి. ఆప్తస్మృతి మిత్రస్మృతి, దేశనాయిక స్మృతి అని వింగడించవచ్చు. కవికి వున్న ప్రేమ, పరిచయం, వల్ల ఏర్పడిన ఆత్మబాంధవ్యం వారి లేమికి వగచి విలవిల్లాడటంతో పలురకాలైన స్మృతి కవితలు ఆత్మాశ్రయంగా వెలికురికాయి. వీటిని పరిశీలిద్దాం.

**సతీస్మృతి :** అగ్నిసాక్షిగా వివాహమాడి, ప్రేమించిన ఇల్లాలి మరణానికి విలపించిన విలాపమే సతీస్మృతిగా వెలువడింది జీవిత భాగస్వామినియై తన జీవితానికి వెన్నెలను, వెన్నపూసవంటి కోమలత్వాన్ని ప్రసాదించి ఆదరించే భార్య మరణంపట్ల భావకవి ఎనలేని సానుభూతిని చూపాడు. ఆ సానుభూతిలో కవి అర్ధాంగి కలిసి అనుభవించిన జీవిత అనుభవాలు, వాటి తాలూకు మధురస్మృతులు కవి హృదయంలో గుబులుకున్నాయి ఆటువంటి జీవిత మాధుర్యాల చవులు ఆమె శాశ్వతమైన ఎడబాటుతో భావకవికి సుదూరమయ్యాయి. అట్టి స్థితిలో దుఃఖం వెల్లువికి వచ్చింది, అనివార్యమైన దుఃఖావేశంతో భావకవి -

> 'నా ప్రియురాలి కంఠము కౌగలించ నిం
> దీకరమ్ములు లాగబోకుఁడీరు
> ... .... .... .... .... ... .... ....
> నాయర్థ తనువు వెంటనె పఱకొననిండు
> ఈ తుది సుఖమ్ము నను బొందనిండుమీరు' 138

అంటూ భార్యా వియోగంతో విలవిల్లాడిపోతూవున్న హృదయాన్ని బయట పెట్టారు.

దువ్వూరి తన అర్ధాంగి మరణానికి భగ్న హృదయుడై ప్రియా వియోగాన్ని చాటుకొన్నాడు. భార్యా వియోగంలో ఈ భావకవికి మునుపు కన్నులపండువుగా వుండిన వస్తువులన్నీ వెలవెలబోయి కనిపించాయి. ప్రకృతి కూడా

విషాద ఛాయల్ని పులుముకున్నట్లయింది. హృదయ మంజూషను తన చేతిలో వుంచి తాళపు చెవిని తన భార్య చేతిలో దాచు కొన్నదని భావిస్తూ దుఃఖ జలధిలో మునిగి

'ఉప్పులోపింప మిగతవి యుండిగూడ
జవియు సారంబు కొఱవడు సాదకమున:
మనసు గలసిన యిల్లాలు మఱిగి పోవ
నన్నియుండియు లేనట్లు లయ్యె నాకు।139

అంటూ తన స్థితిని దయనీయంగా వ్యక్తంచేశాడు. ఇలా కవి పొంగారుతూవున్న దుఃఖాన్ని, వాస్తవ స్థితిగతుల్ని బాధా మిశితంగా పొందుపరచాడు. అందువల్లే సతీ స్మృతి విషయంలో బలీయమైన ఆత్మాశ్రయత్వమే దర్శన మిస్తూవుంది.

బాలాంత్రపు వెంకటరావు తన సతీ నిర్యాణంతో వ్రాసిన 'విరహ సంగతము' అనే స్మృతి కవిత కూడా ఆత్మాశ్రయంగానే కొనసాగింది. భార్యా వియోగంలో ఆమె స్మృతులు జ్ఞప్తికిరాగా కన్నుల్ని కడవెడు నీళ్ళతో కడుగుచున్నానంటూ దుఃఖ తీవ్రతని ప్రకటించుకొన్నాడు.

సుతాదిక స్మృతి : భార్యాభర్తల మధ్య ఎంత అన్యోన్యం, ప్రేమ, ఆత్మీయతా వుంటుందో అంత ఆత్మీయతే తమ పిల్లల విషయాల్లోనూ వుంటుంది: అందువల్ల భార్య ఎడబాసినప్పుడే కాకుండా తన బిడ్డలు ఎడబాసినపుడు కూడా భావకవి హృదయం బావురుమన్నది. ఆ విలాపంలో కూడా పిల్లలకు తనకూ వున్న విడదీయరాని అనుబంధం ఎవరో బలవంతాన తెంచినట్లు భావకవి భావించాడు. పుత్రుడో, లేక పుత్రికో మరణించిన సందర్భాల్లో భావకవి స్మృతి గీతాల్ని కరుణ రస పూరితంగా జాల్వార్చాడు. ఈలాంటి సందర్భాల్లో వెలువడిన కవిత్వంకూడా కవి హృదయానికి అద్దం పట్టేదిగా వుండి ఆత్మాశ్రయతనే కలిగివుంది.

భార్య తన జీవితంలో సగపాలు పంచుకొనేది. కొంతకాలం తనతో గడిపి తనవు చాలిస్తే భార్యా విషయంలో కవి కుమిలిపోయాడు. కానీ బిడ్డల విషయంలో అలా కాక భవిష్యత్తులోని తన ఆశలన్నీ వారిపైన పెట్టుకొని జీవిస్తున్న భావకవికి బిడ్డల వియోగం కడుపు కోతగా పరిణమించింది. ఆ కడుపుకోతకు గురైన భావకవికి భవిష్యత్తు చీకటిమయంగా కనిపించింది. దువ్వూరి 'శిశు వియోగము' అనే

ఖండికలో తన బిడ్డ పసికందుగా వున్నప్పుడే కను మూసినందుకు ప్రగాఢంగా విలపించాడు.

"పూవు రాలిన జీబు పిందె పూవయైన
నంటుకొని యుండునన్న వేరాసనుంటి;
మృత్యునిశ్వాస పవనంబు రేగి సుడిసి
భావి ఫలమును గసుగందు బైకివిసిరె" 140

అని అంటూ పసికందు మరణానికి వాపోయాడు.

బసవరాజు చిట్టితల్లి మంగళప్రద మరణించటంతో కత్తి వాదరకు వారి గుండె గాయమైనట్లైంది. కోయిలొకసారి కూసిపోయినట్లు, పండొకటి చేతిలోపడి జారిపోయినట్లు, మెరుపొకటి మెరిసిపోయినట్లు పాపాయి పోయిందని కవి బాధ పడుతూ –

"నా మంగళప్రదా! నా చిన్ని తల్లీ!
మరువ లేక నిన్ను మా కన్న తల్లీ?
ఉదయాన సూర్యుడీ వదన కాంతులలో
బంగారు నీమేని చాయలే గందు?
.... .... ....
పడమట సూర్యుండు కుంగేటి వేళా
సందెకాంతులు కళ్ళపండగౌ వేళా
వికపించి నవ్వేటి బీర పువ్వులలో
చిరునవ్వు నీమోమె చూసి మురిసేను!" 141

అంటూ బసవరాజు తన ఆలోచనని వెళ్ళబోసుకొన్నాడు. ఇలా తన భావాల్ని ప్రకటించుకొంటూ వెళ్ళి చివరకు 'వేదాద్రి శిఖరాన వెలిగున్న జ్యోతి మినుకు మినుకుమని కాసేపు కునికి పోయిందని' 142 చెప్పి

'కాపుర మెచ్చిన కన్ని పాపాయి
యిల్లు కాళీజేసి వెళ్ళిపోయాడు!' 143

అని తీవ్రమైన దుఃఖ ఉద్వేగంతో కుమిలి పోయాడు. ఈ పంక్తుల్లో కవితన బ్రతుకెలా శూన్యం అయిపోయిందీ సూచిస్తూ ఆత్మగతిని ప్రకటించుకొన్నాడు.

శువియోగంలో కవి హృదయం బాధపడటమే కాకుండా ఉన్మత్తతని కూడా నింపు కొంది. మరణశోకంలో మునిగిపోయిన భావకవికి మరణించిన వారికి ఆకలీదప్పులు వుంటాయన్న భ్రమ కలిగింది. తనను వీడిపోయిన తన చిట్టితల్లికి ఆకలీ దప్పులు తీర్చమని ప్రాధేయపడుతూ కడుపు తీపితో -

'రుద్రభూమి నేకాకిగ
నిద్రించెడు ముమ్మగన్న
మంగళప్రదను నిద్రా
భంగమొదవకుండ గాచి
కరుణామృత ధారల నా
కిలిదప్పులు బాధ దీర్చి
చల్లనైన జోల పాడి
మెల్ల మెల్ల జోకొట్టుము''144

అంటూ ప్రాధేయ పడ్డాడు. ఈ ప్రాధేయతలో కన్న బిడ్డ కోసం తల్లడిల్లే కవి హృదయం బహిర్గతమౌతూ ఆత్మాశ్రయతే వెల్లడైంది.

ఆప్తస్మృతి : భావకవి స్మృతి గీతాల్లో భార్యాబిడ్డల విషయంలోనే కాకుండా తల్లీ తండ్రీ, సోదరీ సోదరుల వంటి ఆత్మీయుల విషయంలో కూడా ఆత్మాశ్రయతనే పొదుగుకొంది. తన జీవితంలో భాగం పంచుకోక పోయినా తన జీవితంలో అండ దండగా వుంటూ తన జీవితానికి బాటను చూపెట్టిన తల్లీ తండ్రీ, తనతో రక్తం పంచుకపుట్టిన సోదరీ సోదరుల ఎడబాటు కూడా భావకవిని కలవరంపెట్టింది. ఇటు వంటి ఆప్తులపైన రచించిన శోక గీతాల్లో కవి ఆత్మీయతా భావమే అధికంగావుంది.

నవమాసాలు మోసి, కని, పాల బువ్వల గోరుముద్దలు తినిపించి, పెంచి, పెద్దచేసిన మాతృమూర్తి పరమపదించగా దిక్కులేని స్థితిలో భావకవి కొట్టుమిట్టా డాడు. తల్లిని దూరం చేసిన దైవాన్ని సైతం లెక్కచేయకుండా -

'ఎవ్వడా క్రూర కర్మఠ దేవడు నీల
జలదనిర్ముక్త శైశిర శర్వరీ ప్ర
శాంత మలవాటు పడిన విశాంతమందు
ఆకట నట్టింట దీపమ్ము నార్పినాడు''145

అంటూ తన జీవితంలో చీకటి అలము కొందన్నాడు. తల్లి ఎక్కడికో దేవపూజ కోసం పండ్లూ, పూలు మూట గట్టుక పోయిందని అమాయకంగా ఆలోచిస్తూ నీతో కూడా కొంగు పట్టుకొని రాలేక కన్నీటి బొట్లు రాలుస్తూ వున్నానని తన అసమర్థతని చాటుకొన్నాడు. గతించిన తల్లి తిరిగి వస్తుందని ఎదురు చూసి 'నీవు రావైతి వేల తల్లీ!' అని ప్రశించుకొని

'ఇంక నా జీవితమ్ము నీ స్మృతికి చెక్క-
బడిన యొక శాసనమ్మయి వరలు నటవె
చిన్ని నీ విగ్రహము ప్రతిష్ఠితము నాదు
నంతరంగము నీకు దేవాలయమ్ము!' 146

అంటూ తన చిన్ననాటి తల్లితోటి స్మృతుల్ని గుండెల నిండా నింపుకొన్నవి మన ముందు పంచాడు. హృదయంలో తల్లీ కొడుకుల ఆత్మీయత, తల్లి ఎడబాటుతో కవి ఆవేదనా వ్యక్తం అవుతూ వున్నాయి.

పెనుమర్తి వెంకటరత్నం, కొడాలి సుబ్బారావు భావ కవితా సంప్రదాయంతో రచించిన మాతృస్మృతి గీతాల్లో ఇలాగే ఆత్మాశ్రియత్వమే ప్రతిబింబిస్తూ వుంది.

బసవరాజు అప్పారావు తల్లీ తండ్రి ఒకరై పెంచిన తనను కన్న తండ్రి మరణించగా దుఃఖపూరిత హృదయంతో "పితృస్మృతి" అనే కవిత రచించాడు. ఈ కవితలో తన తండ్రి ఆత్మకి శాంతిని ప్రసాదించమంటూ భగవంతుణ్ణి వేడుకొంటాడు. ఈ వేడికోలులో భగవంతుణ్ణి 'ఆత్మనాథు' అని సంబోధిస్తూ తన విన్నపాన్ని విన్నవించుకొన్నాడు. ఈ విన్నపంలో ఆత్మాశ్రయతే తొంగి చూస్తూ వుంది చూడండి.

"తల్లియును దండ్రియును గూడ తానె యౌచు
ప్రాణముల కన్న నెక్కుడు ప్రాణము గను
వన్నెగాచి పెంచిన నాదు కన్న తండ్రి
యాత్మకు నొసంగు శాంతి నాత్మైక నాథ!' 147

ఆప్తులూ, ఆత్మీయుల్లూ అయిన తల్లీ తండ్రీ, శాశ్వత వియోగానికే కాక ఒకే రక్తం పంచుక పుట్టిన సోదరీ సోదరుల విషయంలో ప్రకటించిన సంతాపం

కూా గుండెల్ని స్పృశిస్తూ ప్రవహించింది. దువ్వూరి తన చెల్లి మరణించగా గాఢమైన పరితాపంతో -

'చెల్లెలా నీవు స్వర్గమ్ము జేరి కొన్ని
వత్సరంబులు గడచియుఁ బ్రకృతియందు
నీదు చిహ్నంబు లెల్లెడ నింపినావె'147

అని తన చుట్టూ వున్న ప్రకృతి కదలికల్లో ఆమె రూపాన్ని చూడ గలిగాడు. శాశ్వతంగా ఎడబాసిన ఆప్తుల ఉనికి వారి భౌతిక కాయం కదలి పోవటంతో నసిసి పోనీకుండా ఆత్మ సంబంధాన్ని ప్రకృతితో ముడివేసి ఆత్మాశ్రయ ధోరణిలో కాల్పనిక సంప్రదాయంతో వెలిబుచ్చాడు.

ఇలాగే అబ్బూరి తన సోదరుని మరణానికి చింతాక్రాంతుడై సోదర స్మృతిలో -

'....నీ స్వాంత
నైర్మల్య సంస్మరణమ్ము విడక
నీ మధుర తేజో రూప సీమలఁ దలఁచి
నీవు మొదలు పెట్టిన యక్షరా వళులను
గూర్చి యల్లెద'149

అని అంటూ తన సోదరుని మరణానికి దుఃఖిస్తూ అతను లేకపోయినా అతని ఆశయాలను మరచి పోకుండా నెర వేర్చడంలో మునిగి పోవడానికి ఉద్యుక్తుడవు తూవున్న తన స్థితిని ప్రకటించి ఆత్మాశ్రయతనే వ్యక్తం చేశాడు.

మిత్ర స్మృతి : రక్త సంబంధులైన బంధువుల విషయంలో ఎలాంటి ప్రేమను చవిచూశాడో అలాంటి ప్రేమే భావ కవికి మిత్రుల విషయంలోనూ అనుభూత మైంది. తల్లి, తండ్రి, భార్యా బిడ్డలు, సోదరీ సోదరుల కన్నా దగ్గరి వాడుగా నిజమైన స్నేహితుడు మెలగటం వల్ల కవికి మిత్రునిపై కూడా ఎనలేని వాత్స ల్యం. ప్రేమ భావం పెనగొన్నాయి. సంసార విషయాల్లోనే కాక సాహితీ సాహిత్యంలో కూడా కలిసి మెలిసి తిరిగే స్నేహితుడు ఎవరి హృదయాన్నైనా చూరగొంటాడు. అటువంటి మిత్రుడు దూరమైతే కలిగే బాధ తీవ్ర స్థాయిలో వుంటుంది.

ఇటువంటి సందర్భాల్లోనే ప్రకటించిన కవితల్లో కూడా మిత్రుని పై గల కవి వాత్సల్యం. అతని ఎడబాటులో కవి పొందిన బాధ తీవ్ర స్థాయిలోనే ప్రకటిత మయ్యాయి ఇలాంటి కవి విలాపాలు కూడా ఆత్మాశ్రయంగానే వున్నాయి.

బసవరాజు తన మిత్రుడు దుగ్గిరాల గోపాలకృష్ణయ్య మరణించినపుడు ఆ మరణ వార్త విని దిగ్భ్రాంతుడై -

"ఈనాటి యీ నేస్త
మే జన్మకో తిరిగి
కన్నీళ్ళు గారవకే
కడుపు చెరువయేనే" 150

అంటూ తన దుఃఖ తీవ్రతని ప్రకటించినాడు. మిత్రుని మరణవార్త వినగానే చెవులు గింగురు పోయాయట. ఎంతచింపుకొన్నా గొంతు పెగల్లేదది. అటువంటి స్థితిలో "ఏలా బాడేనింక యమునాకళ్యాణి, మా లీలా మానవుడు గోపాలుడు లేడాయె।" 151 అని వగచాడు. యమునా కళ్యాణి రాగం తన మిత్రుడికి అభిమాన మైంది కావటం చేత ఇక తాను ఆ రాగంలో పాడటం వల్ల ఫలితం వుండదని వాపోటవం మిత్రునికి, తనకు గల సన్నిహిత సంబంధాన్ని వ్యక్తం చేస్తూవుంది. కవి మనో భావాల్ని ప్రకటిస్తూ వుంది.

దేశనాయక స్మృతి : దేశాభిమాన హృదయం గల భావ కవికి దేశంలోని సకల సంపదలపైనా మక్కువ ఎక్కువగా వున్నట్లే ఆ దేశాన్ని సమర్థవంతంగా, నీతి నియమాలకు కట్టుబడి పరిపాలన సాగించిన జాతినేతల పైనా, స్వార్థరహితంగా తమ సర్వస్వాన్ని దేశం కోసం అర్పించిన జాతి పితలపైనా మక్కువని చూపారు. ఇలా తమ జీవితంలో ప్రతి భావంతులైన దేశ నాయకుల్ని మిత్రి సమానులుగా, దైవ సమానులుగా భావించి వారిని ప్రేమించారు. ఈ కారణంగా బంధుమిత్రులతో ఎలాంటి పరిచయం, సంబంధ బాధవ్యాలుంటాయో అలాంటి పరిచయాలు సంబంధ బాంధవ్యాలు దేశ నాయకుల విషయంలోనూ భావ కవుల పెంచుకొన్నారు.

అటువంటి దేశనాయకులు హఠాత్తుగా మరణించినపుడు వారి శాశ్వతమైన ఎడబాటు భావ కవి గుండెల్ని గాయ పరచింది. స్మృతి గీతాలు వ్రాయించింది.

వాటిలో కవి ఆత్మీయత కంటే దేశనాయకుని గుణగణాల ప్రసక్తే అధికంగా వుంది. అందువల్ల దేశనాయకులను గూర్చి, రాజకీయ నాయకులను గూర్చి వెలు పడిన స్మృతి కవితలు వస్త్వాశ్రయతని కలిగివుండేవిగా కనిపిస్తాయి. కానీ కొన్ని సందర్భాల్లో దేశనాయకునిపై కవికున్న మక్కువ కొద్దీ, అధిక పరిచయం కొద్దీ వియోగ దుఃఖం ఆత్మాశ్రయంగా వెలికురికిన సందర్భాలు లేక పోలేదు.

గాంధీజీ నిర్యాణానికి దుఃఖిస్తూ తుమ్మల 'అమరజ్యోతి' అనే ఖండికలో

'పూవుల తెప్పపైఁ గదలి పోయితివా యమునా తరంగిణీ
పావన రాజ ఘట్టమున భౌతిక దేహముఁగొల్చుకొంటివా
నీ వపురస్థి చందనవనీ శకలమ్ముల చూచియమ్మెనా
బావురుమంచు నీదుచితి పజ్జల సోకముపొంగెనా ప్రభూ![152]

అంటూ విలాప తీవ్రతని వ్యక్తం చేశాడు. మహాత్ముని దివ్యస్మృతిని 'శాంతి శూర,[153] అంటూ వాపోయాడు.

రవీంద్రుని అస్తమయానికి చింతిస్తూ రాయప్రోలు పకృతి సర్వం స్తబ్ధమై పోయినట్లు భావించాడు. "ఎదియొ చైతన్య వైకల్వమొదవనోపు! కాక తెగుటెట్లు లమృత గీతా కలాప వయ కళా ప్రాణ పూరణమయిన నీరుదివ్య తను వంశలత గురుదేవ, నేడు'[154] అంటూ చైతన్యం వైకల్యం పొంద బోతూ బాధ పడ్డాడు.

దేశమాత ముద్దు బిడ్డగా పొందిన చిత్తరంజన్ దాస్ మరణించగా ఆయన ఎడబాటుకు దుఃఖిస్తూ

'....నాదు హృదయ వీధి
మధిత భావాంచలములను న్మృత్తి విస్మృతి
నెఱపు నీకైన నాదు కన్నీటి కాన్క'[145]

అంటూ తనకు ప్రీతి పాత్రమైన దేశనాయకుడు మరణించగా: అతని పట్ల తన హృదయంలోని శోకాన్ని కన్నీటి కాన్కగా వెలిబుచ్చాడు.

దేశసేవ, సాహితీసేవ చేసి తనువు చాలించిన విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతుల్ని గూర్చి తుమ్మల-

'తరలినాడా మాతృదాస్య పారచ్ఛేద
కౌశల్యమును గన్న కర్మయోగి

.... .... ....

తెలుగు వెల్గుల కొలకు రాత్రిందివమ్ము
రక్తమును ధారవోసిన రాచబిడ్డ
యస్తమించెనె నాగేశ్వరాభిధుండు
దేశమున కెవ్వడీ లోటు తీర్చునకట!'156

అని విలపించాడు. ఈ విలాపంలో విశ్వదాత కీర్తి ప్రతిష్ఠలు గానం చేయటం, అంతటి సమర్థుని లోటుకు కుమిలి పోవడం కనిపిస్తుంది.

స్మృతి కవిత్వంలో ఇంత వరకు చేసిన పరిశీలనలో అత్యంత ఆత్మీయుల విషయంలో ఆత్మాశ్రయత్వం బలీయంగానూ, తన జీవితంలో కొంత పరిమితంతో పరిచయం వున్న మిత్రులు, దేశనాయకుల విషయంలో ఆత్మాశ్రయత్వం కొంత తక్కువగానూ భావ కవులు ప్రదర్శించినట్లు వెల్లడయింది. ప్రేయసీ నిర్యాణ సందర్భంలో వ్రాసిన ప్రణయ, వియోగగీతాల్లో ఆత్మాశ్రయం బలీయంగావున్నా అవిస్మృతి గీతాల పరిగణన లోనికి రావు. అవి విషాద రేఖల్ని పులుముకొన్న ప్రణయ గీతాలవుతాయి.

ఈఅధ్యాయంలో ఇంత వరకు భావ కవిత్వంలో చోటు చేసుకొన్న ఆత్మాశ్రయత్వాన్ని గూర్చి వివరించటం జరిగింది. భావ కవిత్వంలో శాఖలైన పకృతి కవిత్వం. ప్రణయ కవిత్వం. భక్తి కవిత్వం, దేశభక్తి కవిత్వంస్మృతి కవిత్వంలో ఆత్మాశ్రయత్వం ఎలాప్రతిబింబించిందో పరిశీలించటం జరిగింది.

పరమ రామణీయకతని వింపుకొని చూపరులకు ప్రకృతి ఎలాంటి ఉత్తేజాన్ని కలిగిస్తుందో అలాంటి ఉత్తేజాన్నే భావకవి ప్రకృతి దర్శనంలో పొందాడు ఆ ఆనందాన్ని అనుభవించిన భావకవి ఆ అనుభవాన్ని కవితగా మలచుకోవటం వల్ల భావ కవి మనో భావాలు కవిత్వంలో స్వకీయ అనుభవాలుగా, అనుభవ మాధుర్యాలుగా. విబిడీ కృత మయ్యాయి. అంతేకాకుండా కవి పొందిన దుఃఖం కూడా ప్రకృతి పరంగానే వెల్లడైంది. తన దుఃఖాల్ని ప్రకృతితో కలసి పంచు కొన్నాడు. కవి ప్రకృతి కష్టనష్టాల్ని కూడా గమనించి తనవిగా భావించి కవిత ల్లాడు. ఈ కారణాల చేత భావకవి తన చిగురుటాకుల కలంతో ప్రకృతి మాత పయ్యెదపై రచించిన ప్రకృతి కవిత్వంలో ఆత్మాశ్రియత్వం పొంగారింది.

ప్రణయం కవి స్వకీయ మైన ఆహ్లాదాన్నీ, దుఃఖాన్ని వ్యక్తం చెయ్యటం వల్ల ఆత్మాశ్రయత నే కలిగిందిగా వెలువడింది. భావ కవి తనకు నచ్చిన, తాను మెచ్చిన సౌందర్యరాసికి తన మనసును అంకితం చేశాడు. ఆచెలితోటి తన ప్రణయ భావాల్ని తేనె సిరా నింపుకొన్న తన కలంతోటి వెలువరించాడు. కవికీ, చెలికీ మధ్య ఉన్న ప్రేమ పారవశ్యం, వలపు లోతుల్లోని మాధుర్యం, సంయోగం లోని తీయందనం ఇవన్నీ భావ కవి హృదయపు టంచుల్ని స్పృశిస్తూ వెలికురికిన కారణంగా కవి ఆత్మీయతని, అనురాగాన్ని వ్యక్తం చేశాయి.

ప్రణయ కవిత్వంలో చెలి ఎడబాటులో కవి పొందిన ఆవేదన, పరితాపం, విలాపం, ఇవన్నీ భావకవి బాధా గ్రథిత హృదయాన్నే వ్యక్తం చేశాయి. ఎంతో సంతోషాన్ని నింపుకొందామని చెలితో స్నేహం చెయ్యగా విధో, సంఘమో అడ్డు వచ్చి తన కలలు శిథిలమైనప్పుడు కవి హృదయం బావురుమంది. అందులో భావ దుఃఖాతిశయంతో వెలువరించిన కవి హృదయమే బహిర్గతమయింది. అందువల్ల ప్రణయ కవిత్వంలో భావకవి వెలువరించిన సంతోషం కానీ, దుఃఖం కానీ, విషాదం కానీ కవి స్వకీయమైన అనుభవాల్ని కలిగి ఆత్మాశ్రయతనే నింపుకొంది.

భక్తి కవిత్వ విషయంలో కూడా భావకవి స్వకీయమైన అనుభవాల్ని, మనో భావాల్ని వ్యక్తంచేశాడు. జీవితంలో ప్రణయ మాధుర్యంలో సొక్కి-సోలి అలిసి పోయి ఎడబాటులో కృంగి కృశించిన భావకవికి భగవంతుని చింతన, తాత్విక గమ్యం అలవడింది. ఏకాకి తనాన్ని అనుభవిస్తూ శేషజీవితాన్ని గడపడానికి భావ కవికి కూడా భగవంతుని సాన్నిధ్యమే అవసరమైంది. భగవంతుని చూడాలన్న ఆతుత్రియంతో, భగవంతుని గూర్చిన నిరంతర చింతనతో భావకవి భక్తిభావం అలరారింది భావకవి భగవంతుని చేరుకోలేక పోవటానికి తనను తాను నిందించు కొంటాడు. తను సంపూర్తిగా పతనం కాక ముందే తనను రక్షించి, తనలో ఐక్యం చేసుకోమంటూ భగవంతుని ప్రాధేయపడతాడు. ఆ ప్రాధేయతలో భావ కవి దృఢ సంకల్పంతో కూడుకొన్న భక్తి పాదులు దన్నుకొని ఆత్మాశ్రయతనే ప్రదర్శించింది.

పరపీడన క్రింద క్రుగ్గి పోతూవున్న భావకవికి స్వాతంత్ర్య కాంక్ష పెరిగింది. వినీలాకాశ వీధుల్లో స్వేచ్ఛగా రెక్కలు సాచి విహరించే పక్షిలాగా భావ

కవి స్వాతంత్ర్యాన్ని విరసించాడు. అదుకోసం తన హృదయాన్ని నింపిన దేశ భక్తి గేయాలు రచించాడు. భావకవి భారతదేశంపైనా, తెలుగు నేలపైనా తనకున్న మక్కువను చాటడంచేత దేశభక్తి కవిత్వంకూడా కొంతవరకు ఆత్మాశ్రయంగానే కొనసాగింది.

స్మృతి కవిత్వం ప్రణయ కవిత్వంలాగే వ్యక్తిగతమైన కవి జీవితానికి సంబంధించింది కావటం మూలంగా స్మృతి కవితకూడా ఆత్మాశ్రయంగానే వెలువడ్డాయి. భార్యాబిడ్డలూ, ఆప్తులో, మిత్రులో, దేశాధినేతలో మరణించినపుడు కవి హృదయం గాయమైంది. ఆగాయం నుంచి వెలికురికిన బాష్పరుధిరం కవి వారి ఎడబాటులో పొందిన దుఃఖాతిశయాన్నే వెల్లడిచేసింది. ఈ కారణంగా కవికీ మరణించిన వ్యక్తికీ మధ్యనవున్న సంబంధ బాంధవ్యాలతోపాటు, కుమిలి కృశించిన కవి హృదయం స్మృతి గీతాల్లో కన్పిస్తుంది. అందువల్లే స్మృతి కవిత్వంకూడా ఆత్మాశ్రయతనే ప్రదర్శించేదిగా చెప్పవచ్చు.

ఈ పరిశీలనవల్ల ప్రకృతి కవిత్వం, ప్రణయ కవిత్వం, భక్తి కవిత్వం, దేశ భక్తి కవిత్వం, స్మృతి కవిత్వం–ఈ భావకవిత్వ శాఖల్లో ప్రణయ కవిత్వంలోనూ, స్మృతి కవిత్వంలోనూ ఆత్మాశ్రయత్వం అధికంగా గూడుకట్టుకొన్నట్లు తెలుస్తూ వుంది. ప్రణయం, స్మృతి తరువాత భక్తి విషయంలో ప్రకృతి, దేశభక్తి కంటే కూడా అధికమైన ఆత్మాశ్రయతవుంది. ప్రకృతి, దేశభక్తి ఈ రెండూ కవికి సాధారణమైన అంశాలు కావటంవల్ల వీటిలో మిగిలిన వాటికంటే ఆత్మాశ్రయత తక్కువగా వున్నట్లు తెలుస్తుంది.

భావకవికి ప్రణయం, స్మృతి అతి సన్నిహితమైనవి కావటం వల్ల వీటి రెంటిలో అధికంగా కవి హృదయం ప్రతిబింబించింది. భక్తి చరమదశలో భావ కవికి జీవిత శేషాన్ని గడపటం కోసం అవసరమైంది. అందువల్లే భక్తి ఆత్మాశ్రయత్వంలో మూడవ స్థానాన్ని ఆక్రమించింది. ప్రకృతి తన సహజమైన రామణీయకతతో భావకవిని అలరించటం మూలంగా ప్రకృతి భావకవి రచనల్లో కవి హృదయాన్ని ప్రతిబింబించే నాల్గవ అంశమైంది.

భావకవి ప్రకృతికి, ప్రణయానికే అగ్రతాంబూలం ఇచ్చేవాడు కావటంవల్ల సంఘం, దేశం, భావకవి ఆలోచనల్లో స్వల్ప మాత్రంగానే మెదిలాయి. ఈకార

ణంగా భావకవి రచనల్లో ఆత్మాశ్రయతని కొంచెంగా నింపుకొని దేశభక్తి కవిత్వం ఐదవ స్థానాన్ని కలిగివుంది.

భావకవిత్వంలో ఇంకో ముఖ్యమైన శాఖవుంది, అది సంఘ సంస్కరణ కవిత్వం. ఇందులో ఆత్మాశ్రయత అసలు లేదని ఇదివరకే పేర్కొన్నాను. అభ్యుదయ కవిత్వంలోలాగా సంఘసంస్కరణ కవిత్వంలో కవి దృష్టి సంఘం పైనా. దాని సంస్కర్తపైనా వుంటుంది. ఆ కారణంగా కవి ఆలోచనలు, అభిప్రాయాలు, భావాలకంటే సాంఘిక అవసరాలు, సాంఘికశ్రేయస్సు మొదలైన అంశాలు ఇందు ప్రాధాన్యం వహిస్తాయి. ప్రచార గీతాల్లాగానో. ప్రబోధ గీతాల్లాగానో సంఘసంస్కరణ కవిత్వం వెలిసింది ఈ కారణంగా భావక కవిత్వంలోని శాఖే అయినప్పటికీ సంఘ సంస్కరణ కవిత్వం కవిని కాక సంఘాన్ని ప్రతిబింబించేదిగా వుంది. వస్త్వాశ్రియతని నింపుకొంది.

తరువాతి ప్రకరణంలో కాల్పనిక కవితా ప్రభావంతో రచనలు చేస్తూవచ్చిన అభ్యుదయ కవుల రచనల్లోని ఆత్మాశ్రయతని పరిశీలిద్దాం. సాంఘిక ప్రయోజనాన్నీ. కమ్యూనిష్టు దృక్పథాన్నీ, మానవతా వాదాన్ని దృష్టిలో వుంచుకొని అభ్యుదయ కవులు రచనలు చేసినా అంతకు మునుపే తెలుగుకవిత్వాన్ని దాదాపు మూడు దశాబ్దాలపాటు ప్రభావితం చేసిన భావకవిత్వం యొక్క ప్రభావం వారిపైన లేకపోలేదు. అభ్యుదయ కవుల తొలి రచనల్లోనూ, ఆధునిక కవితా సంప్రదాయాలకు అనుకూలంగా అనుభూతి తత్వాన్ని నింపుకొని రచనలు చేస్తూ వున్న మరి కొందరి అభ్యుదయ కవుల రచనల్లోనూ వుండే ఆత్మాశ్రయత్వాన్ని అభ్యుదయ కవులు - ఆత్మాశ్రయత్వం అన్న తరువాతి ప్రకరణంలో పరిశీలిద్దాం.

# ఉదాహృత సూచికలు


1. సోమసుందర్, ఆవంత్స. కృష్ణశాస్త్రి కవితాత్మ. పు. 74.
2. నారాయణరెడ్డి, సి. ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు - ప్రయోగములు. పు. 309.
3. రామకృష్ణరావు. అబ్బూరి. ప్రధివీ ప్రశంస.
4. రామకృష్ణారావు. అబ్బూరి. పృధివీ ప్రశంస.
5. రామిరెడ్డి, దువ్వూరి. కృషీవలుడు. పు 6,7.
6. వెంకట పార్వతీశ్వర కవులు, నక్షత్రము కావ్యకుసుమావళి. దిత్వీయభాగము. పు. 57.
7. కృష్ణశాస్త్రి, దేవులపల్లి. స్వేచ్ఛాగానము-2. కృష్ణపక్షం. కృష్ణశాస్త్రి కృతులు. పు. 75.
8. సుబ్బారావు, నండూరి, కో,కో,కో. యెంకిపాటలు. పు.62.
9. మల్లవరపు. నవాలోకము, కళ్యాణ కింకిణి. పు.33.
10. బాపిరాజు, పిలుపు, వైతాళికులు, పు. 48.
11. బాపిరాజు, " పు. 48.
12. మల్లవరపు. ప్రశ్న-కళ్యాణ కింకిణి, పు. 16.
13. కాటూరి. వేగుబోక, పసిడిజల్లు, పు.47.
14. దువ్వూరి. భవిష్యద్దర్శనము. వైతాళికులు పు. 27.
15. మల్లవరపు. సంధ్యా. కళ్యాణ కింకిణి, పు. 19.
16. రాయప్రోలు, కావ్యావతారము. వనమాల, పు. 63.
17. దువ్వూరి. గతిక, వైతాళికులు, పు. 203.
18. పింగళి, కాటూరి. రసాలము. తొలకరి, పు. 29.
19. " " " పు. 30
20. నండూరి. నీడలు-యెంకిపాటలు, పు. 49.
21. నండూరి. రాగతనం యెంకిపాటలు, పు. 52.
22. రాయప్రోలు. మధుమాలి, అభినవ కవిత, పు. 102
23. వెంకటపార్వతీశ్వర కవులు. ఆనందమందిరము, కావ్యకుసుమావళి, పు. 50.
24. రామకృష్ణారావు, అబ్బూరి. పూవుల్లపాట, ఊహాగానము ఇతరకృతులు. పు. 108.

25. బసవరాజు. ఏదికావలెనే, బసవరాజు అప్పారావు గీతాలు. పు. 40.
26. దువ్వూరి. కృషీవలుడు. పు. 12.
27. వేదుల కాంక్ష, వైతాళికులు, పు, 23.
28. కృష్ణశాస్త్రి, అన్వేషణము. కృష్ణపక్షము, కృష్ణశాస్త్రి కృతులు, పు. 2
29. కృష్ణశాస్త్రి. అతనిపాట. " " పు. 2
30. వెంకటపార్వతీశ్వర కవులు. కావ్యగీతము, కావ్యకుసుమావళి. ద్వితీ
భాగము. పు 12.
31. తల్లావజ్ఝల. వకుళమౌళిక, వైతాళికులు, పు. 111.
32. దువ్వూరి, ఆమని నిషా. వైతాళికులు, పు.67.
33. మల్లవరపు. నిశాలోచన. మధుకీల, పుటలు, 14,15.
34. నండూరి. పడవ. యెంకిపాటలు, పు. 37.
35. బసవరాజు, కోయిల. బసవరాజు అప్పారావు గీతాలు, పు. 103.
36. మల్లవరపు, పున్నమి. మధుకీల, పు.75.
37. మల్లవరపు. ఒకరేయి, మధుకీల, పు. 41.
38. వెంకటపార్వతీశ్వర కవులు, ఏకాంతసేవ. పు. 28.
39. నాయని. సాక్షాత్కారము, సౌభద్రుని ప్రణయయాత్ర. పు. 47.
40. బసవరాజు, కోకిల బసవరాజు అప్పరావు, గీతాలు. పు.4.
41. వెంకటపార్వతీశ్వర కవులు, ఏకాంతసేవ. పు. 63
42. నండూరి, కోయిల వైతాళికులు. పు. 127.
43. రాయప్రోలు. కోయిల. అభినవకవిత, పు. 160.
44. మల్లవరపు, నవవర్షా, కళ్యాణకింకిణి, పు. 24.
45. అబ్బూరి, వర్షాగమము. వైతాళికులు పు. 218.
46. అబ్బూరి. వర్షాగమము. వైతాళికులు, పు.218,219.
47. వెంకట పార్వతీశ్వరకవులు. వసంతాంకము కావ్యకుసుమావళి.
ద్వితీయభాగము. పు. 102.
48. రాయప్రోలు. వసంత వికాసము, అభినవకవిత, పు. 130.
49. వేదుల, దీపావళినాడు. వైతాళికులు. పు. 228.
50. కృష్ణశాస్త్రి. కృష్ణపక్షము. కృష్ణశాస్త్రి కృతులు. పు. 1.
51. బసవరాజు, కోకిల, బసవరాజు అప్పారావు, గీతాలు. పు. 4

52. తల్లావఝ్ఝల, పుష్యపూర్ణిమ. వైతాళికులు, పు. 243
53. వేదుల, అశాంతి, వైతాళికులు, పు. 245
54. పింగళి, కాటూరి. కోకిల-తొలకరి, పు. 8
55. బసవరాజు, హెచ్చరిక, బసవరాజు అప్పారావు గీతాలు. పు. 10
56. బసవరాజు, చంద్రగ్రహణము, బసవరాజు అప్పారావు గీతాలు. పు. 9, 10
57. దువ్వూరి. గతిక. వైతాళికులు, పు. 203.
58. విశ్వనాథ. నీవు-నేను. వైతాళికులు, పు. 201.
59. సోమసుందర్, కృష్ణశాస్త్రి కవితాత్మ. పు. 54
60. బసవరాజు, ప్రేమతత్త్వము, వైతాళికులు, పు. 36, 37.
61. కృష్ణశాస్త్రి, ఏల ప్రేమింతు? కృష్ణపక్షము, కృష్ణశాస్త్రికృతులు. పు. 18.
62. వేంకటపార్వతీశ్వర కవులు, ప్రేమ, కావ్యకుసుమావళి, ద్వితీయభాగము; పు. 19.
63. వేంకటపార్వతీశ్వర కవులు ఏకాంతసేవ. పు. 20.
64. నారాయణరెడ్డి, సి. ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు ప్రయోగములు, పు. 315
65. కృష్ణశాస్త్రి, ప్రాణకాంత, కృష్ణపక్షము. కృష్ణశాస్త్రి కృతులు, పు. 32
66. కృష్ణశాస్త్రి, ఊర్వశి. కృష్ణశాస్త్రి, కృతులు. పు. 112
67. నండూరి, నమిలి మింగిన నాయెంకి. యెంకిపాటలు, పు. 12
68. ,, ,, ,, పు. 12
69. నాయని. నీవు-నేను, నాయనిసుబ్బారావు కృతులు, పు. 61
70. ,, ,, ,, ,,
71. ,, ,, ,, ,,
72. మల్లవరపు. మధుకీల, పుటలు. 61, 64, 79, 82.
73. ,, ,, ,,
74. ,, ,, ,,
75. ,, ,, ,,
76. మల్లవరపు శ్రీ కల్యాణి కింకిణి పు. 1.
77. ,, ,, ,,
78. మల్లవరపు. కళ్యాణ కింకిణి, పు. 3

79. బాపిరాజు. ఒకరికొకరు, వైతాళికలు, పు. 53, 54
80. వేదుల యాత్ర. దీపావళి, పు. 16
81. మల్లవరపు, శుభలేఖ. మధుకీల. పు. 12
82. ,, ,, పు. 12
83. ,, ,, పు. 13
84. అబ్బూరి. కాపుపాట, వైతాళికులు, పు. 49, 50
85. కృష్ణశాస్త్రి దివ్యభాగ్యము, కృష్ణపక్షము. కృష్ణశాస్త్రికృతులు, పు. 29
86. నండూరి. యెంకిముచ్చట్లు, యెంకిపాటలు, పు 4.
87. కృష్ణశాస్త్రి. అరనిదివ్వే. కృష్ణపక్షము, కృష్ణశాస్త్రికృతులు, పు. 38
88. కృష్ణశాస్త్రి ప్రేయసి. కృష్ణపక్షము, కృష్ణశాస్త్రికృతులు, పు. 35
89. కృష్ణశాస్త్రి ఊర్వసి, కృష్ణశాస్త్రికృతులు, పు. 123, 124
90. రాయప్రోలు పిలుపు, జడకుచ్చులు, పు. 37
91. ,, ,, పు. 37.
92. కృష్ణశాస్త్రి. నేనొకండ, కృష్ణపక్షము, కృష్ణశాస్త్రి కృతులు, పు. 52.
93. కృష్ణశాస్త్రి. ప్రవాసము. కృష్ణశాస్త్రి కృతులు. పు. 104.
94. ,, ,, ,, పు. 105.
95. కృష్ణశాస్త్రి. కృష్ణపక్షము. కృష్ణశాస్త్రి కృతులు. 58.
96. వేదుల. అశాంతి. దీపావళి, పు. 40.
97. మల్లవరపు. నవాలోకము. కళ్యాణ కింకిణి, పు. 82.
98. వేదుల. గీతములు; దీపావళి. పు. 53.
99. కృష్ణశాస్త్రి. ఊర్వశి. కృష్ణశాస్త్రి. కృతులు. పు. 135.
100. వేదుల. ఆహ్వానము దీపావళి పు. 56. 57.
101. కవికొండల. శివరాత్రిప్రభ. వైతాళికులు. పు. 261.
102. బసవరాజు. గోపాలకృష్ణుడు. బసవరాజు అప్పారావు గీతాలు, పు. 9,
103. నారాయణరెడి సి. ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు ప్రయోగములు, పు. 441.
104 వేంకటపార్వతీశ్వర కవులు. సంతుష్టి, కావ్యకుసుమావళి. ద్వితీయ భాగము, పు. 58.
105. బసవరాజు. పాడు సిగ్గు, బసవరాజు అప్పారావు గీతాలు. పు. 34.

106 దీక్షితులు. మనవి. వైతాళికులు. పు 255.
107. కృష్ణశాస్త్రి. ఊర్వశి, కృష్ణశాస్త్రి కృతులు. 144.
108. దీక్షితులు, మనవి వైతాళికులు, పు 256.
109. " " పు. 256.
110. బసవరాజు. వటపత్రశాయి. బసవరాజు అప్పారావు గీతాలు. పు. 25.
111. వేంకట పార్వతీశ్వరులు. ఏకాంత సేవ. పు. 9, 10.
112. వేదుల, అంకితము, దీపావళి, పు. 97.
113. బసవరాజు. కాంచలేను। కాంచలేను. బసరాజు అప్పారావు గీతాలు. పు.34.
114. వేంకటపార్వతీశ్వరులు. ఏకాంత సేవ. పు 36.
115. వేంకట పార్వతీశ్వరకవులు. ఏకాంత సేవ. పు. 36.
116. కృష్ణశాస్త్రి. నేటిరేయి. వైతాళికులు. పు. 129.
117. బసవరాజు. మురళీకృష్ణుడు. బసవరాజు అప్పారావు గీతాలు. పు. 39.
118. వేదుల. ఉత్కంఠ, వైతాళికులు, పు. 250.
119. కృష్ణశాస్త్రి. ఊర్వశి, కృష్ణశాస్త్రి కృతులు. పు. 143.
120. వేదుల. ఆశాగానము. దీపావళి. పు. 83.
121. వేదుల నీ కోసమే. దీపావళి, పు. 101.
122. రాయప్రోలు. దేశభక్తి. ఆంధ్రావళి. పు. 13.
123 " " " పు. 13.
124. నారాయణరెడ్డి, సి. ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు - ప్రయోగములు. పుటలు. 365; 364.
125. " "
126. సుబ్బారెడ్డి, మద్దూరి, తెలుగులో జాతీయోద్యమ కవిత్వంలో ఉదాహృతం. పు. 191.
127. " " " " పు. 269.
128. వేదుల. జయగీతి. దీపావళి. పు. 3, 4
129. కాటూరి. మాతృస్తవ ము. జాతీయ గీతాలు, పు. 36.
130. జాషువా. భరతమాత, జాతీయ గీతాలు. పు. 39.
131. కాటూరి. మాతృభూమి, జాతీయ గీతాలు. పు. 41.
132. వేదుల. మాతల్లి, జాతీయగీతాలు. పు. 48.

133. తుమ్మల. అనుతాపము, రాష్ట్రగానము, పు.65
134. తుమ్మల. జోహారు. రాష్ట్రగానము. పు. 11.
135. తుమ్మల, తపస్సిద్ధి. పఱిగపంట. పు.180.
136. " " " పు. 181.
137. రాయప్రోలు. ఆంధ్రమాత. జడకుచ్చులు. పు. 6.
138. విశ్వనాథ. వరలక్ష్మీ త్రిశతి. పు. 3.
139. దువ్వూరి. ప్రియావియోగము. భగ్నహృదయము, కవికోకిల గ్రంథావళి. ద్వితీయభాగము, పు. 205.
140. దువ్వూరి. శిశువియోగము. కవికోకిలగ్రంథావళి. మొదటిభాగము.
141. బసవరాజు. నిర్యాణము. బసవరాజు అప్పారావు గీతాలు. పు. 77, 78.
142. బసవరాజు. జీర్ణం జీర్ణం. బసవరాజు అప్పారావు గీతాలు.పు.73
143. " " " " పు. 74.
144. బసవరాజు. కడుపుతీపి, బసవరాజు అప్పారావు గీతాలు. పు. 76.
145. నాయని, మాతృగీతాలు. నాయని సుబ్బారావు కృతులు. పు. 135.
146. " " " " పు. 141.
147. బసవరాజు. పితృస్మృతి, బసవరాజు అప్పారావు గీతాలు. పు. 108.
148. దువ్వూరి. కవికోకిల గ్రంథావళి, ద్వితీయభాగము. పు. 30
149. అబ్బూరి, ఊహాగానము ఇతరకృతులు. పు. 79, 80.
150. బసవరాజు, యమునా సాంత్వనము బసవరాజు అప్పారావు గీతాలు.పు.82.
151. " " " పు. 81.
152. తుమ్మల. అమరజ్యోతి. జాతీయగీతాలు, పు. 478.
153. కవికొండల. ఆహాకారమయ్యేలోకము. జాతీయగీతాలు. పు. 520.
154. రాయప్రోలు. రవీంద్రుని అస్తమయము. వనమాల, పు. 53,54.
155. నాయని, సాగర సంగీతం, మాతృగీతాలు, పు. 42.
156. తుమ్మల, పఱిగపంట. పు. 118.

# 6. అభ్యుదయకవులు — ఆత్మాశ్రయత్వం

భావ కవిత్వ మహోద్యమం తరువాత తెలుగు కవిత్వాన్ని ప్రభావితం చేసిన కవిత్వోద్యమం అభ్యుదయ కవిత్వోద్యమం. ఇదివరకే ప్రస్తావించినట్లు దిగంబర కవిత్వం, విప్లవ కవిత్వం - ఇవి రెండూ అభ్యుదయ కవిత్వ ఉద్యమంలో విలీనం అయ్యేవే కాబట్టి వాటి ప్రస్తావన ప్రత్యేకంగా చెయ్యాల్సిన అవసరం లేదు. అంతేకాదు, ఇవి రెండూ అభ్యుదయ కవిత్వ ఉద్యమం నుండి వేరుపడి కవిత్వ ఉద్యమాలుగా కొనసాగాయి. అందువల్ల వాటిపై కాల్పనిక కవితా సంప్రదాయ ప్రభావం కానీ, భావ కవితా సంప్రదాయ ప్రభావం కానీలేదు. ఈ కారణం చేత అవి వస్త్వాశ్రియంగానే కొనసాగి అభ్యుదయ కవిత్వంలో విలీనం అయ్యేవిగా వున్నాయి. కానీ అభ్యుదయ కవుల కవిత్వం అలాకాదు. ప్రారంభ దశలో అభ్యుదయ కవులు చేసిన రచనల్లో ఆత్మాశ్రయత్వం వుంది. ఈ ఆత్మాశ్రయత్వం వున్న రచనలు అభ్యుదయ కవిత్వం క్రిందికి కాక భావ కవిత్వంలో చేరుతాయి. అందుకని ఈ ప్రకరణానికి అభ్యుదయ కవిత్వం - ఆత్మాశ్రయత్వం అనికాక అభ్యుదయ కవులు - ఆత్మాశ్రయత్వం అనిపేరు పెట్టటం జరిగింది.

తెలుగులో అభ్యుదయ కవిత్వోద్యమం భావకవిత్వంలా కాక ఒక అంశానికి కట్టుబడి ఉద్యమించింది. మార్క్సు సిద్ధాంతాల్ని ప్రతిపాదిస్తూ, కమ్యూనిస్టు దృక్పథంతో నూతన సమాజ పునర్నిర్మాణమే ప్రధాన ఆశయంగా అభ్యుదయ కవిత్వోద్యమం వెలువడింది. అందువల్ల భావకవిత్వంలోలాగ అభ్యుదయ కవిత్వంలో కవికి స్వేచ్ఛ లేక పోయింది. సర్వమానవ శ్రేయస్సును కోరుతూ అభ్యుదయ కవిసమాజ పునరుద్ధరణ కోసం తన కవిత్వాన్ని పరిమితం చేసుకొన్నాడు. ఆకలీ, బాధలూ, రోగాలచేత పీడితులవుతున్న ప్రజానీకం శ్రేయస్సుకు తన కవిత్వాన్ని నిర్దేశించాడు. వారి చుట్టూవున్న సామాజిక పరిస్థితుల్ని, కులమత వైషమ్యాల్ని, మానవ జీవితాల్ని వివరించి సానుభూతిని కలిగించడానికి తన కవిత నుద్దేశించాడు.

అందువల్ల అభ్యుదయ కవిత్వంలో పురాణ ప్రబంధ కవిత్వాల్లో లాగవస్తు నిర్దేశం రచనకు పూర్వమే జరిగింది. ఆ వస్తు నిర్దేశకత్వాన్ని తు.చ. తప్పకుండా ఆచరించే ప్రయత్నం అభ్యుదయ కవి చేశాడు. అటువంటి అతని రచనలు వస్త్వాశ్రియ పద్ధతిలో కొనసాగాయి.

శేషేంద్ర శర్మ కవిసేన మేనిఫెస్టోలో అభ్యుదయ కవిత్వానికి కొంతవరకు దోహదకారిగా వున్న విప్లవం ఆత్మాశ్రయమన్నాడు విప్లవం ఆత్మాశ్రయమైనపుడు విప్లవాన్ని ఆశ్రయించిన అభ్యుదయ కవిత్వం కొంతవరకు, విప్లవ కవిత్వం, పూర్తి గాను ఆత్మాశ్రయాలవ్వాలి. వాస్తవానికి భావకవిత్వంలాగా అభ్యుదయ ,దిగంబర విప్లవ కవితలు ఆత్మాశ్రయాలుకావు. వస్త్వాశ్రయాలు. "భక్తి. ప్రేమ,క్రోధము, శోకము, కరుణ,ఇత్యాదులన్నీ ఆత్మాశ్రయాలే! అనిపేర్కొంటూ క్రోధాన్ని ఆశ్రయించిన విప్లవం కూడా ఆత్మాశ్రయమే అని పేర్కొన్నాడు. ఈ అభిప్రాయాన్ని ఒకింత పరిశీలించాలి.

ఇక్కడ భక్తి, ప్రేమ, శోకం, కరుణ వీటికంటే భిన్నమైందిగా క్రోధం కనిపిస్తుంది. ఈర్ష్యాద్వేషాలు. క్రోధం. ఇవన్నీ ఆత్మ సంబంధాలే అయినా భక్తి ప్రేమల్లోవున్నట్టి ఆత్మీయతా భావం వీటిలో కనిపించదు. ఈర్ష్యద్వేషం. క్రోధం ఇవన్నీ వ్యక్తినుండి సాన్నిహిత్యాన్ని కాక ఎడబాటును కోరతాయి. అలాగే విప్లవం కూడా.అందువల్ల ఈ భావాల్లో హృదయానికి దగ్గరి సంబధం కాక దూరపు సంబంధాన్ని కోరుకోవటం కనిపిస్తుంది. కాబట్టే వీటిల్లో ఆత్మాశ్రియత్వం కనింపిచదు.

ఈర్ష్య. ద్వేషం, క్రోధం ఇలాంటి అమానుష ప్రవృత్తులు లేక మానవులచే అనాదరింపబడే ప్రవృత్తులు. హృదయ సంబంధాలైనప్పటికీ రచనలో వాటి ఉద్దేశం వేరు. విప్లవాన్ని ప్రబోధించ డానికే క్రోధం అభ్యుదయ కవిత్వంలోనూ,విప్లవ కవిత్వంలోనూ చోటుచేసుకొంది. ఇక్కడ క్రోధం మానసికమైన అంశమై అది ఆవిర్భవించేవిషయంలో హృదయానికి సంబంధించిందే అవుతుంది. కానీ ఆచరణ విషయంలోక్రోధం ఇతరుల్ని విప్లవోన్ముఖుల్ని చేయడానికి విప్లవ కవిత్వంలో రేకెత్తినట్లుగా కనిపిస్తుంది. కానీ ప్రేమ, భక్తి,మొదలైన వాటిలోని భావాలు అంటే ప్రేమ భావం భక్తిభావం వంటివి కేవలం కవియొక్క ఆత్మీయమైన అంశాలై తనకున్న అనురాగాన్ని భక్తిని ప్రకటించుకోవడం కోసం వెలువడ్డాయి. కాబట్టి విప్లవాన్ని ఆశ్రయించివున్న క్రోదంతో పోల్చిచూస్తే ఈ భావాలన్నీ హృదయ సంబధాలే అయినా ప్రేమకి, భక్తికి వున్నంత ఆత్మీయగుణం, ఆదరణీయగుణం క్రోధానికి, ఈర్ష్యా, ద్వేషాలకి లేవు. కాబట్టి అవి పరాశ్రయాలవుతాయి. వాటిని ఆశ్రయించి వెలువడిన కవిత్వం కూడా పరాశ్రయ కవిత్వం అవుతుంది. అభ్యుదయ, దిగంబర, విప్లవ కవిత్వాలు ఇలాంటివే. ఒక్క భావకవిత్వంలోనూ. భావకవితాఛాయలున్న కొంతమంది అభ్యుదయ కవుల రచనల్లోనూ ఈ ఆత్మాశ్రయం బలీయంగా వుంది.

అభ్యుదయ కవులు తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్ళుమోసిన కూలీలను, వీధిన అడుక్కోడానికి కూడా శక్తిలేని 'భిక్షు వర్షీయసి"ని కూటికోసం, కూలి కోసం పట్టణంలో బ్రతుకు సాగిద్దామని తల్లి మాట పెడచెవినిపెట్టి వచ్చిన బాట సారిసీ గుమాస్తాలనీ, మధ్యతరగతి ప్రజల్ని కావ్యవస్తువులుగా స్వీకరించి రచనలు చేశారు. వారు ఎన్నుకొన్న కావ్యవస్తువుని గూర్చి చెప్పి పాఠకుల సానుభూతిని, అభ్యుదయ కవులు ఆశించారు. ఆ సానుభూతి నుంచి వారికి మేలుచేకూరేట్లు తద్వారా వారి భవిష్యత్తు వెలుగుమయమయేట్లు కోరుకున్నారు. ఇక్కడ సమాజంలో దుస్థితిని ఎదుర్కొంటున్న వాళ్ళని, వారిజీవిత విధానాల్ని, వారినే దోచుకొంటూ విలాసంగా జీవిస్తున్న వాళ్ళని గూర్చి విపులీకరిస్తూ అందరికీ అవగతమయ్యేలా చెప్పటమే అభ్యుదయ కవి ఆశయం. అందువల్ల ఆయా విషయ వర్ణనలకు సంబంధించిన అంశాల వివరణలతో అభ్యుదయ కవిత్వం వస్త్వాశ్రయమైంది.

అభ్యుదయ కవి ఒకవేళ భావకవిత్వంలో లాగా ఉత్తమ పురుష సర్వనామం 'నేను' వాడినా దానిని మనం ఆత్మాశ్రయధోరణిని వ్యక్తం చేసే 'నేను'గా భ్రమించటానికి అవకాశంలేదు. అభ్యుదయ కవి "నేను" కవియొక్క వ్యక్తిగత భావాలకు, ఆత్మ వ్యక్తీకరణకోసం వాడిందిగా గాక సమిష్టిగతమైన సమాజాన్ని ఉద్దేశించిందిగా గ్రహించాలి. ఈ సందర్భంలో కె.వి. రమణారెడ్డి గారి మాటలు స్ఫురణకు తెచ్చుకోవాలి. 'శ్రీశ్రీ" వాడిన నేనులో సమాజ జీవులైన మనం వచ్చిచేరి. ఆత్మాశ్రయతనుంచి తప్పించి నూతన చారిత్రక మహాశక్తులు జగన్నాథ రథచక్రాల వెంట నడిపించాయి,'[2] అనడం అభ్యుదయ కవిత్వం వస్త్వాశ్రయంగా వెలువడింది అని చెప్పడంగా వుంది.

అభ్యుదయ కవిత్వం భౌతిక పునాదులపైన నిర్మించబడి సామాజిక శ్రేయస్సు కుపకరించే సౌధం. అందువల్ల భౌతికమైన విషయప్రాధాన్యం కలిగి అభ్యుదయ కవిత్వం వస్త్వాశ్రయంగానే కొనసాగింది. దిగంబర, విప్లవ కవిత్వాలు కూడా ఇటువంటి సామాజిక శ్రేయస్సునే కోరుకున్నందున సామాజిక వాస్తవ స్థితిగతుల్ని చిత్రించటానికే పరిమితమయ్యాయి. అందువల్ల దిగంబర విప్లవ కవిత్వాలు కూడా వస్త్వాశ్రయంగానే నిర్వహింపబడ్డాయి.

అభ్యుదయ కవిత్వం పెట్టుబడి దారీ వ్యవస్థపైనా, బూర్జువావ్యవస్థపైనా, పాలకుల పాలితులను పీడించే విధానం పైనా ధ్వజ మెత్తిన కవిత్వ ఉద్యమం. అంతేగాక వర్గసంఘర్షణని, విప్లవ ప్రబోధాన్ని, వీరగాథా కథనాన్ని, సమసమాజ నిర్మాణాన్ని మానవతా వాదాన్ని ఇతివృత్తాలుగా స్వీకరించి వాటినన్నిటినీ దృష్టిలో వుంచుకొనివాటి సాధనకై పాటుపడింది. అందువల్ల ఈ అంశాలన్నీ అభ్యుదయ కవిత్వ లక్షణాలై అభ్యుదయ కవిత్వం వస్త్వాశ్రయంగా వెలువడడానికి దోహదం చేశాయి.

కానీ కాల్పనిక కవితా సంప్రదాయ ప్రభావంతో రచనలు చేసిన అభ్యుదయ కవుల కొన్ని రచనలు ఏరాజకీయ ఉద్యమానికీ, ఎలాంటి విప్లవ ప్రబోధానికి కట్టుబడకుండా, ప్రణయం. ప్రకృతి. స్మృతి ప్రాధాన్యాలుగా వెలువడ్డాయి. అటువంటి రచనల్లో కొంత ఆత్మాశ్రయత్వం అభ్యుదయ కవితాయుగంలో దర్శనమిస్తుంది.

ఈ అధ్యాయంలో అభ్యుదయ కవులుగా ప్రసిద్ధిపొందినా కాల్పనిక కవితా సంప్రదాయంతోనూ, భావ కవితా ప్రభావంతోనూ ఆత్మాశ్రయత్వంతోనో లేక ఇటీవలి కాలం భావకవితా సంబంధమైన అనుభూతి తత్వంతోనో చేసిన రచనల్ని వింగడించి పరిశీలిద్దాం.

అభ్యుదయ కవిత్వ యుగంలో శ్రీశ్రీ. నారాయణబాబు, శిష్ట్లా, పురిపండా పతాభి, ప్రారంభకులుగా ప్రసిద్ధి పొందగా. తిలక్, సోమసుందర్, ఆరుద్ర, దాశరథి, నారాయణరెడ్డి. కుందుర్తి, శేషేంద్ర మొదలైన వారు అభ్యుదయ కవిత్వ ప్రచారకులుగా ప్రసిద్ధి పొందారు. వారి రచనల్లో కొన్ని సందర్భాల్లో అభ్యుదయ కవిత్వంతో పాటుభావకవితా సంప్రదాయం తొంగి చూపించి. వీళ్ళలో ముఖ్యంగా శ్రీశ్రీ తొలినాళ్ళ రచనలు భావకవితాప్రభావాన్నే కలిగివున్నాయి. తిలక్. దాశరథి, నారాయణరెడ్డి, శేషేంద్రలు పూర్తిగా భావ, అభ్యుదయ కవులుగా దర్శనమిస్తారు. సోమసుందర్, కుందుర్తి రచనల్లో అభ్యుదయ దృక్పధంతో కూడుకున్న వస్త్వాశ్రయమే అధికంగావుంది. వీరి కొన్ని రచనలు ఇందుకు అపవాదాలు. శ్రీశ్రీ మొదలు శేషేంద్రల వరకూ ఉన్న అభ్యుదయ కవుల రచనల్లోని ఆత్మాశ్రయత్వాన్ని పరిశీలిద్దాం.

శ్రీశ్రీ : శ్రీశ్రీ తొలినాటి రచన అయిన 'ప్రభవ' సంకలనం ప్రకృతి గీతాలతోను, ప్రణయ గీతాలతోనూ, నిండివుంది. భావ కవుల్లాగే శ్రీశ్రీ ప్రారంభపు

యవ్వనంలో ప్రకృతిలో లీనమై ప్రణయ జలధిలో ఓలలాడాలనుకున్నాడు కాబట్టే-

'ఆ మహోన్నత దివ్య వృక్షాగ్రమందు
నూత్న చైతన్య రాగ సన్నుతములగుచుఁ
గదలి యాడెడు ప్రతిసంఘముల నడుమ
నేను సైత మొక్కాకునై యెనయుదేని"3

అని అంటూ అన్ని ఆకుల్లాగా జీవించినంత కాలం జీవించి చివరకు రాలిపడి పోయే కాలంలో పాంథ జనుల త్రొక్కిళ్ళలో నుగ్గిక్కిపోకుండా-

'గాలి యొసగెడు క్రొత్తరెక్కల ధరించి,
అతివిశాఘాటముగ విహాయాస పదాల
నెఱుక పడరాని యెచటికో ఎగిసిపోదు!'4

అని స్వేచ్ఛాప్రవృత్తినే కోరుకొన్నాడు. అంతేకాక భావకవుల్లాగే ఆకాశంలో ఒంటరియై సంచరించే మేఘాన్ని చూసి తనకూ మేఘానికీ వున్న చంచలత్వాన్ని పురస్కరించుకొని-

'ఓ వలాహక శకలమా! నీవుకూడా
నావలెఁ బరిభ్రమించుచున్నావదేల?'

అని మేఘశకలాన్ని ప్రశ్నించాడు. ఈ సంధర్భాలో శ్రీశ్రీ భావకవితాసంప్రదాయ ధారతో సతమతమౌతూ ప్రకృతి గతమైన అంశాల్లో అంతర్ముఖుడై తన భావాల్ని వెలువరించటం వ్యక్తమౌతూంది.

కేవలం ప్రకృతికి సంబంధించిన భావాల్లోనేగాక ప్రణయ భావాల విషయం లోనూ శ్రీశ్రీ "ప్రభవ'లో పాడులుదన్నుకొన్న ఆత్మాశ్రయత్వమే వెల్లడి చేయ బడింది. ప్రేయసీ వియోగంలో వేదనాభరిత జీవితాన్ని గడుపుతూ తన చీకటి బ్రతుకు బాధను వెళ్ళబోసుకున్న కృష్ణశాస్త్రి లాగే శ్రీశ్రీ-

"అక్కటా! ఈ వియోగాగ్ని యతిశయించి
కాల్చెదిని మామకీనాంగ కములనెల్ల!
కాఱుచున్న యనంతాశ్రుకణములందు
స్నానమొనరింతుఁ దాపప్రశాంతి కొఱకు!'6

అంటూ అంతమే లేనట్టి విరహాంబు రాశిలో మునిగిపోతూ దానిని మథించి అనంతమైన సుఖసుధాస్వాదు రసాన్ని పొందాలని తాపత్రయ పడ్డాడు. ఇలా 'ప్రభవ' లో శ్రీశ్రీ రచించిన ప్రకృతి గీతాల్లోనూ, ప్రణయ గీతాల్లోనూ భావ కవిత్వం నాటి కాల్పనిక సంప్రదాయంతో ప్రతిబింబించే ఆత్మాశ్రయత్వం స్పష్టంగా కన్పిస్తుంది.

శ్రీశ్రీ తన కవి మిత్రులు చని పోయిన సందర్భంలో చెప్పిన కవితల్లో కూడా ఆత్మాశ్రయధోరణి ప్రవహించింది. 'భావ దూరతీరాలకు చేరువుగా విహరిస్తూ, జీవనాడి స్పందించే రుధిర మధువు అందించే యువ కవి లోక ప్రతినిధి, నవ భావామృత రసఘుని, కవితా సతి నొసట నిత్యరస గంగాధర తిలకంగా'7 వెలుగొందిన తిలక్ మరణానికి విలపిస్తూ-

'గాలి మూగదయి పోయింది
పాట బూడిదయి పోయింది
వయస్సు సగం తీరక ముందే
అంతరించిన ప్రజాకవి
నభస్సు సగం చేరక ముందే
అస్తమించిన ప్రభాకవి
మరి కనిపించదా!"8

అంటూ వృక్షాన్ని, పక్షుల్ని, "చెప్పండర్రా! మీరైనా" అని ప్రశ్నించాడు, ప్రేమ, ప్రకృతి విషయంలోనే కాక స్మృతి కవిత్వ విషయంలో కూడా శ్రీశ్రీ ఆత్మాశ్రియ పద్ధతినే ఆశ్రియించి రచన కావించినట్లు తెలుస్తూంది.

శ్రీశ్రీ మార్కిస్టు దృక్పథంతో చేసిన మిగిలిన రచనలన్నీ వస్త్వాశ్రియంగా వెలువడ్డాయి. శ్రీశ్రీ 'మహాప్రస్థానం', 'ఖడ్గసృష్టి', 'లిమరిక్కులు", 'మరో ప్రస్థానం"లు పూర్తి అభ్యుదయ దృక్పథంలో కూడుకొని వస్త్వాశ్రియంగా వెలువడ్డాయి.

తిలక్ : శ్రీశ్రీ తరువాత భావ కవితా సంప్రదాయంతో ఆత్మాశ్రియంగా రచనలు చేసిన వాడు దేవర కొండ బాల గంగాధర తిలక్, అమృతం కురిసిన

రాత్రిపీఠికలో కుందుర్తి తిలక్‌ను భావ కవిగానూ, అభ్యుదయ కవిగానూ పేర్కొన్నాడు.9 దీనికి కారణం ఆయన కవిత్వంలో జాల్వార్చిన అనుభూతితో కూడుకొన్న ఆత్మాశ్రియత్వమే. తిలక్ తన్నుతాను అనుభూతి వాదిగా పేర్కొన్నాడు. అందుకే కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చెయ్యాల"ని కోరుకొన్నాడు.

తిలక్ కూడా భావ కవుల్లాగే స్వేచ్ఛాప్రియుడయ్యాడు. ఆ స్వేచ్ఛ తన కోసమే కాకుండా తనలో సుఖించాల్సిన తన ప్రేయసికి కూడా కావాలని-

> 'ఒక్కసారి యిల్లు విడిచి
> ఉత్సాహంగా రా చెలీ,
> .... .... ....
> కొంచెం సేపు స్వప్నంలోకి
> గోర్వంకల రెక్కలతో
> ఎరిగిపోదా మన్నీ మరిచి"10

అంటూ తన కోర్కెని వెల్లడించాడు ఇక్కడ తిలక్ స్థితి భావ కవుల స్థితిలాగే వుంది. లోకంలోని బాధామయ జీవుల ఆవేదన, రొటీన్ అలవాటైన జీవిత విధానం ఇవన్నీ బాధామయంగా తోచగా ఊహా పక్షాలు తొడుక్కొని ఎక్కడికో ఎగిరి పోయి సుఖించాలనుకొన్నాడు.

తిలక్ ప్రణయ కవిత్వంలో ఆంగ్ల కాల్పనిక కవుల, పూర్వ భావ కవుల ప్రభావం ఉండటం చేత ప్రణయ కవిత్వాన్ని వాళ్ళననుసరిస్తూ ఆత్మాశ్రియంగా చెప్పాడు. తిలక్ కావ్య ఖండికల్లో ఎక్కడా వర్ణనా బాహుళ్యం కనిపించదు. సుఖాన్ని చెప్పేటప్పుడుకాని, దుఃఖాన్ని చెప్పేటప్పుడు కాని, భక్తిని చెప్పేటప్పుడు కాని ఆత్మాశ్రయ రీతిలోనే చెప్పాడు. తను చెప్పే ప్రతి విషయాన్నీ అంతర్ముఖుడై అంతరాంతర జ్యోతిస్సీమల్ని తరచి చూసి మరీ చెప్పాడు. అందుకే అతని కవిత్వంలో ఆత్మాశ్రియత్వం అధికంగా చోటు చేసుకొంది.

తిలక్ ప్రణయ కవిత్వ విషయంలో భావ కవుల్లాగా అందరాని ఊహా ప్రేయసుల కోసం అర్రులు చాచలేదు. తనతో వుండే ప్రేయసీ మాధుర్యాన్ని అనుభవించి ఆ అనుభవాన్ని భద్రంగా గుండెలోతుల్లో దాచుకొన్నాడు. అప్పుడప్పుడూ ఆ అనుభూతి తాలూకు జ్ఞాపకాలు స్ఫురణకు వచ్చినప్పుడు సంతోషంతో

పొంగిపోయాడు. బాధతో కుమిలి పొయ్యాడు. ఎప్పుడో తాను ప్రేయసితో కలిసి వున్నప్పుడు ఆమె పాడిన తీయని పాటని, తాను పొందిన అనుభూతిని గుర్తుకు తెచ్చుకొంటూ తిలక్ -

'నువ్వు లేవు నీ పాట వుంది .... ....
.... .... .... .... ....
సిగ్గిలిన సోగ కళ్ళతో మల్లెపూల వాల్జడతో నువ్వు పాడినపాట
నా గుండెల దగ్గర తడలడుతూ'11

వుంది అనడం ఆత్మాశ్రయ రీతిని వ్యక్తంచేస్తుంది. ఈ వచనగేయంలో ఎప్పుడో తన ప్రేయసి పాడిన, పాటను ఆ సన్నివేశాన్ని ఆమె వియోగంలో స్మృతికి తెచ్చుకొని తన హృదయం లోతుల్లోని తీవ్రతని ఆత్మాశ్రయ రీతిలో వెల్లడిచేశాడు.

ఏ కారణం చేతనో దూరమైన ప్రేయసి వియోగంతో బాధపడుతున్న కవి హృదయంలో చీకటి అలముకొంది. అప్పుడతనికి తన ప్రేయసి 'శార్వరీప్రియ' గా సాక్షాత్కరించింది కృష్ణశాస్త్రి ప్రేయసిలాగా. అలాంటి స్థితిలో తిలక్

'రావె నల్లనిదాన నా మనసులో రాపాడు శోకాకృతీ
వేవేల్ చుక్క సరాల దాల్చికొను నావింతైన యిల్లాల; ని
ద్రావేశమ్ము లోకమెల్ల జడా భూతమ్మయ్యె మేల్కొన్న నా
ఆవాసమ్ము రహస్య మిచ్చుటకు నేకాంతమ్ముగా రాచెలీ!'12

అంటూ తన మనసులోరాపాడే శోకాకృతినే ప్రేయసిగా భావించాడు. ఆ చీకటి రాజ్ఞితో నిశీధి మధ్యలో సైతం నిద్రపోకుండా మానిని ఊర్పులవాడి సూదుల్ని లోనికి గ్రుచ్చి వెలుతుర్ని చూడాలని తహతహలాడాడు.

తిలక్ ఆత్మాశ్రయ ధోరణిలో పాడదలచిన పాట గర్భమందే ఆగిపోగా తన ప్రణయానికి అడ్డువచ్చిన విధిని భావకవుల్లాగే నిందించటం ప్రారంభించాడు. వ్యాకుల మనస్కుడైన తిలక్

'ఓరీ! ఈ సౌఖ్య జీవ మహోత్సవమ్ము
జగతి పెద్ద పండుగగ జేయగ దలంప
నెంత విష కిల్బిషోగ్ర నాగేంద్రు చేత
బ్రతుకునే కబళించి సంరంభ పడితి'13

అని నిందిస్తూ తీయగా గడపవలసిన జీవితంలో చిచ్చు రగిల్చావే అని వాపో యాడు. భావకవుల్లాగే ప్రణయ కవిత్వాన్ని ఆత్మాశ్రయ ధోరణిలో రచించిన తిలక్ దృష్టి క్రమంగా ప్రేయసినుంచి పరమాత్మవైపు మళ్ళింది. ఆ పరమాత్ముని స్వరూపమే నిత్యం అని తెలుసుకో గలిగింది. అందుకే అచ్చం భావకవి లాగే తిలక్,

'ఏ పరమాత్మ మీ యెదద నింతకు నిండినదో........

....దాపయి ఆడి పోవు హర నాట్య పద ధ్వని

మ్రోయునాత్మలో'[14]

అని అంటూ పరమాత్మ స్వరూపాన్ని నింపుకొన్న తన హృదయంలో శివుని నాట్య విన్యాసంలోని పాద తాకిడులు వినిపిస్తూ వున్నాయని అంతర్ముఖత్వాన్ని ప్రదర్శించాడు, నెమ్మదిగా తన హృదయంలోకి తొంగి చూసుకొంటూ, అటు వంటి స్థితిలో అతని మాట పాటయ్యింది. మనసు శిఖరమయ్యింది. అక్కడ నుంచి చూస్తే కైలాసం కనిపించింది కవికి, ఆ దివ్య దర్శనంతో -

'మాట పాటయ్యె మనసు శిఖరమయ్యె ఎక్కియెక్కి ఎంత యెత్తుకేని

కలయజూడ నది కైలాసమే నయ్యె లోచనముల దివ్యలోచులెసగ'[15]

అని ఆత్మాశ్రియత్వంతో తన మనోగత భావాన్ని చక్కగా వ్యక్తంచేశాడు. కవి అంతర్ముఖుడు కాందే ఇలాంటి భావాలు రావు ఇక్కడ కవి మాటపాటయ్యిందని, మనసు శిఖర మయ్యిందని అంటూ కలయజూడగా అది కైలాసమయ్యిందన్నాడు. అంటే మాటలోనే దివ్యత్వాన్ని అంతర్ముఖుడై దర్శించాడన్న భావం ఇక్కడ ధ్వనిస్తుంది. తాను దర్శించిన ఆ దివ్యత్వాన్ని ఆత్మగతంగా వెల్లడించుకొన్నాడు.

కానీ తాను దర్శించిన ఆదివ్యత్వం వల్ల ప్రయోజనం లేక పోయింది. కార ణం ఆ భగవంతుడు ఎంతకూ కరుణించలేదు. ఈ విషయాన్నే తిలక్ -

'స్వామీ! ఎంత మహోగ్ర మౌర్యమొకా ఈ త

పస్సు! జీవమే సమిధగా వైచినాను

కాని వేచి విసిగియున్న కాచి యున్న

యెడద వ్రణమైన జేయక వెడలినావు'[16]

అని అంటూ తన బాధ తీవ్రతని ఆత్మాశ్రయత్వంతోనే నింపుకుని ప్రకటించాడు. ఎంతో కాలంగా జీవితాన్ని సమిధగాజేసి భగవంతునికి అర్పించి కాచుకొని వుండగా

హృదయంలో కనీసం గాయమైనా చెయ్యకుండా పోయావేమిటని బాధా మిశ్రిత హృదయంతో భగవంతుని ప్రశ్నిస్తున్నాడు. ఇక్కడ ప్రకటించిన భక్తిభావంలో కూడా తిలక్ ఆశ్రయించిన ఆత్మాశ్రయత్వమే ఉజ్జ్వలంగా ప్రకాశిస్తూవుంది.

భావకవితా సువాసనల్ని నింపుకొన్న తిలక్ కవిత్వంలో ప్రణయానిదే ఆధిపత్యం అయినా స్మృతి కవితలుకూడా రెండు మూడు రచించాడు వాటిల్లో నెహ్రూపై రచించిన స్మృతి కవిత ఎక్కువ ఆత్మీయతా ముద్రని సంతరించుకొనివుంది. తిలక్ నెహ్రూ మరణానికి విలపిస్తూ -

'ఈ హఠాత్పరిణామంలో
ఎంత అర్థ విహీనమై పోయింది సర్వం
ఎంతగా కుంగి 'కో' యని విలపించింది నా హృదయం'17

అంటూ తాను తీవ్రస్థాయిలో పొందిన ఆలోచనను అనుభూతి పరంగా వ్యక్తం చేశాడు. నెహ్రూ మరణించగా ఆ స్మృతినుంచి ఎలా పారిపోగలనంటూ, ఆ దుఃఖాన్ని ఎలా మరచి పోగలనంటూ తన తీవ్రమైన బాధని వ్యక్తం చేయటంలో అనుభూతి పరమైన ఆత్మాశ్రయత్వమే గూడుగట్టుకొంది.

తిలక్ కలంనుంచి వెలువడిన 'ప్రభాతము-సంధ్య', 'అమృతం కురిసిన రాత్రి', 'గోరువంకలు' (అముద్రిత రచన)లో ఈ కోవకు చెందిన ఆత్మాశ్రయత్వమే ప్రణయంలోనూ, భక్తిలోనూ అధికంగా వుంది.

సోమసుందర్ : ఆధునిక కవిత్వంలోకి 'వజ్రాయుధం'తో ప్రవేశించిన అభ్యుదయ కవి ఆవంత్స సోమసుందర్, 'కాహళి', 'మిణుగురులు', 'అనలకిరీటం', 'వెన్నెలలో కోనసీమ' వంటి కవితా సంపుటాలను, 'రక్తాక్షి', 'మేఘరంజని', వంటి కావ్యాలను రచించిన సోమసుందర్ కవిత అభ్యుదయ కవిత్వానికే అంకితమయ్యింది. పూర్తిగా అభ్యుదయ దృక్పథంతో రచనలు చేయడంవల్ల ఈయన కవిత్వమంతా వస్తుముఖంగానే కొనసాగింది. కొన్ని సందర్భాల్లో ప్రకృతి వెల్లడి చేసేటప్పుడు మాత్రం ఆత్మాశ్రయత్వం కనిపిస్తుంది. ఏదో ఒక అనిర్వచనీయమైన అలౌకిక శబ్దాన్ని విన్న కవి-

'నిన్న రాత్రి విన్నా నొక
స్వర్గలోక సౌధాంతర

స్రవత్ చలత్ గాన
తంత్రీస్వర మధులహరిని....'[18]

అంటూ ఆ విన్న శబ్దం 'గానమో, సంగీతమో-స్వర వాహినియో, గాంధర్వమొ ....పింఛ మౌళి వేణురవళొ....'[19] అని అంతర్ముఖుడై ప్రశ్నించుకొంటున్నాడు. ఇక్కడ సోమసుందర్ కవితా వ్యాసంగం అంతర్ముఖత్వం వల్ల సిద్ధించింది. కవి విన్న శబ్దాన్ని విన్నట్లే ఉపేక్షించి వుంటే ఈ కవితలేదు. కానీ కవియైన వాడు అలా ఉపేక్షించడు. ఆ వినిపించిన స్వరమాధుర్యాన్ని అనుభవించి ఆనందించి దీని పుట్టుక పూర్వోత్తరాలను గురించి ఆరాతీస్తాడు. అలా ఆరాతీయటం కోసం అన్వేషణ ప్రారంభమవుతుంది. ఆ అన్వేషణ హృదయ సీమల్ని తరచి చూసేదిగా వుంటే ఆత్మాశ్రయ మవుతుంది. ఆతత్వమే ఇక్కడ దర్శనమిస్తూవుంది,

ఇలాగే సోమసుందర్ కవిత మరికొన్ని సందర్భాల్లో ఆత్మాశ్రయరీతిని అనుసరించి వెలువడింది, కవి తనని, తన రచనలు ప్రసవించే వాతావరణాన్ని గురించి, తన సంచారాలను గురించి చెప్తూ -

'నా రాత బల్ల చేయెత్తి పిలిస్తే వెళ్ళి దగ్గర కూర్చున్నాను
నింపాదిగా నిమిరాను
నన్ను నేను ఒలక బోసుకొంటున్నాను, నాదారినేనే
చీల్చుకొంటున్నాను
ఏరులై వాగులై ప్రవహిస్తున్నాను, నా నడక ముళ్ళ
తుప్పల కొండల్లోంచి కాదు, తెల్లని మైదానాలలోంచి....
ఆకు పచ్చని ఆనందాలతోటి.... ఎర్రని స్వప్నాల నుంచి....'[20]

అంటూ తన కవితా వ్యక్తిత్వాన్ని ప్రదర్శిస్తున్నాడు. ఇక్కడ కవి తన వ్యక్తిత్వాన్ని ఆత్మాశ్రయ ధోరణిలోనే ప్రకటించాడు. కవి స్వేచ్ఛా ప్రవృత్తి కలవాడు, అతడు ఎన్ని రమణీయ ప్రదేశాలైనా సందర్శించవచ్చు. భయాన్ని గొలిపే ఎంతటి ప్రమాద ప్రాంతాలైనా చూడవచ్చు ఆటువంటి అతని సంచార సందర్భాల్లో అతను నింపుకున్న అనుభవాన్ని, అనుభూతిని కవితగా మలచుకోవచ్చు. ఆ దృష్టితో సోమసుందర్ తన సంచారాల్ని గూర్చి చెప్తూ తనను తానే చీల్చుకొని ఏరులై వాగులై ప్రవహిస్తున్నానన్నాడు, అంతేకాదు తన నడక తెల్లనిమైదానా

ల్లోనూ, ఆకువచ్చని ఆనంధాల్లోను కొనసాగుతుందని తన మనోగత భావాల్ని, తన సౌందర్య కాంక్షని ఇక్కడ ఆత్మాశ్రయరీతిలో బహిర్గతం చేశాడు.

కుందుర్తి : వచనకవితా పితామహుడుగా పేరుపొందిన కుందుర్తి ఆంజనేయులు రచనల్లో సోమసుందర్ కవితల్లోలాగే ఎక్కడో కొన్ని సందర్భాల్లో ఆత్మాశ్రయత కనిపిస్తుంది. మిగిలిన రచనలన్నీ వస్త్వాశ్రయ పద్ధతిలోనే కొనసాగాయి.

కుందుర్తి వచన కవిత్వ మహోద్యమాన్ని బహుముఖంగా విస్తరింపజేసి కవిత్వం కథా ప్రధానంగా వుండాలని బలీయంగా విశ్వసించి దానిని ఆచరించి చూపాడు. అందువల్ల ఈయన రచనలన్నీ వస్తుగతంగానే వెలిశాయి. కుందుర్తి వచన కవిత్వంలో 'నయాగరా', 'తెలంగాణ', 'ఆశ', 'యుగేయుగే', 'నగరంలో వాన', 'మాతృగీతం', 'ఇదీనా దేశం' వంటి కవితా సంకలనాలతోపాటు 'శిక్ష ఏమిటికి' వంటి వచన కవితా నాటికలని కూడా రచించాడు. ఇవన్నీ దాదాపు వస్త్వాశ్రియాలే.

కానీ వస్తు బాహుళ్యాన్ని కవిత్వంలో నిర్దేశించిన వాడైనప్పటికి కుందుర్తి కొన్ని రచనలు ఆత్మాశ్రయంగానే వస్తు నిరపేక్షతో కొనసాగాయి. కుందుర్తికి కవిత్వంపైన ఒక విశ్వాసం వుంది. ఆ విశ్వాసాన్ని ప్రకటిస్తూ-

> 'ఆనందం గట్టు తెగి ప్రవహిస్తున్నప్పుడు
> అందులో ఈదకుండా ఆగదు నా మనస్సు
> బ్రతుకు పందిరిలో పూసిన ఆశలనూ, ఆశయాలనూ
> కోసుకునే కోర్కెల్ని విరమించుకోలేదు కవిత"[21]

అంటూ ఆనంద పూరితమైన హృదయంతో జీవిత పందిరిలో పూసిన ఆశలను, ఆశయాలనూ కోసుకొనే కోర్కెల్ని విరమించుకో లేదు తన కవిత అన్నాడు. ఇక్కడ సంతోషం హృదయ సంబంధం. ఆశలూ, ఆశయాలూ హృదయసంబంధాలే. తన మనోగత భావాల్ని దృఢమైన విశ్వాసాన్ని ప్రకటించటంలో కుందుర్తి ఆత్మాశ్రయత్వాన్నే అనుసరించాడు. ఇలాంటి మనోగత భావాల్ని వెల్లడి చేయటంలోనే కాక ప్రకృతి అంశాల్ని కవిత్వీకరించటంలో కూడా కుందుర్తి ఆత్మాశ్రయ ధోరణినే ఆశ్రయించాడు. ప్రకృతిని తిలకించి పులకించి పోయే భావ కవిలాగే

కుందుర్తి నాగార్జున సాగరాన్ని చూసినపుడు పొందిన సంతోషాన్ని ఆత్మగతం గానే ప్రకటించుకొన్నాడు.

'ప్రతి చెట్టూ, ప్రతిగుట్టా
నవ్వుతూ పలకరించినట్లు నా వేపు చూసింది
పంట పండని బీడు సైతం
పచ్చి గడ్డితో స్వాగతప్ర తివాసీ వేసింది'22

అని కవితాను చూసిన సుందర ప్రపంచం అనుభూతిలోకి మునిగిపోయి ఆనం దాన్ని నింపుకున్న హృదయంలో ప్రకృతి సౌందర్యం అంతా తనదిగా భావించాడు.

కుందుర్తి మార్క్సిజంచేత పూర్తిగా ప్రభావితుడైనా భక్తి విశ్వాసాలు లేని వాడు కాదు. అందుకే భగవంతునిపై భక్త్యావేశంతో భగవంతుని రథం తన యింటి ముందు ఎందుకు ఆగిందో అంటూ ఆత్మాశ్రయ ధోరణిలో ప్రశ్నిస్తూ -

"స్వామీ! నీ రథమ్మిట్టి విశ్వాస హీను
గృహము ముంగిట నేల యాగినదొకాని
ఈయెడద పూర్వ జన్మ స్మృతుల జలలు
పొంగినవి తేరునకు వారుపోసినట్లు"23

అన్నాడు ఈ జన్మలో తనకు భగవంతునిపైన విశ్వాసం లేకున్నా పూర్వజన్మ వాసనా ఫలితంగా భగవంతుని రథం తన ముంగిట వాలటంచేత తనహృదయం ఉప్పొంగి పోయిందంటూ ఆత్మభావ ప్రకటన కావించుకొన్నాడు.

ఇలాంటి కొన్ని సందర్భాల్ని మినహాయిస్తే కుందుర్తి మరెక్కడా ఆత్మా శ్రయ రీతిని అనుసరించిన వాడుగా కనిపించడు. వచన కవిత్వాన్ని కథానిర్వహ ణకు, కమ్యూనిస్టు సిద్ధాంతాల ప్రచారానికి, కష్టజీవుల సమస్యల పరిష్కారానికి వినియోగించాలనుకొన్న కుందుర్తి రచనలన్నీ వస్తు నిర్వహణతో కొనసాగాయి. తన ఆశయాలనీ, ఆలోచనలీ, కవిత్వీకరించాలనుకున్న ప్రయత్నంలో ఆయన మనోభావాలు కాక దృఢ సంకల్పంతో కూడుకున్న చిత్తవృత్తి కవితల్లో ప్రతిబిం బించటంచేత ఇతని రచనల్లో ఆత్మాశ్రయత్వం అధికంగా చోటుచేసుకోలేదు.

ఆరుద్ర: 'త్వమేవాహం'తో తెలుగు కవుల్లో ఒక స్థానాన్ని సంపాదించుకొన్న ఆరుద్ర రచనల్లోకూడా ఆత్మాశ్రయత్వం కంటే వస్త్వాశ్రయత్వమే ఎక్కువగా

పొందచూపింది. 'సినీవాలి', 'ఎంచిన పద్యాలు', 'ఇంటింటి పద్యాలు' 'గాయాలూ గేయాలు' 'కూనలమ్మ పదాలు' వంటి రచనలు చాలా ఆరుద్ర కలం నుంచి వెలు వడ్డాయి. ఇవన్నీ దాదాపు వస్త్వాశ్రియంగానే కొనసాగాయి. ఆరుద్ర సోమసుంధర్ కుందుర్తులలాగా అభ్యుదయ దృక్పథంతో రచనలు చేయటంవల్ల వస్త్వాధిక్యానికి అవకాశం ఏర్పడింది.

కమ్యూనిస్టు దృక్పథంతో సామ్యవాద సిద్ధాంతాల్ని, వర్గపోరాటాన్ని చిత్రించటంతోనూ, దేశభక్తిని ప్రబోధించటంలోనూ, ఆరుద్ర రచనలు ఆత్మా శ్రయత్వాన్ని అధికంగా కలిగి ఏక వస్త్వాశ్రయతనే కలిగి వున్నాయి. కానీ ఆరుద్ర ప్రణయ కవిత్వవిషయంలో మాత్రం కొన్ని కవితలు ఆత్మాశ్రయ ధోరణిలో కొన సాగాయి. తన ప్రేమ తత్వాన్ని వ్యక్తం చేస్తూ ఆరుద్ర -

"ప్రేయసీ నీ కొరకు నా రక్త మెలుగెత్తి
యుప్పొంగి పాదంగ మొదలాడు

.... .... .... .... .... .... .... .... ....

బాష్పధారల పెరుగు వేదనాలతలపై
విరియ బూచిన వేడినిట్టూర్పులే నీదు
చీకట్లు కురులతో సింగార మొలకించు"[24]

నంటూ వైచిత్రీ ప్రియత్వంతో కూడుకున్న భావాన్ని ఆత్మగతంగానే జాల్వా ర్చాడు, ప్రేయసికోసం తాను ఆరాటపడటాన్ని తన రక్తమే ఉప్పొంగి ప్రేయ సిని ఎలుగెత్తి పిలుస్తుందన్నాడు. అంతేకాదు ప్రేయసీ వియోగంలో తానెంత బాధపడుతున్నదీ అవగతం చెయ్యడానికి భావవైచిత్రితో బాష్పధారలలో పెరిగి నటువంటి వేదనాలత కుసుమించిన నిట్టూర్పుల పుష్పాల్నే ఆమె చీకటి కురుల్లో తురుమదలచాడు. ఈ ప్రణయ భావం ఆత్మాశ్రయత్వంతో కూడుకొని ఆరుద్ర సహజవైచిత్రి ప్రియత్వాన్ని ప్రకటించేదిగా వుంది.

ఆరుద్ర తన ప్రేయసికి తనకూ మధ్యవున్న ఎడబాటును విధి ద్రష్టమైన ఒక కాటుగా భావిస్తూ 'ఎడబాటు కాటు'కు బాధపడుతూ భావ కవిలాగా -

"నీవు లేనంత మాత్రాన గుండె పగిలి
ఒక్కసారిగ మరణించబోను

నిన్ను తలపోసుకొనుచు బ్రతికి
క్షణక్షణ మరణమ్ము పొందెదను నేను'25

అంటూ ప్రేయసీ ఎడబాటు తీక్షతతో ఒక్కసారిగా మరణిస్తే బాధ అనిపించదు కాబట్టి బాధపడాలనే ఉద్దేశంతో క్షణక్షణమూ మరణాన్ని పొందుతూ బాధపడు తుంటానని తన బాధని ప్రకటించాడు. ఇలాంటి సందర్భాల్లో మాత్రమే ఆర్ద్ర ఆత్మాశ్రయత్వాన్ని అనుసరించిన వాడుగా దర్శనమిస్తాడు అతని కవితల్లో.

దాశరథి : ఆధునిక కవుల్లో సవ్యసాచిత్వం వహించి కవిత్వం వ్రాస్తూ తన వ్యక్తిత్వాన్ని సంతరించుకున్న కవి దాశరథి. అభ్యుదయ దృక్పథంతో తెలంగాణా పోరాటంలో పాల్గొని, నిజాం బూజును దులపటానికి కృషిచేసిన దాశరథి రచన లన్నీ ఇతర అభ్యుదయ కవుల్లాగే వస్త్వాశ్రయంగానే కొనసాగాయి.

అభ్యుదయ దృక్పథంతో దాశరథి 'అగ్నిధార' 'కురిపించి 'రుద్రవీణ'ను మీటి 'అమృతాభిషేకం' చేసుకొన్నాడు. అమృతాభిషిక్తుడైన కవి దాశరథి 'మహాంధ్రోదయాన్ని' 'కవితా పుష్పకం'గా వెలువరించాడు. అంధకారంలో కూరుకపో తున్న మానవ సమాజం కోసం 'తిమిరంతో సమరం' జరిపి కాంతి కవాటాన్ని తెరిచాడు.

అభ్యుదయ కవితా దృక్పథంతో కవితా వెల్లువని ప్రవహింప జేసిన దాశరథి భావ కవితా సంప్రదాయాన్ని జీర్ణించుకొన్నవాడు కావటంచేత ఋతు వర్ణనల విష యంలో ఆత్మాశ్రయాత్వాన్ని తన కవిత్వంలో నింపుకొన్నాడు. భావకవులు తాము సృష్టించుకొన్న ఊహా ప్రేయసితో అనురాగం పంచుకొని, ఆమె ఎడబాటులో విలపించగా దాశరథి భిన్న ఋతువుల్లో భిన్న భంగుల్లో దర్శనమిచ్చే ఋతురాజ్ఞినే ప్రేయసిగా భావించి ప్రణయ కవిత్వాన్ని రచించాడు. ఇటువంటి కవితల్లోనూ, భక్తిభావాన్ని ప్రకటించే కవితల్లోనూ దాశరథి రచనల్లో ఆత్మాశ్రయత్వం కొంత ఆధిక్యతని సంతరించుకుంది. మిగిలిన సందర్భాల్లో శాంతి ప్రియత్వంతోనూ, మానవతా వాదంతోనూ కూడుకొని దాశరథి కవిత వస్త్వాశ్రయంగా కొనసాగింది.

'ఓ వాసంత కుమారి! నీ పెదవులం
దూరెన్ మరందాంబు ధా
రావాఃపూరము; ఈ ప్రవినాడ పుడిసి
ళ్ళన్, చెంబులన్, బిందెలన్,

రావే, నా హృదయంపు సైకత ధరా
రంగాన పొంగారి శో
భావాల్లభ్యము నగ్గలింపుము; మధు
ప్రభాతిక స్వామినీ!"26

అని వసంత ఋతురాజ్ఞిని మధుప్రభాతిక స్వామినిగా భావించి అధరామృత ధారను క్రోలి ప్రేయసికి మళ్ళీ మళ్ళీ అహ్వానం పలుకుతున్నాడు. ఋతు రాజ్ఞినే కాకుండా శాంతిని కూడా ప్రేమ భావంతో చూశాడు. దాశరథి. ఆ ప్రేమ భావం హృదయం నుంచి జాల్వారేదిగా వుంటూ దాశరథి కవితావ్యక్తిత్వాన్ని వెల్లడి చేసేదిగా వుంది. శాంతి తోటి తన వలపును వ్యక్తం చేస్తూ –

"మనదౌ ది-త ప్రేమ! మధుమాసమున్ పికమేమిపాడినన్,
వనమున నేమి పూచినను పట్టదు, నీ హృదయాంగణమ్ము పం
చనుగల గున్నమావికడు చక్కని పండ్లనొసంగె; వాని చెం
తను మనమేకమై ప్రణయ నాట్యము సేయుదమెల్లవేళలన్"27

అన్నాడు. ఇక్కడ ప్రకృతి గతమైన అంశాలు కాక శాంతి దేవత హృదయంలో ఫలించిన గున్నమావి చెంత జేరి ఎల్లప్పుడూ ప్రణయ నాట్యాలు చేయాలని కోరు కొంటున్నాడు. ఇందులో ప్రకృతినే కాదు శాంతిని కూడా ప్రణయదేవతగా భావించి ఆరాధించేతత్వం శాంతి ప్రియత్వాన్ని ప్రకటించేదిగా వుండి ఆత్మాశ్రియ తని కలిగి వుంది.

దాశరథి రచనల్లో ప్రకృతి గతమైన అంశాల్ని ప్రేమతో చూడటంలోనే కాక భగవంతునిపై వుండే భక్తి భావాన్ని ప్రకటించటం లో కూడా ఆత్మాశ్రయ త్వమే గూడుకట్టుకొంది దాశరథి భక్తితత్వంలో శివపరమైన భక్తే ఎక్కువగా కనిపిస్తుంది.తన భక్తిభావాన్ని దాశరథి శివస్తుతితోనో, శివుని వ్యక్తిత్వాన్ని కొని యాడటంతోనో వెల్లడించుకొన్నాడు. భగవంతుని చేరుకోవటం కోసం ఆరాట పడుతూ దాశరథి –

'నీవరుదెంతువా! శశిమణీ మయదివ్యజటా, విలాసి, స్వా
మీ! వలమాన పశ్చిమ సమీర కుమారములూడ్చివేసెనా
పూవులతోటనంత యును, మొక్కలు బిక్కమొగాలు వేసె;ల
జ్జావశతన్ వినమ్రిత వొసంగె; నినున్ గయిసేయుటెట్లురా!'28

అంటూ దాశరథి తన జీవిత సర్వస్వాన్నీ పశ్చిమ సమీరకుమారాలు వూడ్చి వేసే యంటూ లజ్జావశంతో, వినమ్రితతో భగవంతుని పొందుట ఎట్లంటూ ప్రాధేయ పడ్డాడు.

ఇలా దాశరథి కవిత్వంలో కూడా ప్రకృతి గతమైన అంశాల్ని ప్రేమ భావంతో దర్శించటంలోనూ ప్రణయ భావాల్ని ప్రదర్శించటంలోనూ, భక్తితత్త్వాన్ని వెల్లడి చేయటంలోనూ భావకవితా ప్రభావంతో ఆత్మాశ్రయత్వమే ప్రవహించింది.

నారాయణరెడ్డి : సంప్రదాయ ప్రయోగాల్ని జీర్ణించుకొని రచనలు చేస్తూ లబ్దప్రతిష్ఠుడైన కవి సి. నారాయణ రెడ్డి. ఈయన కవితా వసంతం నిండా ఎన్నోకుసుమాలు సుమించాయి. 'జలపాతం'తో ప్రారంభమైన 'నారాయణరెడ్డి గేయాలు' 'మృత్యువు నుంచి" వరకు ఈ సుమాల సుగంధ పరిమళాలను వెదజల్లాయి. "మరోహరివిల్లు", "మంటలూ - మానవుడూ", 'ముఖాముఖి', మణీషిచిలక" 'ఇంటిపేరు చైతన్యం" మొదలైన కవితా సంపుటాలు అభ్యుదయ దృక్పథంతో రచింపబడ్డవి "నాగార్జున సాగరం" "కర్పూర వసంతరాయలు' మొదలైనవి గేయ కావ్యాలు.

పుంఖాను పుంఖంగా వెలువడిన ఈయన కవితా సంకలనాల్లో "నారాయణ రెడ్డి గేయాల్లో' ను, మృత్యువు నుంచి'లోను కొంత ఆత్మాశ్రయత్వం కనిపిస్తుంది. ఈ రచనల్లో నారాయణరెడ్డి కొంత వరకు భావ కవితా ఛాయల్ని నింపుకున్నట్లనిపిస్తాడు. అందువల్లే ఆత్మాశ్రయరీతిలో అవి జాల్వారాయి. ఇటీవల పత్రికల్లో వస్తున్న కొన్ని కవితలు ఆత్మాశ్రయంగానే వెలువడుతున్నాయి.

నారాయణరెడ్డి "ప్రకృతిలోని ప్రణయని'ని దర్శించి ప్రకృతినే ప్రణయాధి దేవతగా రూపు సంతరింప జేయాలని ప్రార్థనాగీతం రచించాడు. ప్రకృతిలో వున్న అంశాలే తన ప్రేయసి సౌందర్యంగా రూపు దిద్దుకోవాలని ఆశించే భావకవిలా నారాయణరెడ్డి కొన్ని సందర్భాల్లో కనిపిస్తాడు. ఇలా ఆశించటంలో నారాయణ రెడ్డి మనోభావాలు ప్రతిబింబించే కవిత్వం ఆత్మాశ్రయతనే నింపుకొన్నదిగా వుంది.

'ప్రకృతి ముందు చేతులెత్తి

ప్రార్థింతును కడసారిగ

నా రమణికి బదులుగ ఆ

కారం ధరియించాలని'29

అని నారాయణరెడ్డి అన్నాడు.

భావ కవులందరిలాగే నారాయణరెడ్డి విషయంలో కూడా ప్రకృతి తన పరమ రమణీయకతతో కవి హృదయాన్ని చూరగొనింది. ఆ సౌందర్య తత్వాన్ని నింపుకున్న హృదయంతో నారాయణరెడ్డి ప్రకృతిలోని అంశాలకి ముగ్ధుడై తన రమణికి బదులు ప్రకృతే ఆకారం వహించి తన ముందు ప్రత్యక్షం కావాలను కొంటున్నాడు.

ఇటువంటి ప్రకృతి ప్రీతితో, సౌందర్య కాంక్షతో వలపు నింపుకున్న నారాయణరెడ్డి క్షణ కాలమైనా ఏకాంతాన్ని భరించలేక పోతాడు. తన 'కామినీమణి' చూపులతో గుండెలో పొగలు రేపి చిరునవ్వుతోనే చిచ్చు రగిల్చగా -

'ఎటుల సైతును నేను

చటుల విరహాగ్నులను

ఎటుల ఈదుదును నేను

హేమంత రాత్రులను"30

అంటూ విరహాగ్ని తీవ్రతని ప్రకటించుకొన్నాడు ఆత్మాశ్రయ ధోరణిలో. ఇక్కడ నారాయణరెడ్డి హృదయ సుకుమారంతో అచ్చం భావకవిలాగే విలపించటం గమనించాల్సిన అంశం. ప్రకృతి నంతా తన సౌందర్యంతో నింపుకున్న ప్రేయసి ఊహా చేలాంచలాల వెంట నారాయణరెడ్డి పరుగులు తీస్తూ -

'భువిని నందన వన

మ్ముగ మార్చు ఆమనీ!

కవి హృదిని పలికించు

గంధర్వ భామినీ!' అంటాడు.31

అభ్యుదయ దృక్పథాన్ని అలవరచుకొన్న నారాయణరెడ్డి కవిత్వంలో పైన పేర్కొన్న ప్రణయం, ప్రకృతి వంటి భావ-కవిత్వ అంశాల్ని వివరించటం ఆత్మాశ్రయత్వాన్ని నింపు కుంది.

ఇటీవల వస్తున్న రచనల్లో నారాయణరెడ్డి అనుభూతిని ఆకృతి చేసి మన కళ్ళ ముందు నిలబెట్టే ప్రయత్నం కనిపిస్తూవుంది. ఈ అనుభూతి తత్వంతో కూడు కున్న రచనల్లో ఆత్మాశ్రయత్వం బలీయంగా వుంది ఎప్పుడో ఒంటరితనంలో చిక్కు కున్న కవి కలం -

> 'ఒంటరితనం కురుస్తున్నది నామీద
> అడుగుకదిలితే బురద బురదగా చీకటి
> ఇంతకాలం ఏ గుహలో గుడ్లు పెట్టిందో
> ఇప్పుడు నా నెత్తిలో పిల్లల్ని పెడుతున్నవి
> ఉబుసుపోని ఒంటరితనం
> ఒంటిమీద కురిసింది చాలక"32

అంటూ ఆత్మాశ్రయత్వంలో ముంచబడి పుటలపై నల్లని అక్షరాల్ని జాల్వార్చింది. మనిషిని అమితంగా బంధించేవి ప్రణయం భక్తి మొదలైన అంశాలే అయినా ఒక్కోసారి ఒంటరితనం అమితంగా వేధిస్తుంది. అటువంటి వేదనకు గురైన కవి మనసునుంచి ఒంటరితనంలోని వేదన ఇక్కడ కవిత్వ రూపం దాల్చింది. ఎంతో కాలంగా గుహలకి పరిమితమైన ఒంటరితనం చీకటి ఉన్నట్లుంది. ఒక్కసారిగా కవిపైకివచ్చి కురియగా ఉబుసుపోని ఒంటరితనాన్ని అనుభవిస్తూన్న కవి ఆ అనుభవాన్ని ఆత్మాశ్రయధోరణిలో ఇక్కడ ప్రస్తావించాడు.

ఇలా మరికొన్ని సందర్భాల్లో కూడా నారాయణరెడ్డి అనుభూతిపరమైన కవిత్వంలో ఆత్మాశ్రయత్వమే చోటుచేసుకుంది. స్వేచ్ఛావర్తనమైన హృదయం గలవాడై సముద్రం ఒడ్డున విహరిస్తున్న కవికి సముద్రం ఒడ్డుతో ఆడుకోవాలని పించింది. నిర్మలంగా ఎగిసి వచ్చే చిన్న సీటి అల సముద్రం ఒడ్డును బాగా తడిచేసి వెళ్ళగానే మనకు ఏదో అక్కడ వ్రాయాలనిపిస్తుంది. సామాన్యంగా మన పేరు కానీ. మనకు ప్రియమైనవారి పేర్లనుకానీ అక్కడ వ్రాయాలనుకుంటాం. ఇదేచిత్తవృత్తితో నారాయణరెడ్డి -

> "సముద్రం అంచున
> సంతకంచేస్తున్నాను

చెరిపేస్తున్నాయి తెల్లగుర్రాలు
నురగల డెక్కలతో"33

అనటం అందంగా వుంది.

ఇలాంటి అనుభూతి తత్వంలోకి మునిగిపోతూనే నారాయణరెడ్డి కిటికీపై ఒక కవిత వ్రాశాడు ఇందులో కటికీ కి, తనూ తన రచనకూ వున్న సంబంధాన్ని ప్రకటిస్తూ -

'ప్రభవించే రచనకు
ప్రసవం హక్కు కిటికీ దే
ప్రసవించిన ఆ శిశువుపై
ప్రచురణ హక్కు ఉభయులదే.
ఏదైనా ఏమైనా
గది చెరలో ఉన్నానపు
విచ్చుకున్న కిటికీ
విశ్వాత్మకు పరిచయం చీటీ'34

అన్నాడు. కిటికీలోంచి బయటకు చూస్తే సువిశాల ప్రపంచం కనిపిస్తుంది. ఈ విషయాన్ని అంతర్ముఖుడై మథించిన నారాయణరెడ్డి తాత్విక దృక్పథాన్ని ఇక్కడ హృదయసంబంధంగా ప్రకటిస్తున్నాడు. మామూలు కిటికీ కాకుండా ఆత్మ గతమైన కిటికీ తెరిస్తే విశ్వాత్మ పరిచయం కలుగుతుంది అనే విషయాన్ని పారమార్థిక చింతనతో నారాయణరెడ్డి ఆత్మాశ్రయంగా సూచించాడు.

అనుభూతి మాధుర్యాన్ని చవిచూసిన కవి హృదయం నుండి వెలువడే ఇలాంటి రచనల్లోనూ, ప్రేమ భావాన్ని ప్రకటించే సందర్భంలోని, ప్రకృతి పుల కింత తీవ్రతల్ని వేలెత్తి చూపే సన్నివేశాల్లోనూ నారాయణరెడ్డి కవిత ఆత్మాశ్ర యంగా వెలువడింది. మిగిలిన సందర్భాల్లో అభ్యుదయదృక్పథాన్ని చాటి చెప్పే దిగా వుంది ఈయన కవిత్వం వస్తు ప్రాధాన్యాన్ని కలిగి పరాశ్రయ కవితగా జాల్వారింది.

శేషేంద్రశర్మ : 'కవిసేన' ఉద్యమంతో నవ్య కవిత్వ మహోద్యమాన్ని మహో న్నతికి చేర్చడానికి ప్రయత్నిస్తున్న కవి శేషేంద్ర. ఇతర అభ్యుదయ కవుల్లాగే

శేషేంద్ర కవిత్వంలో ప్రకృతి, ప్రణయం వంటి విషయాల్ని ప్రకటించేటప్పుడు ఆత్మాశ్రియత్వం కవిత్వం నిండారింది.

'గొరిల్లా' 'నాదేశం నా ప్రజలు'. 'మండేసూర్యుడు' మొదలైనవి అభ్యుదయ దృక్పథంతో వెలువడిన శేషేంద్ర రచనలు. 'శేషజ్యోత్స్న' 'సీరైపారిపోయింది' 'సముద్రం నాపేరు' 'ప్రేమలేఖలు' వంటి రచనలు కాల్పనిక కవితా ధోరణిలో వెలికులికిన రచనలు. కాల్పనిక కవితా ధోరణిలో వెలువడ్డ ఈయన రచనలు ఆత్మాశ్రయరీతిలో నడిచాయి. 'కవిత్వం ఊహ కాదనీ, కవిత్వం అనుభూతి' అని35 దృఢంగా విశ్వసించే శేషేంద్ర రచనలు ఆత్మాశ్రయంగా కొనసాగాయి. అనుభూతి వున్నచోట ఆత్మాశ్రయం బలీయంగా వుంటుంది కాబట్టి ఈయన రచనల్లో ఆ స్థితే వ్యక్తమౌతూంది.

కవిత్వంలో వస్త్వాశ్రయ, ఆత్మాశ్రయ విభాగం అశాస్త్రీయమైంది అని పేర్కొన్న శేషేంద్రరచనలు దాదాపు సగభాగం అనుభూతి తత్వంతో కూడుకున్న ఆత్మాశ్రయ ధోరణిలోనే కొనసాగాయి 'క్రియనూఊహనూ ఐక్యం చేయడమే జీవన ధర్మంగా ఊపిరి పీల్చే కవి'36 శేషేంద్రశర్మ కావటంచేత ఈయన అనుభూతి అంతా వాస్తవం నుంచి సంతరించుకోబడ్డదే. ఊహాధిక్యం కంటే జీవిత అనుభవంలోని అనుభూతికే శేషేంద్ర ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చే కవిగా కనిపిస్తారు.

ఒకనాడు ఎంతో ఉత్సాహంగా, ఎంతో ఆనందంగా తన ప్రేయసితో కలిపి సుఖ సంతోషాల్ని మూటగట్టుకొన్న శేషేంద్ర ఆమె లేని స్థితికి కృంగిపోతూ ఆమె అనుభూతుల్లోకి, స్మృతిలోనే కూరకుపోయి -

> 'స్మృతులు మధ్య ఇంకా తిరుగుతున్న దైనిక స్వరూపాల్లో
> నిన్నుచూశాను నా మార్గాల్లో నీవు విడిపోయిన అడుగులునా
> క్షణాలకు బంగారపు మంటలు అంటిస్తున్నాయి.
>
> నీవు ఉన్నప్పుడు వాలేదానివి నా గుండెమీద
> ఒక దండలా
> నీవు ఇప్పుడు లేవు
> కానీ వాలుతున్నావు ఒక కొండలా'37

అంటూ గతించిన వైభవాన్ని గుర్తుకుతెచ్చుకుంటూ ప్రేయసిలేని ఎడబాటు తీవ్ర తను ఆత్మాశ్రయ ధోరణిలో వ్యక్తంచేశాడు. ఆమె లేకపోవటం ఆయన క్షణాలు మండుతున్నాయి ఆ మంటలు అందమైన మంటలు. ఆమె ఉంటే సుకుమారంగా ప్రాలేదు పుష్పాలతో అల్లిన ఒక దండలా. కానీ ఆమె ఇప్పుడు లేదు. ఆమె లేకపోవటంతో గుండె భారమైంది దుఃఖంతో. అందుకే అంటున్నాడు భారంగా ఒక కొండలా వాలుతున్నావని

ఎంతో సంతోషాన్ని పంచివ తన ప్రేయసి పెదవులతో, తన పాదాల్ని అంకితంచేస్తూ వెళ్ళిపోగా బాధాగ్రథిత హృదయంతో బాధపడుతున్న శేషేంద్రకి ఆమె శార్వరీ సుందరిగా సాక్షాత్కరించింది. అందుకే బావకవుల్లాగే దుఃఖభారంతో ఆత్మ ప్రకటనా భావంతో నిన్ను శార్వరిని ప్రేమించినట్లు ప్రేమిస్తానంటూ ఆత్మాశ్రియత్వాన్ని తన కవిత్వంలో పొందుపరచాడు. కవి 'నిదురలోయల్లోకి జారిపోతూ తన చుట్టూ అలముకున్న దట్టమైన చీకటిలో తన ప్రేయసిని అపురూప సౌందర్యం వెదజల్లేశార్వరిలా భావిస్తూ -

'ఓ విషాదంతో నిండిన పాత్రా! నిన్ను
చీఁకటితో నిండిన శార్వరిలా ప్రేమిస్తాను
జీవన సమరంలో అలసివచ్చి
తారల వెలుతురు కలిపిన నీ తిమిరంలో
స్నానం చేస్తాను' 38

అంటూ తాను తన ప్రేయసితో కలిపి తిరిగిన రోజుల్లో ఆమె సమర్పించిన మధుర క్షణాల దండల్ని ప్రోగుచేసుకొని మరీ అభూతి పారవశ్యంలోకి జారిపోవడానికి ప్రయత్నం చేశాడు ఒక స్వప్నంలా ఒక స్వర్గంలా.

కవి కర్మ కావ్యరచన. అందుకు ఆలవాలమైనవి అందమైన, మనోజ్ఞమైన భావాలు. కవి హృదయం చుట్టూవున్న ప్రకృతిని చూస్తే పులకిస్తుంది. ఆపులకింపు నుంచి ఎన్నో ప్రకంపనలు హృదయంలో రేకెత్తి ఊహామరుత్తులు తొడుక్కొని స్వేచ్ఛగా విహరిస్తూంటాయి. కవి అలా విహరించే మనోహరమైన భావాలను అక్షరాల్లో బిగించి లోకంపైకి వదులుతుంటాడు. కవి భావనా లోకంలోకి అలాంటి అందమైన భావాలు ఎందుకొస్తున్నాయో అనుమానం కొద్దీ శేషేంద్ర అంతర్ముఖుడై -

'ఎందుకువస్తున్నాయి ఈ అందమైన భావాలు
నిశ్శబ్ద బంధురమైన నా మందిరంలోకి -
ఈ అందాల అతిథులకు ఏ ఆతిథ్యం ఇవ్వగలను?
వెన్నెల బాటలు విడిచి వచ్చిన
అప్సరసల గుంపుల్లా వస్తున్నాయి
ద్వారాల్లేని ద్వార బంధాల్లేని ఈ మందిరంలోకి'39

అంటూ తనను తానే ప్రశ్నించుకొంటున్నాడు. ఇక్కడ కవి అంతర్ముఖుడై ఆత్మాశ్రయ పద్ధతిలో తనలోకి వచ్చే భావాలు ఏకారణంగా వస్తున్నాయో ప్రశ్నించుకొని సమాధానం దొరక్క వాటిని తనేం చేయాలో తెలుసుకాబట్టి -

'నీలాకాశంలో తెలిమబ్బులై పొండి
సాగరాల్లో నావల తెరచాపలై పొండి
దూర తీరాలకు తరలిపోయే పవనాలై పొండి
రేపటి గులాబీ తోటల్లో
ఉషస్సులై పొండి'40

అని శాసిస్తున్నాడు. భావాల్ని తనకు నచ్చే విధంగా ఆవిష్కరించే హక్కు కవికుంది. అందుకే ఇక్కడ పుంఖానుపుంఖాలుగా వచ్చే భావాల్ని ఈ లోక సౌందర్యానికి ప్రతీకలై పొండని ఆదేశించాడు. ఇక్కడ కవి అంతర్ముఖుడై ఆలోచించే తీరు, అందమైన భావుకత వ్యక్తం చేయబడి ఆత్మాశ్రయతనే ప్రతిబింబిస్తూ వుంది శేషేంద్రకవిత.

శేషేంద్రకవిత్వంలో ఇలాంటి అనుభూతి తత్వంతో పేరుక పోయిన పాల మీగడల్లాంటి భావాలు ఎన్నో చోటుచేసుకొని ఆత్మాశ్రయత్వాన్ని ప్రకటించేవిగా వున్నాయి.

ఇంతవరకు శ్రీశ్రీ, మొదలు శేషేంద్రశర్మ వరకు వున్న అభ్యుదయ కవుల కవిత్వంలో కాల్పనిక కవితా సంప్రదాయంతోనూ, భావకవితా ప్రభావంతోనూ గూడుగట్టుకొన్న ఆత్మాశ్రయ కవిత్వాన్ని గూర్చి వివరించటం జరిగింది. ఇందులో శ్రీశ్రీ, తిలక్, సోమసుందర్, ఆరుద్ర, దాశరథి, నారాయణరెడ్డి, కుందుర్తి, శేషేంద్రల కవిత్వాలు మాత్రమే ప్రస్తావింపబడ్డాయి. నారాయణబాబు

శిష్ట్లా, పురిపండా. సరాభి, భావకవిత్వంపై తిరుగుబాటు తనంతో అభ్యుదయ కవిత్వానికి ప్రారంభ వాక్యాలు పలికారు. వీరి రచనల్లో కాల్పనిక కవితా సంప్రదాయం కానీ. భావకవిత్వ పరిమళాలు కాని ప్రసరించలేదు. కేవలం భావకవిత్వంపై ప్రయోగ వాద దృష్టితో ప్రయోగ వాదులుగా మాత్రమే ప్రసిద్ధి పొందారు. అందువల్ల వీరి రచనల్ని పరిశీలించటం జరగలేదు. శ్రీశ్రీ అభ్యుదయ కవిత్వానికి నారాయణబాబు మొదలైన వారిలాగా ప్రారంభకుడైనప్పటికీ తొలి దశలో కాల్పనిక కవితా సంప్రదాయంతోనూ, భావకవితా ప్రభావంతోనూ రచనలు చెయ్యటం వల్ల ఆయన కవిత్వాన్ని కొంత వింగడించి చూపాల్సిన అవసరం వచ్చింది. అభ్యుదయ కవులుగా ప్రసిద్ధి పొందిన మిగిలిన వారి కవితా వ్యక్తిత్వం కొంత భావ కవితా ధోరణుల్ని, అధికంగా అభ్యుదయ కవితా దృక్పథాన్ని కలిగివుండటంచేత సోమసుందర్ మొదలుకొని శేషేంద్రశర్మ వరకు వున్న అభ్యుదయకవుల్ని పరిశీలించాను.

బైరాగి. దిగంబర కవులు, విప్లవ కవులు కేవలం అభ్యుదయ దృక్పథంతోను, విప్లవ భావాలతోనూ వస్త్వాశ్రియంగా రచనలు చేసిన వారవటం చేత వారి కవిత్వంలో ఆత్మాశ్రయత్వం చోటు చేసుకోలేదు.

రాబోయే ప్రకరణంలో ఆత్మాశ్రయత్వం వల్ల కలిగిన ఫలితాలను. ప్రయోజనాలను. వాటితోపాటు వాటిల్లిన నష్టాలను (అనర్థాలను) చర్చించే ప్రయత్నం చేస్తాను. కవిత్వంలో ఆత్మాశ్రియత్వ స్వరూప స్వభావాల్ని గూర్చి ప్రాచీన కవిత్వంలోనుంచి నేటి కవిత్వంలో వరకూ చర్చించటం జరిగిన తర్వాత ఆ చర్చించిన ఆత్మాశ్రియత్వం వల్ల కవిత్వానికి. లేక వ్యక్తులకూ లేక సమాజానికి సమకూరిన ప్రయోజనాలను వాటిల్లిన అనర్థాలను గూర్చిన చర్చ అవసరం కాబట్టి తరువాతి ప్రకరణంలో ఆ విషయ ప్రస్తావన చేస్తాను.

.... .... ....

# ఉదాహృత సూచికలు


1. శేషేంద్రశర్మ గుంటూరు. కవిసేన మేనిఫెస్టో. పు 147.
2. రమణారెడ్డి, కె.వి. శ్రీశ్రీ. వినిపించిన భువనఘోష. ఆంధ్రపత్రిక (దిన) 31 మే. 1982. పు. 4.
3. శ్రీశ్రీ స్వేచ్ఛ. ప్రభవ. పు. 12.
4. " " " పు. 12.
5. శ్రీశ్రీ. మేఘ శకలము. ప్రభవ. పు. 13.
6. శ్రీశ్రీ. వియోగశాంతి. ప్రభవ. పు. 32.
7. శ్రీశ్రీ. జవాబు రాని ప్రశ్న. సృజన. నవంబరు, 1966.
8. " " " నవంబరు, 1966.
9. ఆంజనేయులు, కుందుర్తి. అమృతం కురిసినరాత్రి (పీఠిక) పు. 5.
10. తిలక్ దేవరకొండ బాలగంగాధర. స్వేచ్ఛావిహారం. అమృతం కురిసిన రాత్రి, పు. 127. 128.
11. తిలక్, దేవరకొండ బాలగంగాధర. నువ్వులేవు నీ పాట వుంది. అమృతం కురిసిన రాత్రి. పు. 129.
12. తిలక్, దేవరకొండ బాలగంగాధర. శార్వరీప్రియ, భారతి, ఆక్టోబరు, 1962, పు. 1.
13. తిలక్, దేవరకొండ బాలగంగాధర, విధిప్రసక్తి, ప్రభాతము సంధ్య. పు. 50.
14. తిలక్, దేవరకొండ బాలగంగాధర, దీక్ష, భారతి. డిశెంబరు, 1946. పు. 505.
15. తిలక్, దేవరకొండ బాలగంగాధర, గోరువంకలు (కవితాసంకలనం) వ్రాతప్రతి.
16. తిలక్. దేవరకొండ బాలగంగాధర, ఆహుతి, ప్రభాతము సంధ్య. పు. 11
17. తిలక్, దేవరకొండ బాలగంగాధర. నెహ్రూ. అమృతం కురిసినరాత్రి. పు. 56.
18. సోమసుందర్, ఆవంత్స. మృత్యుంజయ స్మృత్యంజలి, వెన్నెలలోకోన సీమ. పు. 31.

19. సోమసుందర్, ఆవంత్స. మృత్యుంజయ, స్మృత్యంజలి. వెన్నెలలో కోనసీమ, పు. 31.

20. సోమసుందర్ ఆవంత్స. ఎర్రని స్వప్నం. అభ్యుదయ, జనవరి. 1978, పు. 7, 8.

21. ఆంజనేయులు, కుందుర్తి, వెలుగులోనికి వెడుతున్నాను. యుగేయుగే. కుందుర్తి కృతులు, పు. 275.

22. ఆంజనేయులు, కుందుర్తి, నాగార్జునసాగరానికి నా యాత్ర. నగరంలో వాన. కుందుర్తి కృతులు. పు. 418, 419.

23. ఆంజనేయులు కుందుర్తి. నగరంలో వాన, కుందుర్తి కృతులు, పు.387.

24. ఆరుద్ర, ఒకటో ప్రేమగీతం. గాయాలు-గేయాలు, పు. 23.

25. ఆరుద్ర. ఎడబాటు. గాయాలు-గేయాలు. పు. 54.

26. దాశరథి, వాసంతిక. అగ్నిధార, దాశరథి కవిత. పు. 32.

27. దాశరథి, శాంతి, కవితా పుష్పకం. దాశరథి కవిత. పు. 339.

28 దాశరథి, స్వామిపూజ. రుద్రవీణ. దాశరథి కవిత. పు. 121.

29. నారాయణరెడ్డి, సి. ప్రకృతిలోని ప్రణయిని. నారాయణరెడ్డి గేయాలు. పు. 13.

30. నారాయణరెడ్డి, సి. వింతవిరహిణి. నారాయణరెడ్డి గేయాలు. పు. 27.

31. నారాయణరెడ్డి, సి. మాధవహేల. నారాయణరెడ్డిగేయాలు, పు. 19.

32. నారాయణరెడ్డి, సి. మతిశ్రేని ఒంటరితనం, మృత్యువు నుంచి. పు. 29

33. నారాయణరెడ్డి, సి. సముద్రం అంచున సంతకం మృత్యువు నుంచి. పు. 33.

34. నారాయణరెడ్డి, సి. కిటికీ జయంతి, భారతి, మే. 1982. పు. 3.

35. శేషేంద్రశర్మ, గుంటూరు. ప్రేమలేఖలు, ఉపోద్ఘాతం, పు. 9.

36. ,, ,, ,, పు. 13.

37. ,, ,, పు. 46.

38. ,, నిదురలోయల్లో, శేషజ్యోత్స్న. పు. 52

39. ,, అందాల అతిథులు, శేషజ్యోత్స్న. పు. 55.

40. ,, ,, పు. 55.

# 7. ఆత్మాశ్రయత్వం - ఫలితాలు, ప్రయోజనాలు

ఆధునికాంధ్ర కవిత్వంలో చోటుచేసుకున్న ఆత్మాశ్రయ కవితా రీతుల్ని వివరించటం జరిగింది. భావ కవిత్వంలో వివిధ అంశాల్లో ప్రతిబింబించే ఆత్మాశ్రయత్వాన్ని గురించీ, అభ్యుదయ కవుల్లో కాల్పనిక కవితా సంప్రదాయ ప్రభావంతో నిండివున్న ఆత్మాశ్రయత్వాన్ని గురించీ ముందటి ప్రకరణాల్లో చర్చించటం జరిగింది.

ఈ అధ్యాయంలో ప్రాచీనకాలం నుంచీ వస్తుగతంగా సాగిన రచనలపై ప్రయోగవాదంగా ఆత్మాశ్రయత్వం రూపుదాల్చటం వల్ల కలిగిన ఫలితాలను, ప్రయోజనాలను గురించి చర్చిస్తాను. ఏ ప్రయోగమైనా ఫలితాలతోపాటు, ప్రయోజనాలు, (అనర్థాలు) నష్టాలు కలిగివుంటుంది. కాబట్టి కేవలం ఆత్మాశ్రయత్వం ఆధునిక కవిత్వానికి చేకూర్చిన ప్రయోజనాల్నే కాక నష్టాల్ని (అనర్థాల్ని) గురించి కూడా నిష్పక్షపాత దృష్టితో పరిశీలించాల్సిన అవసరం పరిశోధనలలో ముఖ్యం గనుక ఈ అధ్యాయాన్ని ఉద్దిష్టం చేస్తున్నాను.

ఆధునిక కవిత్వంలో ఆత్మాశ్రయత్వం చోటుచేసుకోవటం వల్ల చాలా మార్పులు వచ్చాయి. వాటినన్నింటినీ ఈ క్రింది అంశాలుగా వింగడించి పరిశీలిద్దాం.

**చేకూరిన ప్రయోజనాలు :** ఆధునికాంధ్ర కవిత్వంలో ముందు నుంచీ వస్తున్న కవితా సంప్రదాయాలమీద ప్రయోగాలు చేయటంవల్లా, పాశ్చాత్య కవితా సంప్రదాయం ఆధునిక కవుల్ని ప్రభావితుల్ని చేయటంవల్ల తెలుగు కవిత్వం కొత్త అందాల్ని సంతరించుకుంది. తద్వారా కవిత్వానికి చాలా ప్రయోజనాలు చేకూరాయి. అవి కేవలం కవిత్వ వికాసానికేకాక కవుల విశాల దృక్పథాన్ని, విస్తృత పరిధిని సూచించేవిగా వున్నాయి. తొలుత వాటిని పరిశీలించి తరువాత వాటిల్లిన నష్టాలను గురించి చూద్దాం.

**విశాల దృక్పథం :** కవి ఆత్మాశ్రయ ధోరణిలో అంతర్ముఖుడై తనను తాను మథించుకోవడం వల్ల కవికి వ్యక్తిగత స్వేచ్ఛ లభించింది. కేవల పురాణ ఇతివృత్తాల్లో, రాజుల చరిత్రలో గాక కవికి నచ్చిన ప్రతి చిన్న విషయాన్ని ఇతివృత్తంగా స్వీకరించాడు. దీంతో కవికి విశాల దృక్పథం ఏర్పడి అది కవిత్వం

లోనూ ప్రదర్శింపబడింది గడ్డిపరక మొదలుకొని హిమవత్పర్వతం వరకూవున్న అంశాల్ని భావించి కవి తన భావనా మాధుర్యాన్ని కవిత్వంలో రంగరించాడు. పరమాత్మ చింతనలో భక్త్యావేశ పూరితుడూ అయ్యాడు. దీనివల్ల తెలుగు కవిత్వంలో ఆధునిక కాలంలో ప్రక్రియా బాహుళ్యం ఏర్పడింది.

ప్రకృతి, ప్రణయం, భక్తి, దేశభక్తి, స్మృతి, సంఘసంస్కరణ మొదలైనవి ప్రక్రియారూపంలో కవిత్వంగా రూపునంతరించుకొన్నాయి. ఇన్నింటి విషయాల్లో కవిస్వానుభవాన్ని ప్రకటించడంవల్ల కవి మనో ప్రపంచతో ప్రతిబింబించే అంశాల్ని, తద్వారా కవి సృజనాత్మకతని, అతని వ్యక్తిత్వాన్ని అంచనా వేయడానికి వీలైంది. పూర్వకవుల కంటే ఎక్కువ స్వేచ్ఛని ప్రదర్శించిన ఆధునిక కవి విశాల దృక్పథం ఉపగతమైంది.

కవి హృదయంలో అంతకు మునుపు బలీయంగా పొదులుదన్నుకొన్న సంకుచితత్వం పోయి వస్తు విషయంతోపాటు ఛందోవిషయంలోనూ నూతన ప్రయోగాలు చేయటంవల్ల కొత్త కవితా రీతుల ఆవిర్భావం జరిగింది. ఛందోబద్ధమైన వృత్తాలకి బదులు, మాత్రాఛందస్సు, వచన కవిత్వ వాహికగా రూపొందింది.

గేయ ప్రాధాన్యం : ఆత్మాశ్రయ ధోరణిని పుణికి పుచ్చుకొన్న భావకవి .

'గుండె గొంతుక లోన కొట్లాడుతాదీ
కూకొండనీదురా కూసింత సేపు!'[1]

అని అనటంవల్ల కవి హృదయంలోని భావ తీవ్రతని పురస్కరించుకొని నూతన మార్గాల్ని అన్వేషిస్తూ కవిత్వం బహిర్గతమైంది. దానివల్ల ఒక తూగు, ఒక ఊపు, ఒక విసురును సంతరించుకొని లయాన్వితంగా గేయ ప్రాధాన్యంతో కవిత వెల్లికి ప్రవహించింది.

దాదాపు భావకవిత్వం అంతాగేయ పద్ధతిలోనే కొనసాగింది. కిన్నెరసాని పాటలు, వకుళమాల, యెంకిపాటలు, శశికళ మొదలైన రచనలు ఆయా కవుల వైయక్తిక భావతీవ్రతని ప్రదర్శించేవిగా వుండి గేయకృతులుగా వెలువడ్డాయి. కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి, హృదయేశ్వరి, దీపావళి, ఊహాగానము, వంటి పద్యగేయ మిశ్రమ రచనలు వెలువడ్డాయి.[2]

ఖండకావ్య ప్రక్రియ : భావకవిత్వంలో కవికి ఆత్మే ప్రధానం కావటం వల్ల ఆత్మలో ప్రతిబింబించే అంశాల్నే కవి కవితా బద్ధం చేశాడు. అందులో తన ఆత్మీయతని నింపాడు. తన మనసునే ప్రమాణంగా, తన భావ తీవ్రతనే ఆలంబ నంగా తీసుకొని కవి ఆత్మాశ్రయ పద్ధతిలో రచనలు చేయటంవల్ల కవిత్వంలో సంక్షిప్తత ఏర్పడింది. కవి చెప్పే విషయాలు కవికి నచ్చేవిగా వుండి విపులంగా కాక సూక్ష్మరూపంలో హృదయాకర్షకంగా చెప్పబడ్డాయి. అందువల్ల రచనల నిడివి తగ్గింది. అనవసరమైన పద జాలం, వర్ణనలు, సంఘటనలు వదలి వేయబడి లఘు రచనలు వెలువడ్డాయి. 'అనుభూతి కావ్యవస్తువు కావడంవల్ల కావ్య స్వరూ పంలో కలిగిన ఒక ముఖ్యమైన మార్పు - ఖండకావ్యం రావడం"[3] అన్న వెల్చేరు నారాయణరావు అభిప్రాయం ఈ సందర్భంలో గమనించ దగింది.

తెలుగు కవిత్వంలో ఈ విధమైన మార్పు రావటంవల్ల ఖండకావ్యప్రక్రియ ఆవిర్భవించింది. కవి హృదయానుభూతికి, ప్రేరణ మేరకు చిన్నచిన్న కావ్యాలు వెలువడ్డాయి. ప్రజలు త్వరిత జీవిత విధానానికి అలవాటు పడటంచేత, ఓపిక కొరవడి మహాకావ్య పఠనం తగ్గి ఖండకావ్య ప్రక్రియపై మక్కువని ప్రదర్శిం చారు. దీంతో ఖండకావ్య ప్రక్రియ తెలుగు కవిత్వంలో సుస్థిరంగా నాటుకుంది. అంతేకాక పత్రికలు కూడా కొంతవరకు ఈ ప్రక్రియ సుస్థిరత్వానికి దోహదం చేశాయి. ఏది ఏమైనప్పటికీ ఖండకావ్య ప్రక్రియ వెలువడటానికి ఆత్మాశ్రయత్వం కొంతవరకు దోహదం చేసింది.

వస్తు ప్రాధాన్యం. ఇతివృత్త నిర్వహణం మొదలైన అంశాలకు ఖండ కావ్య ఆవిర్భావంతో స్వస్తిచెప్పబడి మేల్తరమైన కవిత్వం వెలువడటానికి ఆత్మా శ్రయత్వం దోహదం చేసింది. కవికి ఇష్టమైన అభిప్రాయాలని, కవికి నచ్చిన విషయాలని కావ్యగతం చేస్తూ విసుగు జనించని తీరులో కవిత్వం చెప్పే తీరు ప్రబలింది.

వర్ణనల తిరస్కారం : కవి అంతర్ముఖుడై ప్రకృతిలో లీనమై భౌతిక అంశా లకి కాక ఆంతరిక అంశాలకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చి నవ్యకవిత్వాన్ని వెలార్చ డానికుద్యుక్తుడయ్యాడు. దీనివల్ల బాహ్యగతవిషయాలు విస్మరించబడి వర్ణనల తిరస్కారం జరిగింది.

ప్రాచీన కాలం నుంచీ వస్తున్న వర్ణనా బాహుళ్యం భావకవిత్వంలోనూ, తరువాత వ్యాప్తిలోకి వచ్చిన కవిత్వాల్లోనూ, క్రమేపీ తగ్గింది. ప్రబంధాల్లో నాయకా నాయికల ప్రేమోద్దీపనకు అష్టాదశ వర్ణనలు విపులంగా వర్ణింపబడేవి. ప్రబంధాల్లో వాటి ఉనికి ప్రబంధ లక్షణాల్లో ఒక దానిని నిర్వర్తించటం కోసమే జరిగింది.

కాల్పనిక కవితా సంప్రదాయంతో భావకవి భావనా ప్రపంచంలో ప్రకృతి వర్ణనలకు ప్రాధాన్యం ఇవ్వబడటం కాక వాటితో తాదాత్మ్యం పొంది ఆకులో ఆకుగా, పూవులో పూవుగా కవి లీనం కావడానికి ప్రయత్నించాడు. అంతేకాక తన సుఖాన్నీ, దుఃఖాన్నీ ప్రకృతిలో చూసుకొని ప్రకృతితో పాలుపంచుకొన్నాడు. దానివల్ల కవిత్వంలో వర్ణనలు తిరస్కరింపబడ్డాయి. కోకిల కూసినా, పూవు పరిమళాన్ని వెదజల్లినా, సెలయేరు రొద చేసినా, వెన్నెల చల్లదనాన్ని పంచినా అవి ఇతరుల కోసం కాక తనకోసమే నని భావకవి భావించాడు. ప్రకృతిగత అంశాలన్నింటినీ తనవిగా చేసుకొని ఆత్మీయతా ముద్రతో రచనలు చేశాడు. అందువల్ల కవిత్వంలో బాహ్య స్వరూపమైన ప్రకృతికి గాక కవి వ్యక్తిత్వంతో దర్శనమిచ్చే అంతరంగ ప్రకృతికి ప్రాధాన్యం హెచ్చింది.

**అలంకార నిరసనం :** ఆధునిక కవిత్వంలో ఆత్మాశ్రియంవల్ల అనవసర వర్ణనలతోపాటు అలంకార బంధురతకూడా తగ్గిపోయింది. కవిచెప్పే భావాలు సూటిగా హృదయానికి హత్తుకొనేవిగా వుండటంవల్ల ఉపమానాలు, ఉపమావాచకాలు, ఊహాతిశయాలు, ఆధునిక కవిత్వంలో అవశ్యకం అనిపించలేదు.

భావకవిత్వం ఊహా ఉద్దీనంగా వెలువడినప్పటికీ కేవలంఊహా ప్రేయసీ సృష్టికి, దివ్యలోక విహారానికి పరిమితమైంది. ఆలోకాల ప్రసక్తి ప్రాబల్యం వహించలేదు. అర్థాలంకారాలు కానీ శబ్దాలంకారాలు కానీ నవ్య కవిత్వానికి ఊపిరి పొయ్యలేదు కవి హృదయాన్ని ప్రకటించడానికి అవసరమైన ఊహాచిత్రాలు, భావ చిత్రాలు పదచిత్రాలు ఆత్మాశ్రియంవల్ల ఆధునిక కవిత్వంలో అలరారాయి అందువల్ల అలంకార ప్రాముఖ్యంతో రచనలు వెలువడలేదు. దానివల్ల నవ్య కవిత్వానికి ఆత్మాశ్రయకారణంగా అలంకార నిరసనం సమకూరింది.

**సుకుమార పదజాలం :** నవ్యకవుల కవిత్వం ఆత్మాశ్రియంవల్ల వస్తు విషయంలోనూ, భావ విషయంలోనూ క్రొత్త పోకడల్ని సంతరించుకొన్నట్లే శైలి విష

యంలో కూడా కొత్తదనాన్ని సంతరించుకొంది సంస్కృత పదాలు, దీర్ఘసమాసాలు, మారుమూల పదాల, అనవసరపదాలు, నవ్య కవిత్వంలో వచ్చి చేరలేదు. వాటి స్థానే ఆధునిక కవిత్వానికీ. ఆధునిక కవుల భావాలకీ అనుకూలమైన అవసరమైన సాధన సామగ్రితోపాటు సుకుమార పదజాలం ప్రయుక్తమైంది.

నవ్య కవి సుకుమార హృదయంలో రేకెత్తిన భావాలు అతి సుకుమారమైనవీ, ఆత్మ సంబంధమైనవీ. మంజుల మైనవీ సునిశితతత్వాన్ని ప్రదర్శించేవి కావటంవల్ల ఆ భావాల కనుకూలమైన పదాలు నవ్యకవిత్వంలో చోటు చేసుకున్నాయి. ఆ సుకుమార పదజాలంతో నవ్యకవులు సన్నపోగారు పవితనాన్ని ప్రదర్శించారు.

ప్రకృతి గతమైన, ప్రణయ గతమైన అంశాల్ని భావకవి ఆత్మాశ్రయ పద్ధతిలో గానం చేయటంవల్ల ఆ కోవకు చెందిన సుకుమార పదజాలం కావ్యగతమైంది, 'నల్లమబ్బుల నింగి', 'చిరుగాలి కెరటం' 'నునులేత రెక్కలు', 'ముద్దుకోయిల' 'సిరిసిరి' 'ప్రణయ జీవనం' 'ప్రణయ మధురిమ' 'ప్రేమపెన్నిధి' 'వలపు తొందర'4 వంటి పదాలు పదబంధాలు కావ్యగతం చెయ్యబడ్డాయి.

ఈ పదజాలం నవ్యకవి మనోభావాలకి అనుగుణంగా. అనుకూలమైన వాతావరణాన్ని చిత్రించేదిగాను, పఠిత మనసులోకి దూసుకుపోయి కవి పొందిన మాధుర్యాన్నీ, దుఃఖాన్నీ అనుభవింపజేసేదిగానూ వుంటూ ప్రత్యేకతని సంతరించుకుంది,

సౌందర్య కాంక్ష : నవ్యకవులు తాము చెప్పదలచుకున్న అంశాల్ని తమ హృదయపు కొలబద్దలతో కొలిచి చెప్పటంవల్ల వ్యక్తిగతమైన సౌందర్య కాంక్ష నవ్య కవిత్వంలో జాల్వారింది. దాదాపు భావకవులంతా ప్రకృతినీ, ప్రణయాన్నీ సౌందర్యకాంక్షతోనే చవిచూశారు. ఈ లోకంలో వాళ్ళు ఆశించిన సౌందర్యం లభించకపోతే ఊహా విహంగాలు తొడుక్కొని విహాయస పథాల సంచరించి అన్వేషణ సాగించారు. అందువల్ల సౌందర్య కాంక్ష నవ్యకవిత్వంలో కవుల హృదయాలే కొలబద్దగా విస్తృతరూపం దాల్చింది.

ప్రాచీన కవుల్లో ప్రకృతి రామణీయకతని మనోజ్ఞంగా వర్ణించటలో ఈ. సౌందర్య కాంక్ష కనిపిస్తున్నా అది వ్యక్తిగతమైందిగా గాక కొన్ని నియమాలకి

కట్టుబడి పేర్కొన్నదిగా కనిపిస్తుంది. అది విధి నిర్వాహణలో కల్పింపబడింది. అంతేకాక ఆలోచనా సంబంధమైంది. నవ్యకవుల్లో చోటుచేసుకొన్న సౌందర్యా కాంక్ష అలాంటిదికాక వ్యక్తిగతమైంది. స్వప్రయోజనాన్ని ఆశించింది. కళాత్మక హృదయంతో భావకవులు ఆశించిన అపురూప సౌందర్యం ప్రకృతి పరంగానూ, ప్రణయ పరంగానూ ప్రకటింపబడింది. అవి నవ్య కవిత్వానికి నూతన శోభని సమకూర్చింది.

అమలిన శృంగార ప్రీతి : ప్రతి నవ్య కవీ తనదైన ప్రత్యేకతతో తనకు నచ్చిన సౌందర్యాన్ని ఆత్మసందర్శనం ద్వారా దర్శించి పులకించి పోయాడు. హృదయాన్నే ప్రమాణంగా గ్రహించి కవిత్వం వ్రాయటం వల్ల ప్రేయసీ ప్రియుల మధ్య హృదయసాన్నిహిత్యాన్నే కోరుకొన్నారు. అందువల్ల ప్రణయ కవిత్వంలో శరీర సంబంధమైన కాంక్ష కాక అమలిన శృంగారం పరిపోషింపబడింది.

నవ్యకవిత్వంలో ఆత్మాశ్రియత్వంవల్ల ప్రాచీన కవిత్వంలోని అసభ్యకరమైన అంగాంగ వర్ణనా బాహుళ్యంకాక నూతన కాంతుల్ని సంతరించుకొన్న స్త్రీ పురుషుల ప్రేమభావం, త్యాగ గుణం మొదలైన అంశాలు కావ్యగతం చేయబడ్డాయి. పాఠకునిలో శృంగార పరంగా ఉదాత్తతని రేకెత్తించడానికి అమలిన శృంగార ప్రతిపాదన దోహదం చేసింది. కామపాశంలో చిక్కుకొని కన్నూ మిన్నూ కానని యువక హృదయాలను ఉదాత్తత్వంకొంత అదుపులోకి తెచ్చే ప్రయత్నం చేసింది.

కేవలం ఆత్మాశ్రియత్వంతో భావకవులు ప్రదర్శించిన అమలిన శృంగారం అంచులు దేలి ప్రవహించి నిర్మలమైన సరస్సైనిలిచి మాలిన్యం లేని మమత నొలికించే కేదారాలెన్నింటినో ప్రసవించింది.

బాధావగతం : భావకవి ఆత్మాశ్రియత్వం కవిత్వంలో అలవడటంతో తనలోకి తాను తొంగి చూడటమే కాక తనలాంటి ప్రకృతిని, మానవ ప్రవృత్తుల్ని చూడటం నేర్చుకొన్నాడు. విశాల దృక్పథంతో సృష్టి క్రమాన్ని, భగవంతుని లీలల్ని అర్థం చేసుకోవటం వల్ల ఇతరుల సుఖదుఃఖాలు తనవిగా భావించుకొన్నాడు.

పూబాల తన సౌందర్యాన్ని వీడినా, నింగిలోని చందమామ మబ్బు మాటున దాగినా, సెలయేటి పాట ఆగినా, కోయిల గానం తీయకపోయినా కవి

వాటిలో భాధని చూసి తనదిగా భావించాడు. అంతేకాదు అందుకు విలపించాడు కూడా, కేవలం ప్రకృతి విషయంలోనేకాక మానవుల విషయంలో కూడా ఈ భావాన్నే ప్రదర్శించాడు. ఇదే తరువాతి కాలంలో సాంఘిక దృష్టి ఏర్పడ్డానికి దోహదం చేసిందేమో

కవికి ఆత్మాశ్రయత్వం వల్ల తన బాధంటే ఏమిటో తెలుసుకోవటంతో పాటు ఇతరుల బాధలకి కూడా చలించిపోయే మనస్తత్వాన్ని అలవరుచుకొన్నాడు అంతేకాక సంఘం కేసి ఒక సారి దృష్టి సారించగా తనేకాక ప్రపంచం అంతా బాధామయంగా వున్నట్లనిపించింది. ఇదికొంత వ్యక్తి మనోవికాసానికి, మానసిక పరిణామానికి దోహదం చేసి అభ్యుదయ దృక్పథాన్ని కలిగించింది

భక్తి భావ ఉన్ముఖం : కాల్పనిక కవితా ప్రభావానికి లోనై ప్రకృతి ప్రియత్వాన్ని, ప్రణయతత్వాన్ని, సౌందర్య కాంక్షని. ప్రేయసీ పూజ్యతని, అమలిన శృంగారతత్వాన్ని, విశాల దృక్పథాన్ని అలవరుచుకొన్న నవ్యకవి వాటికోసం ఆరాటపడి అవిలభించకపోవటంతో ఒక దారీతెన్నూ కానని స్థితిలో భగవంతుని వైపు మొగ్గుచూపాడు. జీవితమంటే లౌకిక విషయాలకు ప్రాధాన్యం ఇవ్వడం కాదు పరమాత్మతో ఐక్యం అవడానికి చేయవలసిన ప్రయత్నమేమని తెలుసుకోగలిగాడు.

అటువంటి స్థితిలో ఆత్మార్పణా తత్వంలోనూ, ఆరాధనా తత్వంలోనూ నవ్యకవి భక్తి భావ ఉన్ముఖుడయ్యాడు. ఈ తత్వం మానవ మానసిక పరిపక్వతని సూచిస్తుంది. భారతీయ తాత్విక దృక్పథమూ ఈ అంశాన్నే ప్రతిపాదిస్తూంది కవి ఆత్మాశ్రియుడై కవితల్లటం నిరాశా నిస్పృహలకు లోనైన కవి ఆ స్థితినుంచి బయట పడడానికి భక్తి భావాన్ని అలవర్చుకొన్నాడు. భగవంతుని సన్నిధిలో తన హృదయాన్ని అందులోని దావానలాన్ని బయటపెట్టి ఆబాధనుంచి తన్ను రక్షించి ముక్తిని ప్రసాదించమని వేడుకొంటూ ముక్తి మార్గ అన్వేషణలో జీవితం సాగించాడు.

ఇలా ఆధునికాంధ్ర కవిత్వంలో ఆత్మాశ్రయత్వం బహుముఖంగా విస్తరిల్లటం వల్ల మానవుల మానసిక ప్రవృత్తుల్లోనేగాక కవిత్వ విషయంలోనూ అనేక మార్పులు వచ్చి వ్యక్తి వికాసంతోపాటు కవితా వికాసమూ జరిగింది.

ఇక నవ్య కవిత్వంలో ఆత్మాశ్రియత్వం వల్ల వచ్చిన నష్టాలను గూర్చి ప్రస్తావిస్తాను.

వాటిల్లిన నష్టాలు (అనర్థాలు) : ఆధునిక కవిత్వంలో ఆత్మాశ్రయత్వం వ్యక్తిత్వాన్ని అనుసరించి వచ్చి నందువల్ల కొన్ని దుష్ఫలితాలు కూడా సంభవించాయి. కేవలం పైన పేర్కొన్న ఫలితాలు ప్రయోజనాలే కాక సమాజానికి. వ్యక్తివికాసానికి ఆటంకాలైన అంశాలు కొలదిగా మాత్రమే కవిత్వంలో ఆత్మాశ్రయత్వం వల్ల వాటిల్లాయని చెప్పవచ్చు.

అలవడిన అస్పష్టత : ఆత్మాశ్రయత్వం వల్ల కవిత్వంలో సమిష్టివాదం కాక వ్యక్తివాదం అందరికీ బలపడింది. అందువల్ల కవికి ప్రామాణికమైన విషయాలు అందరికీ ప్రామాణికాలుగా భాసించలేదు. అంతే కాక కవిత్వంలో ఒక అయోమయస్థితి, అర్థంకానితత్వం, వ్యక్తివాదంవల్లే సంభవించింది. కవే నిరంకుశత్వంలో తన భావాల్ని తన ప్రమాణాల్ని, తన వ్యక్తిత్వ విలువల్ని కవిత్వంలో ప్రదర్శించటం వల్ల ఇలాంటి స్థితి ఏర్పడింది. దీనివల్ల నవ్య కవిత్వంతో పాటు తన కవులు విమర్శకి గురి అయ్యారు.

కావ్య వస్తువుకు కవి భావానికి ఉన్న సంబంధాన్ని సున్నితంగా వ్యక్తం కావాడానికి వదిలేసి దాన్నిస్పష్టంగా అవును కాదు అని చెప్పకుండా వుండడం భావ కవిత్వ పద్ధతి. కొన్ని భావాల్ని అలా ఊహకి వదిలెయ్యాలి. మాటల్లోకి తెస్తేచాలు అవి దెబ్బ తింటాయి అనేది భావ కవిత్వం తరహా కావటంతో అస్పష్టత, అయోమయస్థితి, అర్థంగాని తత్వం నవ్యకవిత్వంలో చోటు చేసుకొంది. ఈ అస్పష్టతే భావకవిత్వం క్షీణోన్ముఖం కావడానికి దోహదం చేసింది.

కొరవడిన సామాజిక స్పృహ : కవిత్వంలో ఆత్మాశ్రయత్వం వల్ల కేవలం వ్యక్తి వాదమే చోటుచేసుకోవడం వల్ల సామాజిక దృక్పథం కుంటు పడింది. ఎంత చూసినా కవివ్యక్తిగతమైన ప్రణయాన్నో, ప్రకృతి ప్రీతినో, భక్తిభావాన్నో చిత్రించడమే ప్రధానంగా నవ్యకవిత్వం వెలువడింది. అసలు నవ్యకవిత్వం అంటే ప్రణయ కవిత్వమే అన్నంతగా పేరుబడింది. దీనివల్ల వ్యక్తి వాదమూ, కళకళకోసమే అనేతత్వమూ సాహిత్యంలో ఏర్పడింది కళ ప్రయోజనాన్ని ఆశించేదిగా వుండాలన్న వాదం వెనక బడింది.

పరిశీలకుల పరిశోధకుల దృష్టిలో ఆత్మాశ్రయత్వం సాంఘిక ప్రయోజనాన్ని ఆసించేదికాదు అందువల్ల ఆత్మాశ్రయమైన నవ్య కవిత్వం ప్రజలకు పూర్తిగా దూరమై పోయిందని అనిపించుకొంది. అంతేకాక ఆధునిక సమాజాన్ని ఇది ప్రతిబింబించేదిగా కాకుండా ఆధునిక సమాజంలో ఏ వ్యక్తికో సంబంధించిన కొన్ని అంశాల్ని మాత్రమే ప్రతిబింబించేదిగా కొనసాగింది. సాహిత్యం సమాజానికి అద్దంలాంటిది. అది సంఘాన్ని ప్రతిబింబించాలి. నవ్య కవిత్వం అలాకాక సమాజానికి. వాస్తవచిత్రణకి అతి దూరంగా వుండి పోయింది. దాంతో నవ్య కవిత్వంపైన తిరుగుబాటు వచ్చి ఆత్మాశ్రయమైన భావ కవిత్వం క్షీణించింది.

ఇలా ఆత్మాశ్రయం వల్ల నవ్య కవిత్వంలో ఫలితాలు ప్రయోజనాలు చేకూరడంతో పాటు ఒకటి రెండు నష్టాలు కూడా వాటిల్లాయి. ఈ ఆత్మాశ్రయ కవిత్వం కేవలం సామాజిక స్పృహ విషయంలో ఆదరణీయమైంది కాకపోయినా మిగిలిన విషయాల్లో కవిత్వానికి నవ్యగుణాల్ని ప్రసాదించింది. సౌందర్య దృష్టిని, ప్రేమ భావాన్ని పఠితల హృదయాల్లో రేకెత్తింప జేసి సమాజపరమైన బాధల్నుంచి కొంతవరకు విముక్తుల్ని చేసి సంతోషాన్ని నింపింది పఠితల్ని ఆలోచింపజేసింది. ఆలోచనే ఉత్తమమైన పద్ధతుల్లో కొనసాగితే సాంఘిక శ్రేయస్సుకు దోహదం చేసేదిగా ఉపకరిస్తుంది.

## ఉదాహృత సూచికలు


1. సుబ్బారావు, నండూరి. ఎంకిపాటలు. పు. 2.
2. నారాయణరెడ్డి, సి. ఆధునికాంధ్ర కవిత్వం - సంప్రదాయములు - ప్రయోగములు. పు. 471.
3. నారాయణరావు, వెల్చేరు తెలుగులో కవితా విప్లవాల స్వరూపం.పు.128.
4. కృష్ణశాస్త్రి, దేవులపల్లి. కృష్ణపక్షంనుంచి.
5. నారాయణరావు, వెల్చేరు. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం. పు.162.

# ఉపయుక్త గ్రంథాలు

తెలుగు :


అప్పలస్వామి, పురిపండా : సారస్వత వ్యాసములు,
4వ సంపుటం.
ఆంధ్రప్రదేశ్ సాహిత్య, అకాడమీ
కళాభవన్; సైఫాబాద్
హైదరాబాదు-4.
ద్వితీయ ముద్రణ ; 1980.

అమరేంద్ర : భావ వీణ,
రాధాపల్లి కేషన్స్, 4 వలైను
19 అడ్డరోడ్డు,
బ్రాడీపేట, గుంటూరు,
ఫిబ్రవరి, 1967.

ఆర్వీయార్ : సాహిత్య తత్వం
యుగసాహితి,
3/533, హోమస్ పేట,
ప్రొద్దుటూరు,
ప్రథమ ముద్రణ - 1980.

కాంతి కవాటం : మహాంధ్ర ప్రచురణలు,
90-సి, వెంకటాచలముదలి వీధి,
మైలాపూర్, మద్రాసు - 4.
ప్రథమ ముద్రణ - 1974.

గోపాల కృష్ణారావు, కె. : ఆంధ్ర శతక వికాసము
ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్ రోడ్డు,
హైదరాబాదు,
1976.

చంద్రశేఖరరావు, మద్దూరి, : చంద్రం వ్యాసాలు.
విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ - 2,
1974.

చెన్నయ్య, జి.
భాస్కర చౌదరి, బి. : కృష్ణశాస్త్రి జీవితం - సాహిత్యం
సమతా పబ్లికేషన్స్,
20-11-36/1, జైల్‌ఖానా వీధి,
చిత్తూరు,
1981.

దొరస్వామిశర్మ, రావూరి : తెలుగులో తిట్టు కవిత్వం,
యం. శేషాచలం అండ్ కో:
మద్రాసు,
ప్రథమముద్రణ - 1968.

నరసింహం, కె. వి. ఆర్ : ఆధునికాంధ్ర కవితా సమీక్ష,
గంగాధర పబ్లికేషన్స్,
విజయవాడ-2,
ప్రథమ ముద్రణ-1982.

నారాయణరావు, వెల్చేరు : తెలుగు కవితా విప్లవాల స్వరూపం,
విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ - 4
ప్రథమ ముద్రణ-1978.

నారాయణరెడ్డి, సి. : ఆధునికాంధ్ర కవిత్వం- సంప్రదాయములు-
ప్రయోగములు
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
సికింద్రాబాద్,
ద్వితీయ ముద్రణ - 1977.

| | | |
|---|---|---|
| ప్రభాకరశాస్త్రి, వేటూరి | : | చాటుపద్యమణి మంజిరి,<br>ద్వితీయభాగము, ప్రథమ సంపుటం,<br>శ్రీ ప్రభాకర పరిశోధక మండలి ప్రచురణ.<br>మణిమంజలి ముక్త్యాల [కృష్ణా],<br>మూడవ ముద్రణ, 1952. |
| ప్రభాకరశాస్త్రి, వేటూరి | : | శృంగార శ్రీనాథము.<br>ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్ లిమిటెడ్.<br>బెజవాడ,<br>1923. |
| బుద్ధదేవ వసూ | : | రవీంద్ర వ్యాసావళి,<br>ద్వితీయ సంపుటం,<br>సాహిత్య అకాడెమీ,<br>న్యూఢిల్లీ,<br>1962. |
| యువభారతి | : | కవితా లహరి,<br>5, కింగ్స్ వే,<br>సికింద్రాబాద్ - 3.<br>1976. |
| యువభారతి | : | చైతన్యలహరి<br>5, కింగ్స్ వే, సికింద్రాబాద్ - 3.<br>1972. |
| యువభారతి | : | మహతి.<br>5, కింగ్స్ వే, సికింద్రాబాద్-3<br>1972. |
| రంగనాథాచార్యులు, కె.కె (సం) | : | ఆధునిక తెలుగు సాహిత్యంలో<br>విభిన్న ధోరణులు, |

ఆంధ్ర సారస్వత పరిషత్తు,
తిలక్ రోడ్డు, హైదరాబాద్.

రమణా రెడ్డి. కె.వి. : మహోదయం,
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజయవాడ-2
1969.

రామకృష్ణ, మిరియాల : శ్రీశ్రీ కవిత్వం-వస్తువు సంవిధానం,
లక్ష్మీదేవి, 10-4-23, కాకినాడ-4,
ప్రథమ ముద్రణ-1980.

రామచంద్రారెడ్డి, రాచమల్లు : సారస్వత వివేచన,
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజయవాడ-4.

రామారావు, దేవులపల్లి : సారస్వత నవనీతము,
ఆంధ్ర సారస్వత పరిషత్తు,
బొగ్గుల కుంట, హైదరాబాదు.

రామిరెడ్డి, దువ్వూరి. : కవికోకిల గ్రంథావళి-4 వ్యాసములు,
కవికోకిల గ్రంథమాల,
నెల్లూరు,
ఆరవ ముద్రణ-1967.

రామ్మోహన్, సొదుం : సాహిత్యావలోకనం;
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజయవాడ-4,
ద్వితీయ ముద్రణ-1979.

లక్ష్మీకాంతం, పింగళి : ఆంధ్రసాహిత్య చరిత్ర,
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ,
కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్,
తృతీయ ముద్రణ.

లక్ష్మీకాంతం, పింగళి : సాహిత్య శిల్ప సమీక్ష,
క్వాలిటీ పబ్లిషర్స్,
రామమందిరం వీధి, విజయవాడ_2,
నాల్గవ ముద్రణ_1981.

వీర భద్రరావు, కొత్తపల్లి : తెలుగు సాహిత్యం పై ఇంగ్లీషు ప్రభావము,
రచయిత
ఫాకల్టీ అఫ్ ఆర్ట్స్, ఢిల్లీ విశ్వవిద్యాలయం,
ఢిల్లీ-6,
1960.

వెంకట సుబ్బయ్య, గొర్రెపాటి : తెలుగుసాహిత్యం తీరు తెన్నులు.
ప్రసాద్ పబ్లికేషన్స్,
ఏలూరు.

వెంకటావధాని, దివాకర్ల : సాహిత్య సోపానములు,
ఆంధ్ర సారస్వత పరిషత్తు,
తిలక్ రోడ్, హైదరాబాద్,
నాల్గవ ముద్రణ-1978.

శేషేంద్ర శర్మ, గుంటూరు. : కవిసేన మేనిఫెస్టో,
ఇండియన్, లాంగ్వేజస్‌ఫోరం,
జ్ఞాన్ బాగ్ పేలస్,
గోషామహల్, హైదరాబాద్,
ప్రథమముద్రణ_1977.

శ్రీకాంత శర్మ, ఇంద్రగంటి : సాహిత్య పరిచయాలు.
నవోదయ పబ్లిషర్స్,
విజయవాడ_2,
1978.

సత్యనారాయణ, యండమూరి. : ఉషః కిరణాలు,
ఉత్తమ సాహితి, పున్నమ్మతోట,

విజయవాడ,
ప్రథమముద్రణ-1960.

సుదర్శనం, ఆర్. యస్. : సాహిత్యంలో దృక్పథాలు,
నవోదయ పబ్లిషర్స్,
ఏలూర్ రోడ్డు, విజయవాడ-2.

సుబ్బారెడ్డి, పుద్దూరి : తెలుగులో జాతీయోద్యమ కవిత్వం,
రాగసుధా ప్రచురణలు,
518, బాలాజీ కాలనీ,
తిరుపతి-2,
ప్రథమ ముద్రణ-1982.

సుబ్బారెడ్డి, యం : సాహిత్య వివేచన,
యూనివర్సిటీ బుక్ సెంటర్,
ప్రకాశం రోడ్డు, తిరుపతి,
1974.

సుబ్రహ్మణ్యం, జి.వి : ప్రథమాంధ్ర మహాపురాణము-
ప్రబంధ కథా మూలము,
శ్రీవాణి ప్రచురణము,
శ్రీవాణి, 1-8-702/105 నల్లకుంట,
హైదరాబాదు-44,
ప్రథమముద్రణ-1973.

సుబ్రహ్మణ్యం, జి.వి. (సం) : సమాలోచనం,
(ఆధునికాంధ్ర సాహిత్య ప్రక్రియలపై
సమీక్ష)
ఆంధ్ర ప్రదేశ్ సాహిత్యఅకాడెమీ,
కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్,
ప్రథమ ముద్రణ-1980.

సోమసుందర్, ఆవంత్స : కృష్ణ కవితాత్మ.
యం. శేషాచలం అండ్ కో,
మచిలీ పట్టణం, -సికింద్రాబాద్.

స్ఫూర్తి శ్రీ : స్ఫూర్తి శ్రీ వ్యాసావళి,
రెండవ భాగము,
విపంచికా ప్రచురణలు,
ఎ.సి. కాలేజ్, గుంటూరు,
1965.

కావ్యాలు - కవితా సంపుటాలు :

అన్నమయ్య, తాళ్ళపాక : తాళ్ళపాక అన్నమయ్య శృంగార సంకీర్తనలు.
సంపుటం - 18. తి.తి. దేవస్థానం,
తిరుపతి.

అన్నమాచార్యులు, తాళ్ళపాక : తాళ్ళపాక సాహిత్యము - ఆధ్యాత్మిక
సంకీర్తనలు, (సంపుటము-1).
తి.తి. దేవస్థానములు, తిరుపతి,
1980.

అప్పల స్వామి, పురిపండా (సం) : సారంగపాణి పదములు,
ప్రాచీన గ్రంథావళి,
సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము,
1963.

అప్పారావు, బసవరాజు : బసవరాజు అప్పారావు, గీతాలు,
దేశీ కవితా మండలి,
బెజవాడ,
ద్వితీయ ముద్రణము-1945.

ఆంజనేయులు, కుందుర్తి : కుందుర్తి కృతులు,
ఎం.ఎస్. 19, మలక్ పేట కాలనీ,
హైదరాబాదు-36,
ప్రథమ ముద్రణ-1975.

కృష్ణశాస్త్రి. దేవులపల్లి : శ్రీదేవులపల్లి కృష్ణశాస్త్రి కృతులు,
(కృష్ణపక్షము ప్రవాసము, ఊర్వశి)
రౌతు చంద్రయ్య అండ్ సన్స్.
రౌతు బుక్ డిపో,
రాజమహేంద్ర వరము,
ఆరవ ముద్రణ-1967.

గంగప్ప, ఎస్ (సం) : సారంగపాణి పద సాహిత్యం,
శశీ ప్రచురణలు, సి-73 శ్రీనివాసనగర్
గుంటూరు.

తిలక్, దేవరకొండ బాలగంగాధర: అమృతం కురిసిన రాత్రి,
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజయవాడ-2,
ద్వితీయముద్రణ-1972.

దాశరథి : తిమిరంతో సమరం,
మహేంద్ర ప్రచురణలు,
90-సి, వేంకటాచల ముదలి వీధి,
మైలాపూర్, మద్రాసు-4,
ద్వితీయ ముద్రణము-1975.

ధూర్జటి, : కాళహస్తీశ్వర శతకము,
భక్తిరస శతకములు,
3వ సంపుటము, వావిళ్ళరామస్వామి
శాస్త్రులు అండ్ సన్సు,
చెన్నపురి,
1928.

శేషప్పకవి : నరసింహ శతకము,
భక్తిరస శతకములు,
3వ సంపుటము, వావిళ్ళరామస్వామి

శాస్త్రులు అండ్ సన్స్,
చెన్నపురి.
1928.

ముద్దు కృష్ణ : వైతాళికులు,
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజయవాడ - 4.
9వ ముద్రణ. -1978.

రాఘవ శర్మ, గురజాడ. (సం) : జాతీయ గీతాలు,
ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ,
కళాభవన్, సైఫాబాద్.
హైదరాబాద్,

రామకృష్ణారావు, అబ్బూరి : ఊహాగానము-ఇతరకృతులు,
15, సాధువాస్వానీమార్గ్.
న్యూఢిల్లీ -5
ప్రథమ ముద్రణ -1973.

రామిరెడ్డి, దువ్వూరి. : కృషీవలుడు,
కవికోకిల పబ్లికేషన్స్,
5వ సంస్కరణము,
1951.

లక్ష్మీకాంతం, పింగళి
వెంకటేశ్వర రావు, కాటూరి } తొలకరి.
త్రివేణీ పబ్లిషర్స్,
మచిలీ పట్టణం.

విశ్వేశ్వర రావు, మల్లవరపు : కళ్యాణ కింకిణి.
నవ్య సాహిత్య పరిషత్తు,
గుంటూరు -1938.

విశ్వేశ్వరరావు, మల్లవరపు : మధు కీల,
నవ్య సాహిత్య పరిషత్తు,

రాజన్ ఎలక్ట్రిక్ ప్రెస్.
రాజమహేంద్రి వరము,
ప్రథమ ముద్రణ -1937.

వెంకట పార్వతీశ్వర కవులు : ఏకాంతసేవ.
ఆంధ్రప్రచారిణీ లిమిటెడ్.
కాకినాడ,
1938.

వెంకట పార్వతీశ్వర కవులు : కావ్య కుసుమావళి.
ద్వితీయ భాగము,
ప్రథమ సంపుటి.
ఆంధ్ర ప్రచారణీ లిమిటెడ్, కాకినాడ.

వెంకట సుబ్బారావు, నండూరి : యెంకి పాటలు.
ఉదయ భాస్కర పబ్లిషర్స్.
మెయిన్ రోడ్డ్.
విజయవాడ.

వెంకటేశ్వర రావు, కాటూరి : పన్నీటిజల్లు.

వెంకటేశ్వర రావు, కాటూరి : పౌలస్త్య హృదయము : గుడిగంటలు,
త్రివేణీ పబ్లిషర్స్, మచిలీపట్టణం.

శివశంకర శాస్త్రి, తల్లావఝ్ఝల : హృదయేశ్వరి,
సాహితీ సమితి, రేపల్లె.
ద్వితీయ ముద్రణ -1954.

శేషేంద్ర శర్మ, గుంటూరు : రక్త రేఖ.
ఇండియన్ లాంగ్వేజస్ ఫోరమ్,
జ్ఞాన్ బాగ్ పాలెస్, గోషామహల్,
హైదరాబాదు.

శేషేంద్రశర్మ, గుంటూరు : శేష జ్యోత్స్న.
ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,

3237, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్,
ప్రథమ ముద్రణ_1972.

సత్యనారాయణ, విశ్వనాథ : గిరికుమారుని ప్రేమగీతాలు,
శ్రీ వరలక్ష్మి ముద్రశాల,
విజయవాడ,
1953.

సత్యనారాయణ, వేదుల : దీపావళి,
త్రివేణీ పబ్లిషర్స్, మచిలీపట్టణము,
4వ కూర్పు, 1957.

సీతాపతి, గిడుగు (సం) : క్షేత్రయ్య పదములు,
కుబేర ప్రింటర్స్ లిమిటెడ్.
మద్రాసు_2,
1957.

సీతారామమూర్తి చౌదరి, తుమ్మల : పఱిగ పంట,
రామమోహన గ్రంథమాల.
యనమలకుదురు,
విజయవాడ,
1952.

సుబ్బారావు, నాయని : నాయని సుబ్బారావు కృతులు,
సంకలిత సంపుటి, అజంతా ప్రింటర్స్,
సికిందరాబాదు,
ప్రథమ ముద్రణ_1958.

సుబ్బారావు, నాయని : మాతృగీతాలు,
స్వతంత్ర భారతీ ప్రచురణములు,
నరసరావుపేట,
రెండవ ముద్రణ_1948.

సుబ్బారావు, నాయని : సౌభద్రుని ప్రణయ యాత్ర,
సర్వోదయ ప్రచురణలు,

నరసరావుపేట.
ద్వితీయ ముద్రణ -1950.

సుబ్బారావు, రాయప్రోలు : కావ్య కుండిక - షష్ట్యబ్ది పూర్తిముద్రణము.
లలిత కుటీరము, మారేడుపల్లి.
సికిందరాబాదు.
ప్రథమ ముద్రణము -1953.

సుబ్బారావు, రాయప్రోలు : జడకుచ్చులు,
ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల,
బెజవాడ.
1925.

సుబ్బారావు, రాయప్రోలు : వనమాల.
విశ్వజనని గ్రంథావళి,
ది ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ,
మద్రాసు - తెనాలి,
ప్రథమ ముద్రణ -1941.

ఇంగ్లీషు :

Brown, G.M : The Romantic Imagination
Geoffrey Cumberlege,
Oxford University Press,
London.

Bush Douglas : English Poetry: The Main Currents, from Chaucer to the Present,
University Paper Backs,
Mathuen and Co., Ltd.,
2nd New Fettor Lane,
London, E.C.4,
Reprinted 1971.

Cuddon J.A., : A Dictionary of Literary Terms
Indian Book Co.,

36, C. Cannaught Place,
New Delhi,
1977.

Eliot, T.S. : The Use of Poetry and the use of Criticism,
Faber and Faber
3 Queen Square,
London,
Reprinted 1975.

Fry Narthrop : Romanticism Reconsidered
Columbia Univresity Press.
New york and London

Gurrey, P. : The appreciation of poetry,
Oxford University Press,
Amen House, London,
1965.

Harvey, W j. and Richard Gabril (ed.) : Words Worth - The Prelude,
The Macmillan Press Ltd.,
London and Basingstoke,
1972.

Houg Graham ; Image and Experience,
Studies in a Literary evolution.
Gerald DucKworth and Co,Ltd,
3, Hemitta Street, London, W.C.2

Hudson, William Henry : An Introduction to the Study of Literature,
George G. Harrap and Co., Ltd.,
London,
Reprinted 1958.

Ker, W.P. : Form and Style in Poetry,
Macmillan,
Malbourne, Torinto,
London, 1966.

Pound, Ezra : The Spirit of Romance,
A New Directions Book,

James Laughlin,
Norfork, Connecticut,
New York - 14.

Prickett, Stephen : Romanticism and Religion,
The Tradition of Coleridge and Words Worth in the Victorian Church,
Cambridge University Press,
Cambridge : London,

Read, Herbert : The True Voice of Feeling
Studies in English Romantic Poetry.
Faber and Faber,
24, Russell Square.
London.

Scott, Willibur, S : Five Approaches of Literary Criticism,
Collier Books, New York,
1972.

Shaw, Harry : Dictionary of Literary Terms
MC Graw - Hall Book Co.,
New York,
1972.

Symons, Arthur : The romantic Movement in English Poetry,
Archibald Constable and Co Ltd,
London,
1909.

అముద్రితాలు :

చంద్రమౌళి, ఎలవర్తి : తెలుగులో స్మృతి కవిత్వం,
లఘుసిద్ధాంత వ్యాసం. శ్రీవేంకటేశ్వర
విశ్వవిద్యాలయం, తిరుపతి.
1978.

James Laughlin,
Norfork, Connecticut,
New York - 14.

Prickett, Stephen : Romanticism and Religion,
The Tradition of Coleridge and Words Worth in the Victorian Church,
Cambridge University Press,
Cambridge : London,

Read, Herbert : The True Voice of Feeling
Studies in English Romantic Poetry.
Faber and Faber,
24, Russell Square.
London.

Scott, Willibur, S : Five Approaches of Literary Criticism,
Collier Books, New York,
1972.

Shaw, Harry : Dictionary of Literary Terms
MC Graw - Hall Book Co.,
New York,
1972.

Symons, Arthur : The romantic Movement in English Poetry,
Archibald Constable and Co Ltd,
London,
1909.

అముద్రితాలు :

చంద్రమౌళి, ఎలవర్తి : తెలుగులో స్మృతి కవిత్వం,
లఘుసిద్ధాంత వ్యాసం. శ్రీవేంకటేశ్వర
విశ్వవిద్యాలయం, తిరుపతి.
1978.

కుటుంబరాయశర్మ, బొడ్డపాటి - రసభావ కవిత్వము భారతి, జూలై 1940.

,, విపర్యకవిత్వము, భారతి ఏప్రిల్, 1941.

కృష్ణశర్మ, దేశిరాజు - నవ్య కవితా తత్వము, భారతి ఏప్రిల్, 1950.

గంగాధరం, సూతలపాటి - దిగంబర కవిత దాని స్థానం, భారతి, అక్టోబర్, 1969.

జగన్నాధరావు, కటికినేని - ఆధునిక ఆంధ్ర కవిత్వము (సింహావలోకనము) భారతి, మే, 1940.

తా. రా. నాయనివారి ప్రణయ సూక్తం. భారతి, మార్చి, 1960.

తిరుమలరావు, సర్దేశాయి. - కృష్ణశాస్త్రి రొమాంటిసిసమ్ (చర్చావేదిక) భారతి, ఫిబ్రవరి, 1977.

,, రొమాంటిసిసమ్, భారతి, సెప్టెంబరు. 1977.

నరసింహశాస్త్రి, నోరి - అరవై యేండ్ల ఆంధ్ర సాహిత్యంలో నిలిచేది, భారతి, జనవరి, ఫిబ్రవరి, మార్చి, 1974.

నారాయణరావు, రంగినేని - శతకాల్లో ఆత్మాశ్రయత్వం, నెలవంక, సాహిత్యవార్షిక సంచిక, 1982.

పున్నయ్య శాస్త్రి, భారతుల - భావకవిత్వము, భారతి, జనవరి, 1938.

మందేశ్వర రావు, వడలి - క్లాసిక్, రొమాంటిక్: భారతి, ఫిబ్రవరి 1979.

రమణారెడ్డి, కె.వి. - శ్రీశ్రీ వినిపించిన భువన ఘోష, ఆంధ్ర ప్రభ దినపత్రిక, 31 మే, 1981,

రాజగోపాల రావు, దామోదర - తెలుగు కవిత్వంలోని క్రొత్తదనం, భారతి ఏప్రిల్, 1940.

రామకోటి శాస్త్రి, కేతవరపు - కవిత్వము - కావ్యవస్తువు - కావ్యకథ, భారతి, ఏప్రిల్, 1971.

రామకోటి శాస్త్రి కేతవరపు - భావకవిత్వ వివాదము,
విమర్శిని, పరిశోధన పత్రిక, తెలుగువిభాగము.
స్నాతకోత్తర విద్యాకేంద్రము, వరంగల్లు.
జనవరి, 1976.

రామమోహనరావు, జి - బసవరాజు 'ఎలిజీలు', భారతి, మార్చి. 1968

రామలింగం, డి. - కాల్పనిక కవితకు కలికి తురాయి-
కృష్ణశాస్త్రి కవిత్వం, భారతి, ఏప్రిల్ 1980

రామలింగేశ్వరరావు, తుమ్మలపల్లి- ఈనాటి సాహిత్యంలో స్థితిగతులు,
భారతి, మే, 1966.

లక్ష్మీనారాయణ, గంగిశెట్టి - ఈనాటి కవిత, భారతి, జనవరి, 1975.

లీలారామమోహనరావు, కొడవంటి- అనుభూతి కవిత్వం భారతి, ఫిబ్రవరి, 1982

విశ్వనాథశాస్త్రి, సరిపెల్ల - ఆధునికాంధ్ర వాఙ్మయమున భావము-
భావగీతాములు, భారతి, ఏప్రిల్, 1948.
,, ఆంధ్రవాఙ్మయమున రొమాన్సు,
భారతి, జూలై, 1948.

వీర రాఘవాచార్యులు, కొండూరు - కవి హృదయము, భారతి. సెప్టెంబర్ 1939.

వెంకటసుబ్బరామయ్య, గొరావఝ్ఝుల- నేటితెలుగు కవిత్వపు పోకడలు,
భారతి, జనవరి, 1946.

వెంకట హనుమంత రావు, పిల్లలమఱ్ఱి- అభినవ కవిత, భారతి, జనవరి, 1946.

శివరామశాస్త్రి, వేలూరి - ఉపనిషత్తులలో ఆత్మ, భారతి, జనవరి,
1980.

శ్రీరాం, కె. - ఇంగ్లీషు రొమాంటిక్ కవులు,
భారతి, డిసెంబరు, 1956.

సత్యనారాయణ, విశ్వనాథ - లిరికల్ పొయిట్రీ, భారతి, అక్టోబర్, 1939

సుందరేశ్వర రావు, - కృష్ణశాస్త్రి - 1948. భారతి, మే, 1980.

సుప్రసన్నాచార్య, కోవెల - నవ్యకవిత్వారంభము విమర్శిని. పరిశోధన పత్రిక, జనవరి, 1976.

సుబ్బారావు, రాయప్రోలు - అభినవాంధ్ర కవి పండిత సమ్మేళనము (అధ్యక్షోపన్యాసము) భారతి, ఫిబ్రవరి, 1934.

సురభి - ప్రవాసం - ఊర్వశి. భారతి, నవంబర్ 1952.

సోమసుందర్, - సమాజ హృదయం, సాగరం- కవిత్వం ఒక జీవనది. ఆంధ్రప్రభ దినపత్రిక 1 జూన్, 1980.

'హిమానీ' - భావవైశిష్ట్యత. భారతి అక్టోబర్ 1939.

సంప్రదించిన వ్యక్తులు :

చండీ దాస్, వడ్డెర - లెక్చరర్, డిపార్టుమెంట్ ఆఫ్ ఫిలాసఫీ శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి.

రామకోటి శాస్త్రి, కేతవరపు - రీడర్. తెలుగు శాఖ, కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్లు.

ఆకులో ఆకునై
పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై
నునులేత రెమ్మనై
ఈ యడవి దాగిపోనా?
ఎటులైన నిచటనే యాగిపోనా?

- కృష్ణశాస్త్రి